# ప్రకృతి అందాలకు నెలవులు

# మాల్దీవులు



హిందూ మహాసముద్రమనే సుందరి కంఠాన కాంతులీనే మణిహారంలా ప్రకృతి అందాలకు పట్టుకొమ్మయిన మాల్దీవులు లక్షలాది సందర్శకులను ఆకర్షిస్తున్నాయి. పచ్చని వృక్షసంపదతో శోభాయమానంగా కనపడే ఈ దీవులకు చుట్టూ ధవళకాంతుల్లో మెరిసే బీచ్‌లు మరింత వన్నెతెస్తున్నాయి. వెనిస్ యాత్రికుడు మార్కోపోలో ఈ దీవుల్ని 'ఫ్లవర్ ఆఫ్ ది ఇండీస్' అని వర్ణించాడు. ఇబన్ బటూటా వీటిని గురించి 'ప్రపంచ వింతల్లో ఒకటి' అన్నాడు.

వెయ్యిదాకా దీవులున్న ఈ ప్రాంతం 26 ఎటాల్స్‌గా విభజింపబడింది. ఈ దీవులు విస్తరించిన దూరం తొంభైవేల చదరపు కిలోమీటర్లు. మాల్దీవి భాషలోని 'అతోలు' అనే పదంనుంచి వచ్చిన పదం 'ఎటాలె' అంటే 'చిన్న ద్వీపం'గా అర్థంచేసుకోవచ్చు.

సముద్రంలో నివశించే ఎన్నో జలచరాలు, వృక్షమో జంతువో తెలియని కోరల్స్‌వంటి జలజీవాలు ఇక్కడి సముద్ర జలాల్లో లెక్కకు మిక్కుటంగా కనిపిస్తాయి. ఈ దీవులకు అటూ ఇటూ సన్నిహితంగా వుండే దేశాలు ఇండియా, శ్రీలంకలు. రెండు లక్షలకు మించిన జనాభాగల ఈ దీవుల్లో 199 మాత్రమే జనావాసాలుగా వున్నాయి. 74 దీవులు కేవలం సందర్శనాస్థలాలుగా వుండి ప్రపంచ ప్రజల్ని ఆకర్షిస్తున్నాయి. మాల్దీవుల్లో 5000 సంవత్సరాలనుంచీ జనాభా నివశిస్తున్నట్టు చరిత్ర చెబుతోంది. ప్రపంచంలో అనేక ప్రాంతాల వ్యాపారస్థులు మాల్దీవులనుండి వ్యాపార మార్గాలున్నట్టు తెలుసుకుని అక్కడ

స్థిరపడినట్లు తెలుస్తోంది. ఈ దీవుల్లో అన్నిచోట్లా 'ధివేహి' భాష వాడుకలోవుంది. ప్రభుత్వ కార్యాలయాల్లో కొద్దిగా ఇంగ్లీషు వాడుకలో వుంది. అరబ్బుల ప్రభావం ఈ దీవులమీద గాఢంగా వున్నట్టు తెలుస్తోంది. 1965లో ఈ మాల్దీవులు పూర్తి స్వాతంత్ర్యాన్ని పొందాయి. 1968 నవంబరు 11 నుంచి సుల్తానుపాలన అంతరించి రిపబ్లిక్‌గా మారాయి ఈ దీవులు.

భూమధ్యరేఖకు దగ్గరగా వుండటంతో సంవత్సరంలో సగటున గరిష్ఠ ఉష్ణోగ్రత 30.4 డిగ్రీల సెల్సియస్ వుంటే కనిష్ఠ ఉష్ణోగ్రత 25.4 డిగ్రీల సెల్సియస్ వుంటుంది. మాల్దీవులకొచ్చే పర్యాటకులు చాలామంది విమానాల్లోనే వస్తారు. మాల్దీవుల అంతర్జాతీయ విమానాశ్రయం మాలేదీవిలో వుంది. ఇది మాల్దీవుల ముఖ్యపట్టణం.

ముఖ్యంగా డిసెంబరునుంచి మార్చివరకు పర్యాటకుల రద్దీ ఎక్కువగా వుండటంతో హోటలు గదులు మొదలైనవి ముందుగానే బుక్ చేసి పెట్టుకోవలసి వుంటుంది. వివిధ దీవుల్లో వున్న హోటళ్లకి పర్యాటకులను తీసుకువెళ్లడానికి లైసెన్స్ కలిగిన చిన్నచిన్న పవర్‌బోట్లు ఎప్పుడూ సిద్ధంగా వుంటాయి. ఒక్కొక్క దీవిలో ఒక్కొక్క హోటలు మాత్రమే వుండి ప్రతి దీవీ దేనికదే ఒక భూతలస్వర్గంలా తోస్తుంది.

హోటళ్లనానుకుని ఉన్న బీచ్‌లు సూర్యస్నానాలు చేసే సందర్శకులతో చూడముచ్చటగా వుంటాయి. దీవులకు చుట్టూ అక్కడక్కడ చిన్నచిన్న నీటిమడుగులు సూర్యకాంతి పడి బంగారు రంగులో మెరుస్తుంటే, వాటిల్లో పిల్లలు ఆడుకునే దృశ్యం కనువిందు చేస్తుంది.

వ్యవసాయ విషయానికొస్తే ఇక్కడ ఎక్కువగా కనిపించేవి కొబ్బరితోటలే. అరటి, బొప్పాయి, పుచ్చ, మామిడి, యాపిల్స్, జామ, సీతాఫలం, నేరేడు మొదలైన ఫలవృక్షాలు అక్కడక్కడ వుండి మంచి ఫలసాయాన్నందిస్తున్నాయి.

చిన్న ఉల్లిపాయలు, పచ్చిమిర్చి ఇంచుమించు అన్ని దీవుల్లోను విరివిగా పండుతాయి. ఇవిగాక గుమ్మడి, ములగ, బీన్స్, కాబేజి, వంగ, కాకరలాంటి కూరగాయలు కూడా విస్తారంగానే కాస్తాయి. కానీ దీవులలోని జనాభా మొత్తానికి ఇవి చాలకపోవ





డంతో కూరగాయలను దిగుమతి చేసుకుంటారు.

కోళ్ల పరిశ్రమ వున్నా ప్రజలందరికీ సమృద్ధిగా చాలకపోవడంతో గుడ్లు, చికెన్‌లాంటి ఆహారపదార్థాలను కూడా అధిక మొత్తంలోనే దిగుమతి చేసుకుంటున్నాయి ఈ దీవులు.

బోట్ల తయారీ, చాపల అల్లిక, తాళ్ల తయారీ, చేతి పరిశ్రమలు, ఇంకా... చిన్నతరహా పరిశ్రమలు అక్కడక్కడ అభివృద్ధి చెందుతున్నాయి. వాళ్లకి అత్యంత ముఖ్యమైన ఆదాయం చేపల వ్యాపారంద్వారా, పర్యాటకులవలనా లభిస్తుంది. ఇక్కడినుంచి నిత్యం టన్నులకొద్దీ చేపలు ఎగుమతి అవుతూవుంటాయి. అలాగే మాల్దీవులను సందర్శించే పర్యాటకుల సంఖ్య కూడా అధికమే.

ఇతర దీవులనుంచి ముఖ్య పట్టణమైన మాలేకు వ్యాపారనిమిత్తం వచ్చే జనాభాతో మాలే బజార్లెప్పుడూ జనసందోహంతో నిండి వుంటాయి.

జనాభాలో 48 శాతం మంది స్త్రీలున్నారు. దేశంలో వివిధ భాగాల్లో పనిచేసే జనాభాలో నాలుగవ వంతు మంది స్త్రీలున్నారు. అన్నిరకాల పదవుల్లోను స్త్రీలున్నారక్కడ. వృత్తి ఉద్యోగాలన్నిటిలోను స్త్రీలకి పురుషులతోపాటు సమాన హక్కులను, గౌరవాలను కలిగించింది అక్కడి ప్రభుత్వం. అక్కడి స్త్రీలలో చాలామంది ఉపాధ్యాయ వృత్తి అంటే బాగా ఇష్టపడతారు.

ఆటలన్నిటిలోను భాషి అనే ఆట సాంప్రదాయ బద్ధమైనదైనా, ఇప్పటికీ దేశం మొత్తంమీద ఆ ఆటను తరచు ఉత్సాహంగా

ఆడతారు. అమెరికన్ 'బేస్‌బాల్' ఆటలా అనిపించే 'ముగాలీ' ఆటను కూడా ఇక్కడి స్త్రీలు ఉత్సాహంగా ఆడతారు. ఇవికాక బ్యాడ్ మింటన్, టేబిల్ టెన్నిస్, పరుగుపందాలు మొదలైన అన్ని పోటీల్లోను స్త్రీలు కూడా ఉత్సాహంగా పాల్గొంటారు.

ఇక్కడి ప్రాధమిక విద్యావిధానం, శిక్షణా సంస్థలు నాలుగు విధాలుగా విభజించబడ్డాయి. (1) కియావాగే (2) ముఖ్తాబ్ (3) మధురాసా (4) స్కూళ్లు.



కియావాగే అనేది ప్రైవేటు సంస్థ ఇందులో పిల్లలకి ఖురాను చదవడం నేర్పిస్తారు. మాతృభాష అయిన ధివేహిని చదవడం, వ్రాయడం నేర్పుతారు. దాంతోపాటు అర్థమెటిక్ కూడా నేర్పుతారు. మఖ్తాబ్‌లో ఇవే పాఠాలు మరికొంచెం ఎక్కువగా నేర్పుతారు. ఇస్లాం మతాన్ని గుర్చి పూర్తి అవగాహన కలిగేలా పిల్లలకు శిక్షణనిస్తారు ఇక్కడ. ఇది కూడా ప్రైవేటు సంస్థే. మధురాసాలో వీటితో పాటు ఇంకా అనేక ఇతర సబ్జక్టుల్లో కూడా శిక్షణనిస్తారు. ఈ విద్యాసంస్థలన్నీ దేశ నాగరికతను, సంప్రదాయాన్ని నిలబెడుతున్నట్టు భావిస్తారు మాల్దీవుల ప్రజలు.

ఇంక స్కూళ్ల విషయానికొస్తే 1961లో ఇంగ్లీషు కాన్వెంటు విద్యావిధానం ప్రారంభమయింది. ఈ స్కూళ్లు ఎక్కువగా ప్రధాన పట్టణమైన మాలేలో వున్నాయి. ఈ చదువు

కోసం ఇతర ఎటాల్స్‌నుంచి కూడా విద్యార్థులు మాలే వచ్చి చదువుకుంటారు. మాధ్యమిక విద్యకు సంబంధించిన 'సైన్స్ ఎడ్యుకేషన్ సెంటర్' మాలేలోనే వుంది.

వైద్యరంగం కూడా మాల్దీవుల ప్రజలకు చాలినంత సేవలనందిస్తోంది. ఒక్క మాలేలోనే 21 ప్రైమరీ హెల్త్‌కేర్ సెంటర్లు, నాలుగు రీజినల్ ఆసుపత్రులు, ఒక సెంట్రల్ ఆసుపత్రి వున్నాయి. అక్కడ 'ఇందిరా గాంధీ జనరల్ హాస్పిటల్' ఒక్క స్థానిక రోగులనుంచేకాక, అక్కడికి వచ్చే పర్యాటకులనుంచి కూడా పొగడ్తలనందుకుంది.

మలేరియాలాంటి అంటువ్యాధులు, డయేరియాలాంటి ప్రాణాంతక వ్యాధులను కూడా చాలావరకు అరికట్టగలిగింది అక్కడి వైద్యరంగం.









తాగే నీటికి చాలా ఇబ్బంది ఎదుర్కొంటున్నారు మాల్దీవుల ప్రజలు. ముఖ్యంగా వాడకం నీరుపోయే మార్గాలు సరిగ్గా లేనందువల్ల భూమికి రెండు మీటర్లలోతున తవ్వే మంచినీటి బోరింగులద్వారా వచ్చే నీరు బాక్టీరియాతో నిండివుండి నీటిద్వారా సంక్రమించే ఎన్నో రోగాలకు కారణమవుతోంది. అక్కడ అధికశాతం జనం ఈ రోగాలవలనే చనిపోతున్నారని తెలుస్తోంది. అందుకే మాల్దీవుల ప్రజలు వర్షపునీటిని పెద్దపెద్ద ట్యాంకుల్లో నిలువచేసి, వాటిని శుద్ధిచేసి తాగడానికు పయోగించుకుంటారు. ఆ దీవుల్లో ఎక్కడ చూసినా వర్షపునీటిని నిలువచేసే పెద్దపెద్ద ట్యాంకులు దర్శనమిస్తాయి. అదే కాకుండా 'మాల్దీవ్స్ వాటర్ అండ్ శానిటేషన్ అథారిటీ' స్వచ్ఛమైన, పరిశుభ్రమైన, ఆరోగ్యకరమైన మంచినీటి సరఫరాకు సంబంధించిన ప్రాజెక్టును యునిసెఫ్ సహాయంతో చేపట్టింది.

మాలేలో సుల్తాన్ పార్క్‌లో వున్న 'నేషనల్ మ్యూజియం' కూడా చూడదగిన ప్రదేశాల్లో ఒకటి. రోజూ ఉదయం 9 గంటలనుంచి మధ్యాహ్నం 3 గంటలవరకు ఈ మ్యూజియం తెరచి వుంటుంది. శుక్రవారం, ప్రత్యేక సెలవు దినాల్లో దీన్ని మూసి వుంచుతారు. చరిత్రయందు ఆసక్తిగలవారికి ఈ మ్యూజియం ఎంతో సమాచారాన్ని అందిస్తుంది. ఇది 1952 నవంబర్ 19న అప్పటి ప్రధాని అమీర్‌మహమ్మద్ అమీన్ చేత ప్రారంభించబడింది.

పూర్వ ఇస్లామిక్ కాలానికి చెందిన ఎన్నో రాతివస్తువులు, రాజ సింహాసనాలు, పల్లకీలు, వివిధ కాలాల రాజులు, రాణులు ధరించిన వస్త్రాలు, ఆభరణాలు మొదలైనవెన్నో ఈ మ్యూజియంలో భద్రపరచబడి సందర్శకులను ఆకర్షిస్తున్నాయి.

అన్ని వస్తువుల్లోకి ముఖ్యమైనదిగా ప్రశంసించబడే బుద్ధుని తల ఎర్రని రాళ్లతో చెక్కబడి చూపరులను అమితంగా ఆకర్షిస్తోంది. దీన్నిబట్టి చూస్తే ఇస్లాంమతానికి పూర్వం బౌద్ధమతం, అంతకుముందు హిందూమతం కూడా ఈ దీవుల్లో ప్రచారంలో వున్నట్టు అక్కడి వస్తువులు చెబుతున్నాయి. ఇవికాక దేశంకోసం పోరాడిన ఎంతోమంది వీరుల చిత్రపటాలు ఈ మ్యూజియంలో చోటుచేసుకున్నాయి.






మాల్దీవుల ముఖ్యపట్టణమైన మాలే ఓ పెద్ద వ్యాపారకేంద్రంగా ప్రసిద్ధిగాంచింది. 1.77 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంగల మాలేలో సుమారు అరవైవేలమంది జనాభా నివసిస్తున్నారు. ఒకప్పుడు దీన్ని 'సుల్తాను గారి దీవి' అని వ్యవహరించేవారు. అక్కడున్న మసీదుల్లోకెల్ల పెద్దదీ, ప్రఖ్యాతిగాంచినదీ 'మస్జిద్-అల్-సుల్తాన్ మొహమ్మద్-థకురుపాను-అల్-ఎ అజామ్' మసీదు. బంగారు గోపురంతో కాంతులీనే ఈ మసీదు మాల్దీవులకే మకుటాయమానంగా శోభిల్లుతూ వుంటుంది. 5000 మంది ఇస్లాంమతస్థులు ఒకేసారి నమాజు చేసుకోగలరీ మసీదులో ఈ కట్టడ విశేషాన్ని మాలే వచ్చిన పర్యాటకులంతా తప్పక చూసి వెడతారు.

ఇక్కడి చేపల బజార్లను ఎప్పుడూ పరిశుభ్రంగా వుంచుతారు మత్స్యవ్యాపారులు. రకరకాల ఆకార పరిమాణాల్లో వింతవింత రంగుల్లో గుట్టలుగా పోయబడిన చేపలు ఓ అద్భుతదృశ్యం అక్కడ.

కెమేరాలు, వీ.సి.ఆర్‌లాంటి ఎలక్ట్రానిక్ వస్తువులు, సెంట్లు, పౌడర్లు మొదలయిన ఎన్నో సౌందర్యసాధనాలు మాలేలోని ఇంపోర్టెడ్ షాపుల్లో విరివిగా దొరుకుతాయి.

మాల్దీవుల కరెన్సీ 'రూఫియా'! దీన్ని 100 'లారీ'లుగా విభజిస్తారు. ఈ లారీలు 1, 2, 5, 10, 27, 50 నాణేలుగా ఉంటాయి. 100 లారీల నాణెం ఒక రూఫియాకు సమానం. ఫారిన్ కరెన్సీగా అమెరికన్ డాలర్లు వాడకంలో వున్నాయి.

ప్రజలు తేలికపాటి నూలువస్త్రాలు ధరిస్తారు. ముఖ్యమైన కార్యక్రమాల్లో ప్రత్యేక దుస్తులు ధరిస్తారు. నగ్నంగా కనిపించడం అక్కడ నేరం.

సముద్రంలో ఈతకొట్టడం, లేదా సముద్రాంతర్భాగంలోనికి డైవ్ చేసుకుంటూ వెళ్లేవారికి మాల్దీవులు మరిచిపోలేని అనుభూతి. అక్కడి సముద్రజలాల్లో నివసించే భయంకర వృక్ష, జంతుసముదాయాన్ని చూసి నివ్వెరపోతూవుంటారు ఈతగాళ్లు. అక్కడ ప్రతిచోటా డైవింగ్ స్కూళ్లు వుంటాయి. ఎంతో మంది పిల్లలు డైవింగ్ నేర్చుకుంటారు. ఇంచుమించు 90 శాతం సముద్రమే ఆవరించి వుండటంతో అక్కడి బోట్లు ప్రపంచంలోని మిగతా ప్రాంతాల బోట్లకంటె గట్టిగా పకడ్బందీగా తయారుచేయబడినవిగా పేరుపొందాయి.

అక్కడి సముద్రజలాల్లో సుమారు 1000 రకాల చేపలున్నట్టు తెలుస్తోంది. చేపలను పట్టుకోవడంలో కూడా వారు ఎన్నో పద్ధతులను పాటిస్తారు. ఒక్కొక్కరకం చేపని ఒక్కొక్క ప్రత్యేక సమయంలో అదునుచూసి పడతారు జాలరులు.

నీలిసముద్రజలాలపై తారాహారంలా మెరిసే ఈ దీవులను విమానంలోంచి తిలకించడం మరింత అందమైన అనుభూతి అంటారు పర్యాటకులు.

-రాధాశివమోహన్



## నా గురించి

నేను 23-12-1922న పొందూరు గ్రామంలో జన్మించాను. మా అమ్మ సుందరమ్మ. మా నాన్నగారు లక్ష్మీనారాయణగారు. హైస్కూలు చదువులు శ్రీకాకుళంలో పూర్తిచేశాను. విశాఖపట్నంలో ఇంటరు పాసయి, రైల్వేలో చాలా చిన్న ఉద్యోగంలో చేరి, నలభై సంవత్సరాలు పనిచేసి, మొదటి తరగతి గజిటెడ్ ఆఫీసరుగా రిటైరయ్యాను. ప్రభుత్వంవారు పంపితే, నాలుగున్నర నెలలు అమెరికాలో డీసెల్ యింజన్లమీద ప్రత్యేకమైన శిక్షణ పొందాను. సాహిత్యంకోసం, ప్రయివేటుగా, బి.ఏ. పాసయ్యాను. అదేవిధంగా ఇంజనీరింగు పరీక్షలయిన తరువాత, ఇంగ్లీషు, సంస్కృతం, తెలుగు భాషలలో ఎమ్.ఏ. డిగ్రీలు పుచ్చుకున్నాను. ఆచార్య తూమాటి దోణప్పగారి ఆధ్వర్యంలో మూడు సంవత్సరాలు తెలుగు కథానికమీద పరిశోధన జరిపాను. అది ఇప్పటికీ పూర్తికాలేదు. అరవైకి పైగా కథానికలు, పన్నెండు నవలలు, చాలా వ్యాసాలు రచించాను. పరుగులిడే చక్రాలు-ప్రవహించే జీవిత వాహినికి రెండవ బహుమతి, శ్రామిక శకటం, విజయవాడ జంక్షన్, సుందరం అన్న నవలలకు మొదటి బహుమతులు లభించాయి. కేంద్రసాహిత్య అకాడమీవారికి బర్టన్ అరేబియన్ నైట్సులో కొన్ని కథలను వేయిన్నొక్క రాత్రులుగా అనువదించాను.

పసిడిపంజరం"ని పోటీలో సాధారణ ప్రచురణకు అంగీక రించిన చతుర యాజమాన్యానికి నా కృతజ్ఞతలు.

# చతుర

సంపుటి: 18 సంచిక: 12
జనవరి 1996

మరోవారం రోజుల్లో వివాహం కానున్న ఆ పదహారేళ్ళ అమ్మాయి తాను అత్తవారింటికెళ్ళేలోగా రాణీవారి దర్శనం చేసుకోవాలని, వారి అంతఃపురాన్ని ఓసారి చూడాలనీ కోరుకుంది.

ఈ విషయాన్ని తెలుసుకున్న రాణీవారు ఆమెను ఆహ్వానిస్తూ పల్లకీ పంపారు. అంతఃపురంలో అడుగుపెట్టిన ఆ మెరుపుతీగను చూసి, సహజంగా అందగత్తె అయిన రాణీవారే తెల్లబోయారు.

ఆ సందర్శనాభిలాషే... ఆ అంతఃపుర దర్శనమే కాలసర్పంలా బుసకొట్టి... ఆ పెళ్లికూతురి జీవన నౌకని తుఫానులా చుట్టుముట్టి అల్లకల్లోలం చేసింది. అటుపైన ఆమె ఎదుర్కొన్న అనుభవాలు, అనుభవించిన జీవితం.......... ఎలాంటివి?

ఉత్కంఠతో చదివించే ఘండికోట బ్రహ్మాజీరావు రచన 'పసిడిపంజరం' ఈ నెల చతుర సమగ్ర నవల.

## పసిడిపంజరం

ఘండికోట బ్రహ్మాజీరావు



పాతికేళ్లక్రితం చంద్రశేఖరం బోర్డు కట్టిన తొలిరోజు ఉదయం తొమ్మిది గంటలకో క్లయింటు వచ్చాడు.

వచ్చిన మనిషి ఆజానుబాహువు. సన్నటి పాటినూలు పంచకట్టుకున్నాడు. నిండు చేతుల తెల్లని ఖద్దరు చొక్కా తొడుక్కున్నాడు. భుజం మీద ఇస్త్రీ మడతచేసిన కండువా వేసుకున్నాడు. తలమీద తెల్లని పాగా పెట్టుకున్నాడు. కాళ్లకున్న విలువైన చెప్పులు గది గుమ్మం దగ్గిర విడిచి లోపలికి ప్రవేశించాడు.

ఆగంతకుడు చంద్రశేఖరానికి నమస్కారం చేసి, తనకు చూపించిన కుర్చీమీద టేబులుకు రెండో వేపు కూర్చున్నాడు. తల మీదనున్న పాగా తీసి టేబులు మీదపెట్టాడు.

అతని వయసు ఏభై సంవత్సరాలకు మించదు.

పెద్దమీసాలు, ఉంగరాలజుత్తు, మధ్య పాపిడ, గౌరవర్ణం కలిగిన శరీరం, నడకలో ఠీవి అన్నీ ఆ వచ్చిన వ్యక్తికి ప్రత్యేకతలే.

చంద్రశేఖరం అతనిని చూసి ఆశ్చర్యపోయాడు.

"నా పేరు రామభద్రరాజు. సిరిపురం దగ్గిర పల్లెటూరు మాది. మీరు సావధానంగా వింటే నేను వచ్చిన పనేమిటో చెప్తాను'' అన్నాడు అతను.

"నేను సావకాశంగా వింటాను, వివరంగా చెప్పండి'' అన్నాడు చంద్రశేఖరం.

"సిరిపురం రాజావారు పోయి పదిహేను సంవత్సరాలయింది. వారి దివానుగారు కాలధర్మం చేసి పదేళ్లయింది. రాజావారికి సంతానంలేదు. రాణీవారు భర్త మరణానికి ముందే దివంగతులయారు. ఏ వారసులూ ముందుకొచ్చి రాజావారి ఆస్తులు కోరలేదు. అందుచేత రాజావారి చరాస్తులు, స్థిరాస్తులు గవర్నమెంటుకు సంక్రమించాయి. ప్రభుత్వం ఈ ఆస్తులు ఉంచుకొని ఏమిచేస్తుంది? వీలయినప్పుడల్లా ఆస్తులను వేలం వేస్తూనే వచ్చింది. ఆస్తిలో ఒక పది ఎకరాల మెట్ట భూమి మిగిలిపోతే ఈమధ్యనే ఏదో ఫాక్టరీకి అమ్మివేసింది. ఈ విధంగా రాజావారి ఆస్తులనుండి దొరతనం వారికి తొంభై లక్షలు లభించాయి. ఆ సొమ్ము ఖజానాలో నిక్షిప్తమయి ఉంది''

చంద్రశేఖరం శ్రద్ధగా వింటున్నాడు.

"ఆ తొంభై లక్షలలో, మా అక్కగారి నిత్యావసరాలకి, ఇబ్బంది లేకుండా శేష జీవితం గడపడానికి, పదవ వంతు వచ్చేటట్లు మీరు ప్రయత్నించాలి. ప్రభుత్వం అంత సొమ్ము యివ్వడానికి సుముఖంగా లేకపోతే, కనీసం అయిదు లక్షలైనా రాబట్టడానికి మీరు శ్రమపడాలి''

చంద్రశేఖరం మద్రాసు లాకాలేజీలో బిఎల్ పాసయాడు. బార్ కౌన్సిలు పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. హైకోర్టు లాయరు జంబునాధం గారి దగ్గిర అయిదు సంవత్సరాలు పనిచేశాడు. స్వతంత్రంగా విశాఖపట్నంలో ప్రాక్టీసు పెట్టడం కోసం ఒక నెల్లాళ్లకిందే వచ్చాడు. ఆఫీసు కోసం పదిహేను రోజులు కాళ్లరిగినట్లు తిరిగాడు. మొత్తానికి మెయిన్ రోడ్డుమీద, ఉండడానికి, ఆఫీసుకి సరిపడే పెద్ద యింటిని అద్దెకు తీసుకున్నాడు. సున్నాలు వేయించి, ఫర్నీచర్ కొని, ఈరోజే ఆఫీసు తెరిచాడు.

రామభద్రరాజుగారే అతని తొలి క్లయింటు.

అదృష్టం కలిసి వచ్చిందనుకున్నాడు అతను.

తలుపు వెనుక నిలుచుని వాళ్ల సంభాషణ వింటున్న అతని యిల్లాలు కామేశ్వరి, అంత కన్నా హెచ్చుగా సంతోషించింది, ప్రాక్టీసు అంత సులువుగా మొదలయినందుకు.

కాని, రామభద్రరాజుగారు తెలియజేసిన వివరాలు అంత ప్రోత్సాహకరంగాలేవు.




ఒక దానికి ఒకటి సరిపడడంలేదు.

"రామభద్రరాజుగారూ! వైద్యుని దగ్గిర ఏమీ దాచకూడదు, అలాగే లాయరు దగ్గిర నిజాన్ని కప్పిపుచ్చకూడదు. ఒకసారి నేను మీ అక్కగారిని కలిసి, నాలుగు విషయాలు అడిగి సందేహాలు తీర్చుకోవచ్చా?"

"మా అక్కగారు ఎవ్వరినీ అంటే పరపురుషులను చూడరు. నేను ఆమెకు స్వంత తమ్ముడిని, నాతో మాట్లాడేటప్పుడు కూడా ఆమెతెర వెనుకనుండే మాట్లాడుతారు. రాజావారి అంతఃపుర మర్యాదలను ఆమె యిప్పటికీ పాటిస్తున్నారు''

చంద్రశేఖరానికి ఈ కేసు సవాలుగా నిలిచింది.

ఇన్ని పేచీలున్న ఈ కేసు చేపట్టడంకన్నా విడిచిపెట్టడమే బాగుంటుందని అనుకున్నాడు. రామభద్రరాజును మరో న్యాయవాది దగ్గిరకి వెళ్లమని చెప్పాలనుకున్నాడు గానీ ఇంకొక న్యాయవాది సాధించగలిగితే తనెందుకాపని చేయలేననీ అనుకొని తొందరపడకుండా నిగ్రహించుకున్నాడు.

"ఈ కేసు చాలా క్లిష్టంగా ఉంది. ఎన్నో విషయాలు సేకరించాలి. చాలా శ్రమపడాలి. అంతేకాకుండా ఈ కేసు పూర్తయేసరికి చాలా కాలం పడుతుంది. ఎంతో డబ్బు ఖర్చవుతుంది. మీరు వీటికి అంగీకరించిన పక్షంలో..."

చంద్రశేఖర్ ఆ వాక్యం పూర్తి చేయలేదు.

"మీకు యింతవరకు ఒక నిజం చెప్పలేదు. రాజావారు జీవించి ఉన్నంతకాలం మా అక్కగారు అన్ని భోగాలను అనుభవించారు. వారుపోయిన తరువాత, దివానుగారు అంతగా సహాయం చేయలేకపోయినా, మా అక్కగారికి ఏలోటూ లేకుండా అన్ని ఏర్పాట్లు చేశారు. ఆయన చనిపోయిన తరువాత మా అక్కగారికి అన్నివిధాల సహకారం ఆగిపోయింది. ఆమె తన దాసీజనాన్ని ఒకరి తరువాత ఒకరిని తగ్గించుకున్నారు. ప్రస్తుతం ఆమెకు సహాయంగా ఉంటూ, వంట చేస్తున్న పార్వతమ్మను మాత్రం ఆమె తీసివేయలేకపోయారు. తన శరీరం మీదనున్న ఆభరణాలను ఒకటీ ఒకటీ అమ్మి ఆమె కొంతకాలం జీవించారు. ప్రస్తుతం మంచాలను, పాత్రలను అమ్మవలసిన స్థితికి వచ్చారు''

"అవి కూడా అయిపోతే...?"

"ఆ సంగతి కూడా నేనడిగాను. అప్పుడు దేహత్యాగమే గతి అని ఆమె అన్నారు''

చంద్రశేఖరానికి ఏమనడానికి తోచలేదు.

"అటువంటప్పుడు మన ప్రయత్నాలు దేనికి?"

"నేను కూడా ఆమెతో ఈవిధంగానే అన్నాను. మా తండ్రిగారు ఒక వీలునామా రాశారు. మా అక్కగారికి, ఒక ఊరి పొలం నుండి వచ్చే పంటను ఇవ్వవలసిందని ఆయన నిర్దేశించారు. సంవత్సరానికి ఒక గరిసెడు ధాన్యం ఆమెకు ఆవిధంగా అందుతాయి. నాకు కొన్ని మామిడి తోటలున్నాయి. వాటినుండి వచ్చే ఆదాయంలో కొంత ఆమెకు యిస్తున్నాను''

"రాజావారి సొమ్ములో పదవవంతు మాత్రమే ఆమె ప్రభుత్వంనుండి కోరుతున్నారా?"

"ఆమె కోరడంలేదు. నేనే ఆమెకు చాలా బోధపరచి కనీసం పదవ వంతైనా కోరమన్నాను. ఎన్నో వంతు కోరాలో నాకు కూడా తెలియదు. ఉపవాసాలతో కృశించి ఆత్మాహుతి చేసుకోవడంకన్నా అవివేకమైన పని వేరొకటి లేదన్నాను. ఆమె ఆరోగ్యం చాలా బాగుంది. మిగిలిన బతుకు ప్రశాంతమైన వాతావరణంలో, భగవంతుని స్మరిస్తూ గడపవలసిందని నొక్కినొక్కి చెప్పాను. ఆమెకు ఎటువంటి లోటు రాకుండా చూసుకుంటానన్నాను. ఆమె చాలా సేపటివరకు ఆలోచించారు. ప్రభుత్వం నుండి రాజావారి ధనంలో






# చచ్చి బ్రతికిన మనిషి!

వియత్నాం యుద్ధంలో మరణించిన సైనికుల కోసం అమెరికా రాజధాని వాషింగ్టన్‌లో ఓ స్మారక చిహ్నం నిర్మించి, దానిమీద మరణించిన, లేదా జాడ లేకుండాపోయిన వారి పేర్లు చెక్కారు.

అయితే, ఆ తర్వాత ఓ 14 మందిదాకా ఆ గ్రానైట్ పలకలమీద తమ పేర్లు చూసుకుని "మేం బ్రతికే ఉన్నాం" అని ప్రకటించారు. అలాంటివారిలో ఒకరైన 46 సంవత్సరాల 'యూజిన్‌టోని' తన పేరు చూపిస్తున్న దృశ్యమిది. 1982లో నిర్మించిన ఈ స్మారక చిహ్నంపై 53,191 మంది పేర్లున్నాయి. ఇవన్నీ అధికారికంగా అమెరికన్ డిఫెన్స్ డిపార్ట్‌మెంట్ ప్రకటించినవే.

కొద్దిశాతం, జీవిక గడపడానికి సరిపోయినది మాత్రం కోరడంలో తప్పులేదని చివరకు అంగీకరించారు. అంతవరకు ఆమెకింద నేను వెచ్చించిన ధనాన్ని ఋణంగానే స్వీకరిస్తామన్నారు. కాబట్టి పదవవంతు కోసం మనం ప్రయత్నిస్తే కనీసం అయిదవ వంతు అయినా రావచ్చు. ఆ డబ్బుతో, ఆమె మరెవరిమీదా ఆధారపడకుండా బతకవచ్చు''

రామభద్రరాజు అంతవరకూ చెప్పి నిలుచున్నారు. తలపాగా పెట్టుకున్నారు. చంద్రశేఖరం లోపలినుంచి తెప్పించిన మంచినీళ్లు తాగి అతను వెళ్లిపోడానికి ఉద్యుక్తులయారు.

మరేవీ ప్రశ్నలు వేయడానికి అతను చంద్రశేఖరానికి అవకాశమివ్వలేదు.

రామభద్ర రాజు వెళ్లగానే చంద్రశేఖరం భార్య గదిలోకి వచ్చింది.

"కేసు కాయాపండా?" ఆమె అడిగింది.

"కేసు ప్రస్తుతం కాయగానే ఉంది. రంగంలోకి దిగంది ఏమీ చెప్పడానికి వీలులేదు''

"కనీసం అడ్వాన్సేనా?"

"ఇవ్వకేం! ఇవిగో కోవాబిళ్లలు, ఇవిగో పూతరేకులు, ఆ కుటుంబాలకే వీటిని తయారు చేయడం చేతనవుతుంది. ఈ బిళ్లలు ఎంత పెద్దవో చూడు. ఈ పూతరేకులకు రాసిన నేయి ఎంత చక్కటి వాసన వేస్తున్నదో!"

ఆమె వాటిని నోటిలో వేసుకొని, భర్తకు దగ్గిరగా వచ్చి అంది,

"ఇది మీ మొదటి కేసు. డబ్బుకోసం వెనకాడకండి. మీరు మద్రాసులో జాగ్రత్తగా నాకు దాచమని ప్రతి నెల యిచ్చే పైకం పదివేలకు పైగా ఉంది''

"కామేశ్వరీ, నువ్వు నిజమైన సహధర్మచారిణివి. నేను ఆ డబ్బు సంగతే మరిచిపోయాను''

"కాని చిన్న షరతొకటి ఉంది. మీరీ మొదటికేసు గెలిస్తే, నాకు కాసుల పేరు చేయించండి''

అతని పెదవులపైన నిలిచిన చిరునవ్వు ఆమె కోరికకు జవాబు చెప్పింది.

★ ★ ★

రెండు నెలలు ఇట్టే గడచిపోయాయి.

రామభద్రరాజు ఏ ముహూర్తాన వచ్చారో, ఆనాటి నుండి చంద్రశేఖరం ప్రాక్టీసు పుంజుకుంది. ఊపిరి తీసుకోడానికి కూడా అతనికి అవకాశం ఇవ్వకుండా కేసుమీద కేసు వచ్చిపడింది. రాత్రి పన్నెండు వరకూ అతను పని చేస్తున్నాడు. అనుభవమున్న గుమస్తాను పెట్టుకున్నాడు. ఆఫీసు గదిలో నాలుగు అద్దాల బీరువాలనిండా లా పుస్తకాలు నింపాడు. ఆదాయం దినదినాభివృద్ధి పొందింది.

అందుచేతనే ఒకరోజు ఉదయం ఏ కబురూ చేయకుండా ఆఫీసుకి రామభద్రరాజు వస్తే అతనుకేసు గురించి ఏమీ చెప్పలేకపోయాడు.

"మీరు వచ్చిన నాటి మధ్యాహ్నామే అర్జీ దాఖలు చేశాను. అంతకుమించి మరే పురోగతి లేదు'' అన్నాడు చంద్రశేఖరం.

"మీ దగ్గిరనుంచి ఎటువంటి ఉత్తరమూ లేకపోతే, నేను కూడా అదే అనుకున్నాను'' అన్నారు రాజుగారు.

"నిజం, న్యాయం నా దృష్టిలో పర్యాయ పదాలు. నిజమైన వివరాలు నాకు తెలియకపోతే న్యాయం గురించి నేనేం పోట్లాడగలను?"

రామభద్రరాజు నవ్వారు.

"మీరు కొంచెం శ్రమపడాలి, వారం రోజులలో ఆదివారం మా కేసుకి ప్రత్యేకించండి. నేనేవో వివరాలు చెప్తే మీరు లక్ష ప్రశ్నలు వేస్తారు. చాలా వాటికి నా దగ్గిర సమాధానాలులేవు. మీరే స్వయంగా కేసుకు సంబంధించిన వ్యక్తులను కలిసి మీకు కావలసిన సంగతులను తెలుసుకొని సందేహాలు

తీర్చుకోండి. ముందుగా వెంకట్రాయుడుగారితో ప్రారంభించండి''

"అతనెవరు?"

"అతనొక పంచదార మిల్లుకి మానేజింగ్ డైరెక్టరుగా ఉన్నారు. ఇక్కడనుండి బస్సులో మూడు గంటలు ప్రయాణం చేస్తే అతనివూరు చేరుకుంటారు. అతను ఆదివారాలలోనే దొరుకుతారు''

అంతకుమించి అతను మరేమీ చెప్పలేదు. ఈసారి కోవాబిళ్లలు, పూతరేకులే కాకుండా చక్కెరకేళి అరటిపళ్లు రెండు డజన్లు తెచ్చారు.

చంద్రశేఖరానికి ఆ ఆదివారం తీరికచిక్కలేదు. అటు పిమ్మట ఆదివారమే కాకుండా ప్రతి ఆదివారం కేసు కోర్టులో విచారణకు వచ్చేవరకు పనిచేయాలని అతనొక నిశ్చయానికి వచ్చాడు.

ఆదివారం నాడు ఉదయమే ఆరు గంటల బస్సులో చంద్రశేఖరం బయలుదేరాడు. పట్టణానికి నాలుగు మైళ్ల దూరంలో రోడ్డుపక్కన పంచదార మిల్లుంది. మానేజింగ్ డైరెక్టరుగారి బంగళా మిల్లుకి కొంచెం దూరంలో ఉంది. సీజను కాకపోడంచేత మిల్లు పనిచేయడంలేదు. యంత్రాలకు మరమ్మత్తులు జరుగుతున్నాయి.

గేటు దగ్గిర గూర్ఖా చంద్రశేఖరాన్ని ఆపాడు.

"దొరగారు ఆదివారంనాడు పదిగంటల వరకు నిద్ర లేవరు. అంతవరకు మీరు ఎక్కడేనా తిరిగిరండి'' అన్నాడా కాపలావాడు.

చుట్టుపట్ల ప్రశాంతమైన వాతావరణం నెలకొని ఉంది. మిల్లుకి కొద్దిదూరంలో, రోడ్డుకి రెండోవేపు పనివాళ్ల యిళ్లున్నాయి. పెద్దవాళ్ల బంగాళాలన్నీ ఇటుపక్కనున్నాయి. వాటిని మామిడి తోటలలో కట్టడంవల్ల రోడ్డుమీదికి కనపడవు.

చంద్రశేఖరం కాఫీ మాత్రమే తాగి యింటినుంచి బయలుదేరాడు. రమారమి తొమ్మిదిన్నర అయింది. అతనికి ఆకలిగ ఉంది. పనివాళ్ల యిళ్లకు సమీపంలో చిన్న మార్కెటుంది. ఆదివారం నాడు అక్కడ సంత జరుగుతుంది. సంత బజారులో మూడు నాలుగు కాఫీ హోటళ్లున్నాయి. వాటి నిండా మనుషులు, ఈగలు అపరిశుభ్రంగా ఉంది. వాటిలోకి కాలుపెట్టడానికి కూడా అతనికి మనస్కరించలేదు.

కొంతసేపు ఇటూ అటూ తిరిగి, తోటలో ఒక చెట్టుకింద కొంచెంసేపు కూర్చొని చంద్రశేఖరం పది గంటలు దాటిన తరువాత ఎం.డి.గారి బంగళా చేరుకున్నాడు.

"దొరగారు పది నిమిషాల కింద లేచారు. మీ కార్డు వారికిచ్చాను. మిమ్మల్ని హాలులో కూర్చోమన్నారు'' అన్నాడు గూర్ఖా.

బంగళా చాలా ఆధునిక పద్ధతులలో కట్టినది, ముందు పెద్ద లాన్, ఆయా ఋతువులలో వికసించే రంగుల పూలమొక్కలు, అక్కడక్కడ చిన్న పొదరిళ్లు, చాలా చక్కగా కనిపిస్తాయి.

ముందు హాలు చాలా విశాలంగా ఉంది. సోఫాలు మొదలైనవి చాలా విలువైనవి. గోడలకు పాశ్చాత్య వర్ణ చిత్రాలున్నాయి. చంద్రశేఖరం హాలులో కూర్చున్న పది నిమిషాలలో వెంకట్రాయుడుగారు అక్కడికి వచ్చారు.

చంద్రశేఖరం లేచి అతనికి నమస్కారం చేశాడు.

అతను నమస్కారం అందుకోలేదు.

వెంకట్రాయుడుగారు పొడవుగా ఉన్నారు. స్నానాదులు పూర్తి చేసినట్లులేదు. జుత్తు చెదరి ఉంది. బనియను మీద తువాలు వేసుకున్నారు. లుంగీ కట్టుకున్నారు.

"నాతో మీకేం పని?" చిరాకుగా ప్రశ్నించారు.

అతను గెడ్డం గీసుకోలేదు, ఆపైన చిరచిర లాడుతున్నారు. చంద్రశేఖరానికి చుక్కెదుర




యింది. అయినా అతను కార్యం సాధించాలి. ఎం.డీగారి గురించి తెలుసుకోవాలి.

"సిరిపురం రాజావారు పరమపదించి పదిహేను సంవత్సరాలయింది. వారి ఆస్తులన్నీ ప్రభుత్వం వారు స్వాధీనం చేసుకొని విక్రయించారు. రామభద్రరాజుగారి అక్కగారికి ఆ ధనంలో కొంత శాతం, ఆమె పోషణ కోసం యివ్వవలసినదని గవర్నమెంటు మీద దావా వేశారు. నేను వారి తరపున లాయరుగా పనిచేస్తున్నాను. రామభద్రరాజుగారి అక్కగారి గురించి మీకు తెలిసిన విషయాలు దయచేసి నాకు చెప్పవలసింది'' అన్నాడు చంద్రశేఖరం.

ఈ మాటలు వింటుంటే వెంకట్రాయుడుగారి ముఖంలో రంగులు మారాయి. కోపంతో అతని ముఖం ఎర్రబారింది.

"ఏ పేరయితే నేను మరచిపోడానికి నిత్యం ప్రయత్నం చేస్తున్నానో ఆ పేరు పొద్దున్నే ఎత్తి నా మనసు పాడుచేశారు. మీరు వెంటనే ఇక్కడినుంచి వెళ్లిపొండి. మీకు నేనేమీ చెప్పను'' చాలా కరకుగా అన్నారు వెంకట్రాయుడుగారు.

చంద్రశేఖరం, ఇటువంటి జవాబు వస్తుందని కలలో కూడా అనుకోలేదు. అయినా పట్టువదలకుండా అతను మాట్లాడాడు.

"నేను లాయర్ని. మీరు నాకు చెప్పే విషయాలను రహస్యంగా ఉంచుతాను. నా మీద విశ్వాసముంచి చెప్పండి''

"వెళ్లి పొమ్మని చెప్పింది మీకే? వెళ్లిపొండి! వెళ్లిపొండి!! యూ గెటవుట్!"

వెంకట్రాయుడుగారు కోపంతో కంపిస్తున్నారు. అతని ముఖం వివర్ణమవుతోంది.

"న్యాయవాదిని అవమానం చేశారని మీమీద చర్య తీసుకుంటాను''

కాని అతను లొంగలేదు. గదిలోకి పోయి జోడుగుళ్ల బారు తెచ్చారు.

"మీరు బయటికి నడవకపోతే కాల్చి చంపుతాను గెటవుట్!"

"నిరసన తెలుపుతూ నేను వెళ్తున్నాను. కోర్టునుండి సమనులు వచ్చిన నాడు మీకు తెలుస్తుంది''

"గెటవుట్!" ఎం.డి ఉరిమారు.

చంద్రశేఖరం ముఖం దించుకొని మెల్లగా బయటికి నడిచాడు.

రామభద్రరాజు అన్నీ తెలిసి ఈ భల్లూకం మీదికి తనను విడిచిపెట్టినందుకు అతను బాధపడ్డాడు.

ఒకవంక ఆకలి, మరొకవంక అవమానం అతనిని దహిస్తుంటే, రెండు ఫర్లాంగుల దూరంలోనున్న బస్సు స్టాండుకు అతను మెల్లిగా నడిచాడు.

అడుగుపెట్టగానే అపజయం ఎదురయింది.

వెంకట్రాయుడుగారి కోపానికి కారణం అతనికి అంతుబట్టలేదు.

అప్పటికి పదకొండు గంటలయింది. బస్సు పదకొండున్నరకు వస్తుంది.

పది నిమిషాలు అతను బస్‌స్టాండులో నిలుచున్నాడు.

ఇంతలో గూర్ఖా పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"దొరగారు మిమ్మల్ని వెంటనే రమ్మంటున్నారు''

పరువు నష్టం దావావేసి కోర్టులోనే అతనిని చూద్దామనుకున్న లాయరుగారు కొంచెం శాంతించారు.

కార్యసాధకుడు మానావమానాలకు అతీతుడు.

మంచివాళ్ల కోపం తాటాకుల మంట. బహుశా వెంకట్రాయుడుగారు కూడా మంచివారై ఉంటారు.

చంద్రశేఖరం హాలులోకి అడుగుపెట్టగానే మానేజింగ్ డైరెక్టరు అతనికి సోఫా చూపించి



కూర్చోమని సూచించారు.

"చంద్రశేఖరంగారు! క్షమించాలి. ఏదో ఉద్రేకంలో అలా అన్నాను. రాత్రంతా రామభద్రరాజు అక్కగారి గురించే ఆలోచిస్తున్నాను. తెల్లవారు వేళ నాలుగు గంటలవరకు నిద్రపోలేదు. నేను దైవోపహతుడిని. కాబట్టి మరోవిధంగా భావించకండి. మీరు విశాఖపట్నం నుంచి ఎన్ని గంటలకు బయలుదేధారు?"

"ఉదయం ఆరుగంటలకు"

"బ్రెక్‌ఫాస్టు కూడా..."

"చెయ్యలేదు"



"మనిద్దరం కలిసి టిఫిన్ చేద్దాం. మీరు లంచికి కూడా నాతోనే ఉంటారు. పదిహేను నిమిషాలలో స్నానం చేసి వస్తాను''

అతను తిరిగి వచ్చేసరికి వంటవాడు టేబిలు మీద అన్నీ అమర్చాడు. వెంకట్రాయుడుగారు గెడ్డాం గీసుకొని, స్నానం చేసి మడత బట్టలు వేసుకొని వచ్చారాయే, చూడడానికి యోగ్యంగా ఉన్నారు.



ఇద్దరూ వంటవాడు పెట్టిన అల్పాహారం తీసుకున్నారు. కాఫీలు అయిన తరువాత ఇద్దరూ తిరిగి హాలులోకి వచ్చారు. వెంకట్రా యుడు లాయరుగారి పక్కనే కూర్చున్నారు.

"మీకు చాలా విషయాలు చెప్పాలి. ముందునుంచి మొదలు పెడుతున్నాను''

చంద్రశేఖరం అటాచీనుంచి నోట్ బుక్‌తీశా డు.

"నేను విజయనగరం మహారాజా వారి కాలేజీలో ఇంటరు పాసయి, మద్రాసు గిండీ కాలేజీలో యింజనీరింగులో చేరాను. నాలు గు సంవత్సరాల తరువాత బియ్యీ మొదటి తరగతిలో పాసయ్యాను. వెంటనే చెంగల్పట్టు జిల్లాలో అసిస్టెంటు ఇంజనీరుగా ఉద్యో గంలో చేరాను.

"నాకు ఒక సంవత్సరం సర్వీసు అయింది. నేను ఒంటరిగానే ఉండేవాడిని. మా అమ్మగారు నాకో ఉత్తరం వ్రాశారు. నాకొక పెళ్లి సంబంధం చూశారని, నేను అంగీకరిస్తే ముహూర్తాలు పెట్టిస్తామని వ్రాశా రు. మా అమ్మగారి ఉత్తరంతోపాటు మా చెల్లెలు కూడా ఒక ఉత్తరం వ్రాసింది. నా కాబోయే భార్య గురించి ఆమె చాలా చక్కగా వర్ణించింది. పెళ్లికూతురు నా ఎత్తుకు తగిన పొడవు, నా అందానికి మించిన సౌందర్యం, నా మాటల తీరును వెనుకబెట్టే మధురమైన సంభాషణ- ఈవిధంగా ఆమె ఎన్నోవిధాల నాకన్న అధికురాలనీ, అన్నిటికీ మించి, బంగారానికి పరిమళ మబ్బినట్లు ఉత్తమమైన శీలసంపద గలదని వ్రాసింది. ఆమె జడ పిరుదులు దాటి కిందకు వస్తుందనీ, రాయంచ ఆమె దగ్గిర నడకలు నేర్చుకోవాలనీ పొగిడింది. ఆమె గానం హృదయాన్ని పరవశింపజేస్తుందనీ, ఆమె చదివిన పద్యాలు, ఆమె వైదుష్యాన్ని తెలుపుతాయనీ వక్కాణించింది.

నేను చాలా పొంగిపోయాను. మా చెల్లె లు మనుష్యుల గుణగణాలను ఎంచడంలో దిట్ట. ఆమె వర్ణనను అనుసరించి నా మన సులో ఒక తేజోవతియైన అతివను, అతిలోక సుందరిని నిర్మించుకున్నాను. మా చెల్లెలు వ్రాసిన ఆ యువతి శీలానికి అనుగుణంగా అవయవసంపదను రూపొందించుకున్నా ను. నా హృదయంలో ఒక అతి రమణీయమైన సుందరిని, సంగీత సాహిత్యాలలో ఉత్తమ స్థాయికి చేరిన దానిని, ప్రతిష్ఠించుకు న్నాను''

చంద్రశేఖరం చాలా శ్రద్ధగా వింటున్నా డు. ఏదో ప్రశ్న వేయబోయి ఆగిపోయాడు.

"నేను ఆ అమ్మాయిని వివాహమాడడాని కి అంగీకరిస్తున్నట్లు టెలిగ్రాం ఇచ్చాను. దానిని ధృవపరుస్తూ ఉత్తరం కూడా వ్రాశా ను. దానితో వారంరోజులలో ముహూర్తం పెట్టించారు. చాలా తొందరగా శుభలేఖలు అచ్చు వేయించారు. ఆంగ్లంలో వేసిన శుభ లేఖలు నాకు కొన్ని పంపించారు. నా స్నేహితులందరికీ వాటిని పంచిపెట్టి వాళ్లనంద రినీ నా వివాహానికి తప్పకుండా రావల సిందని పేరుపేరున చెప్పాను.

ముహూర్తం వారంరోజులుందనగా మా వూరికి ప్రయాణమవడానికి బట్టలు సర్దు కుంటున్నాను. ఉదయం పదకొండు గంటల యింది. టెలిగ్రామొకటి మా నాన్నగారి నుండి వచ్చింది. నేను నిర్మించుకున్న ఊహాసౌధం సమూలంగా కూలిపోయింది. పెళ్లి రద్దయింది. రెండురోజుల తరువాత ఉత్తరం వచ్చేదాకా నేను చాలా బాధపడ్డాను. పెళ్లికూతురు శీలం మంచిది కాదనీ, సిరి పురం రాజాగారికి ఆమె ఉంపుడుగత్తె అనీ, మరో మంచి సంబంధం చూసి ఉత్తరం వ్రాస్తామన్నారు, మా వాళ్లు''

"ఇంతకీ మీరు పిల్లను చూసుకోలేదా?" చంద్రశేఖరం అడిగాడు.

"మాలో సాధారణంగా పెళ్లికొడుకు పెళ్లి కూతురిని చూసుకోడు''

"కనీసం ఆమె ఫొటో అయినా చూడలేదా?"




"అది కూడా లేదు. మా అమ్మగారు, మా అక్క చెల్లెళ్లు చూసి సంబంధం నిశ్చయం చేస్తారు. ఈ ఆచారం ఈనాటికీ మేము పాటిస్తున్నాము''

"అంటే మీ ఊహాసుందరి...?"

''పదహారేళ్ల చిన్నది''

"ఈ పెళ్లి రద్దయి ఎన్ని సంవత్సరాల యింది?"

"రమారమి ముప్పై ఏళ్ళయింది''

"అయితే ఆమెకిప్పుడు నలభై ఆరు సంవత్సరాలన్నమాట!"

"ఆమె సౌందర్యంలో మార్పు రాదా?"

"అది మారవలసినది కాదు- వయసుతో పాటు పరిణతి చెందవలసినది''

చంద్రశేఖరం ఆలోచిస్తున్నాడు.

"మిగిలిన కథ చెప్పమన్నారా?"

"అయ్యో! అందుకోసమేకదా నేను వచ్చాను. తప్పకుండా చెప్పండి''

"నేను ఉద్యోగం మానివేశాను. తిరిగిన ఊరు తిరగకుండా దేశమంతా చుట్టివచ్చాను. నాకు నలభై సంవత్సరాలు వచ్చేవరకు ఉద్యోగం వదిలి ఉద్యోగంలో చేరుతూనే ఉన్నాను. పదవి తరువాత పదవిని అలంకరిస్తూనే ఉన్నాను. ఆమెను మరచిపోడానికి నేను చేయని ప్రయత్నమే లేదు. ఎంత హెచ్చుగా మరచిపోదలచుకున్నానో అంత గాఢంగా ఆమె నా హృదయంలో చెక్కబడింది''

"మీ వాళ్లు మరేవీ సంబంధాలు చూడలేదా?"

"చాలా సంబంధాలు వచ్చాయి. నేను వేటినీ అంగీకరించలేదు. మా వాళ్లు విసుగెత్తి మరే ప్రయత్నాలు చేయలేదు''

"ఎవరో తప్పు చేశారని మిమ్మల్ని మీరు శిక్షించుకోడంలో అర్థముందా?"

"చంద్రశేఖరంగారూ, వివాహమన్నది జీవితంలో ఒక్కసారే జరుగుతుంది''

"కాని మీకు వివాహమే కాలేదే?"

"నా మనసు సంపూర్ణంగా ఆమెయందు లగ్నమయింది. మరో అమ్మాయిని పెళ్లి చేసుకోవడం అటుంచండి. నాలో కామం కలిగినప్పుడు మరో స్త్రీ వెంటబడడానికి కూడా ఆమె అడ్డుపడుతున్నారు''

"నాకు సరిగా బోధపడడంలేదు''

"ఒకసారి నాకు మా స్టెనోమీద కోరిక కలిగింది. ఆమెకు ఎటువంటి అభ్యంతరం లేదు. కాని, తీరా నేను ఆమె దగ్గరికిపోయి, చాలా విచారకరమైన పరిస్థితులలో తిరిగి వచ్చేశాను''

"ఇదంతా మానసికమైన చాంచల్యం"

"మీరు దానికి ఏ పేరు పెట్టినా ఫరవాలేదు. కాని ఆమె మూర్తి నాకు ఎదురయి, మరో స్త్రీని కోరకుండా అడ్డుపడుతున్నది''

"ఇది చాలా ఆశ్చర్యకరమైన సంగతి''

"నాకు నలభైయేళ్లు వచ్చేవరకు ఈవిధంగా శిక్షను అనుభవించాను. ఆమె నా చుట్టూ బిగించిన బంధనాలనుండి విముక్తుడిని కాలేక, వాటితో రాజీపడి, ఆమె చెప్పినట్లే చేస్తున్నాను. ఏదేనా మంచి పనిచేస్తే ఆమె నాతో చాలాసేపు ఉంటుంది. ఎవరికైనా అపకారం చేసినా, ఎవరికైనా అవమానం కలిగించినా, ఆమె నాకు కనపడదు. పరోక్షంగా ఆమె నా జీవితాన్ని దిద్దుతున్నారు''

"మీరు చెప్తున్నది ఎలా నమ్మాలో నాకు తెలియడంలేదు''

"ఎవరికేనా నా వలన ఉపకారం జరిగితే ఆమె నాతో ఉంటారు. ఆమెను వదిలించుకోవాలన్న ప్రయత్నంలో, కోపోద్రిక్తుడనై, మిమ్మల్ని తరిమివేశాను. ఆమె కల్పించుకోకపోతే, మిమ్మల్ని తిరిగిరమ్మని కబురు పంపాను''

"అంత సులువుగా ఆమె దర్శనమిస్తున్నారా?"

"నిన్న రాత్రి, అంటే తెల్లవారువేళ నాలు

గు గంటలవరకు ఆమె నాకు కనిపించడం మానేశారు''

"ఇలా ఎప్పుడేనా అయిందా?"

"లేదు''

"మరేదేనా కారణమా?"

"ఆమెను మరచిపోవడానికి ఈమధ్య నే..."

"అంటే, ఆమెకు ఇష్టంలేని పనిచేస్తున్నా రన్నమాట"

"అవును. మరి తాగనని ఒక నిశ్చయాని కి వచ్చిన తరువాత నిద్రపట్టింది''

"ఈ ఉదయం నాతో అంత దురుసుగా ప్రవర్తించడానికి ఏదైనా ప్రత్యేకమైన కారణ ముందా?"

"నిజం చెప్తున్నాను. ఆమెమీద నాకు చాలా కోపం వచ్చింది. ఏ నేరమూ చేయని నన్ను ఆమె వేధిస్తున్నట్లనిపించింది. ఆమె నూ, ఆమె పక్షం మాట్లాడేవారినందరినీ చంపాలనిపించింది. ఆ పని సాధ్యమయ్యేది కాదు. అందుచేత, నన్ను నేనే కాల్చుకోడాని కి జోడుగుళ్ల బారును సిద్ధం చేశాను. ఇంతలో మీరు వచ్చారు. ఆమె పక్షంవారు మీరు. మిమ్మల్ని చంపితే నాకు తృప్తి కలుగుతుంది. అంతేకాకుండా, ఆత్మహత్య చేసుకున్న నాకు మరో లోకానికి తోడు కూడా లభిస్తుందని భావించాను''

చంద్రశేఖరం పకాలున నవ్వాడు.

"మరెందుకు పిలిపించారు, నన్ను వెన క్కి?"

"నాలుగురోజులై కనిపించని ఆమె కని పించారు. ఆమె నవ్వుతున్నారు. వచ్చిన అతను శ్రేయోభిలాషి. వారిని చంపకపోడం చాలా మంచిపని. మీరు కూడా చావకూడ దు. లోకంకోసం బతకాలి. మీరు చాలా ప్రతిభ గలవాళ్లు. చాలామందికి దారి చూ పించవలసినవారు. నేను బతికినన్నాళ్లు మీరు జీవించాలి' ఆమె ఈవిధంగా ఆజ్ఞా పించారు. అందుకే మీకు కబురు పంపాను''

చంద్రశేఖరం వెంకట్రాయుడిగారి ము ఖంలోకి చూస్తున్నాడు.

పదివేల రూపాయల జీతగాడు అతను.

మూడువేలమంది కార్మికులకు అధికారి.

చిన్నపిల్లాడివలె అతను ఏవో విచిత్రమైన సంగతులు చెప్తుంటే చంద్రశేఖరానికి ఆశ్చ ర్యం వేసింది. అతని మానసిక దౌర్బల్యానికి బాధ కలిగింది.

వంటాయన పక్కగదిలో డైనింగ్ టేబి లుమీద ప్లేట్లు, చంచాలు, ఫోర్కులు, గళాసు లు అన్నీ అమరుస్తున్నాడు.

సమయం రెండు గంటలయింది.

"చంద్రశేఖరంగారూ, పదండి భోజనాని కి''

భోజనం దివ్యంగా ఉంది. రెండుకూర లు, పచ్చళ్లు, రకరకాల ఊరగాయలు, అప్ప డాలు, వడియాలు, మంచికోవా, అరటిపళ్లు- ఎన్ని రకాలో. చంద్రశేఖరానికి ఎంత ఆకలైతే మాత్రం అన్నీ తినగలడా? తినడం కాదు ముఖ్యం. వాటి రుచులను తెలుసుకొని ఆనందించాలి.

ఇద్దరూ మళ్ళా హాలులో కూర్చున్నారు. వెండిపళ్లెంలో కిళ్లీలు పెట్టి వంటతను తీసుకొ చ్చాడు.

అన్ని మర్యాదలు చాలా చక్కగా జరి పించారు.

తరువాత వెంకట్రాయుడుగారు సంభా షణ తిరిగి ప్రారంభించారు.

"ఇంతవరకూ నేను ఆమె గురించి, నేను ఊహించుకున్న వివరాలతో సహా అన్నీ మీకు చెప్పాను. ఇప్పుడు మీకు తెలిసిన సంగతులు చెప్పండి''

చంద్రశేఖరం అతని ముఖంలోకి అయి దు నిమిషాలసేపు చూసి అన్నాడు.

"ఆమె ఎక్కడున్నారో, ఏలా ఉన్నారో మీకు తెలియదా?"

"తెలియదు''

"సిరిపురం రాజావారు దివంగతులైన సంగతి కూడా మీకు తెలియదా?"

"మీరు ఇందాక చెప్పేవరకు తెలియదు''

"పదిహేను సంవత్సరాలకింద ఆయన పోయారు. మరో అయిదు సంవత్సరాల తరువాత దివాన్‌జీ వెళ్లిపోయారు. అంతవరకూ ఆమెకు ఏ లోటు లేకుండా జరిగింది. తరువాత ఆమె గురించి ఎవరూ పట్టించుకోలేదు. క్రమంగా ఆమె తనకు రాజుగారు దయచేసిన జవహరీ, ఒకటి ఒకటి అమ్మివేశారు. పదిమంది దాసిజనులు ఉంటే, వారిని ఇద్దరికి తగ్గించారు. అంతటితో సరిపోలేదు. ఇంట్లోని మంచాలు, సోఫాలు కూడా ఆమె అమ్మించారు''

"ఆ స్థితికి వచ్చేవరకు ఆమె తమ్ముడుగారు చూస్తూ ఊరుకున్నారా?"

"ఆమె రామభద్రరాజుగారి సహాయాన్ని నిరాకరించారు''

"తరువాత ఏమయింది?"

"ప్రభుత్వం రాజావారి ఆస్తులన్నీ అమ్మివేశారు. ఆమె ఉంటున్న ఇల్లు, ఆవరణ మాత్రం విడిచిపెట్టారు''

"ఎందుచేత?"

"సిరిపురం మునిసిపాలిటీ ఏర్పడిన దగ్గిరనుంచీ, ఆ బంగళా గురించి కట్టిన పన్ను ఆమె పేరున ఉంది. ఆవిధంగా అది రాజుగారి ఆస్తికాదని విడిచిపెట్టారు.

"ఇదీ ఒక మేలుకే వచ్చింది''

"పరిస్థితులు ఇంకా హీనంగా మారుతుంటే రామభద్రరాజుగారు రెండు పనులు చేశారు''

"ఏమిటవి?"

"ఒకటి అంతవరకు తండ్రిగారి వీలునామాలో ఉదహరించిన విషయం అమలుపరచడం- ఆవిధంగా ఆమెకు సంవత్సరానికి గరిసెడు ధాన్యం కొలవడం, అంతేకాక తోటలమీద వచ్చిన డబ్బులో కొంత ఆమె ఖర్చులకు ఋణంగా ఇవ్వడం. రెండోది- ఆమెకు చాలా విధాలుగా బోధపరచి రాజావారి ఆస్తులు అమ్మగా వచ్చిన తొంభై లక్షలలో పదవవంతు కోసం ప్రభుత్వంమీద దావా వేయడం"

"ఆమె ఎన్ని ఇబ్బందులకు గురయ్యారు?" వెంట్రాయుడుగారు కళ్లు తుడుచుకున్నారు.

అతని పరిస్థితి చూసి చంద్రశేఖరం సంభాషణ ఆపేశాడు.

ఒక పదినిమిషాలు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. తరువాత వెంకట్రాయుడన్నారు.

"ఎంత పనయింది చంద్రశేఖరంగారూ! మీరు కేసు వాపసు తీసుకోండి. వెంటనే ఆమె ఖర్చులకోసం లక్షరూపాయలిస్తున్నాను. ఇకమీద ప్రతి సంవత్సరం ఒక లక్ష ఇస్తాను. ఆమె సుఖంగా జీవించవచ్చు''

"ఆమె తమ్ముడు రామభద్రరాజుగారు, ఆమెకు ఏ లోటు రాకుండా చూసుకుంటామన్నారు. కాని ఆమె అంగీకరించలేదు. పరిస్థితి మరీ దిగజారిపోతే, తమ్ముడిచ్చిన డబ్బును ఋణంగా స్వీకరించారు. రాజావారి ధనంలో కొంతభాగం తన పోషణకింద తీసుకోడానికి ఒప్పుకున్నారు. కాబట్టి, ఆమె, మీరిచ్చిన డబ్బు తీసుకోరు''

వెంకట్రాయుడు ఆలోచిస్తున్నారు.

"కేసు ముందుకు నడపడానికి చాలా సొమ్ము అవసరమనుకుంటాను. వారు మీకేమైనా ఖర్చులకిచ్చారా?"

చంద్రశేఖరం కొంచెంసేపు ఏమీ మాట్లాడలేదు.

"మీకు సంశయమందేనికి?" వెంకట్రాయుడు ప్రశ్నించారు.

"ఒక పైస కూడా ఇవ్వలేని స్థితిలో వారున్నారు''

"అయితే మీరీ సొమ్ము ఖర్చులకింద తీసుకోండి''

"కేసు పూర్తయ్యేదాకా, నేను కూడా వారి నుండి ఏమీ తీసుకోదలచలేదు. మీనుండి కూడా తీసుకోలేను''

వెంకట్రాయుడుగారు చాలా సేపు ఆలోచించారు.

"ఆమె దేవత. లేకపోతే ఎవరూ ఆమె కోసం ఈవిధంగా పనిచేయరు''

అప్పటికి సాయంకాలం నాలుగయింది.

వెంకట్రాయుడు చంద్రశేఖరాన్ని బస్సు ఎక్కించాడు.

లాయరుగారికి కేసు ఎక్కడ మొదలుపెట్టాలో అగమ్యమై నిలిచింది.



శనివారం రాత్రి చంద్రశేఖరం చాలా ఆలస్యంగా నిద్రపోయాడు. నిద్రపోయే ముందు మరునాడు ఏం చేయవలసి ఉంటుందని ఆలోచించాడు. సోమవారంనాడు ఒక కేసు తీర్పుకువస్తుంది. కాగితాలు చూడాలి. ఇంతలో రామభద్రరాజుగారు జ్ఞాపకం వచ్చారు. ఆదివారం ఏ పనులున్నా- ఆ కేసుకోసం శ్రమ పడవలసిందే.

అన్ని ఆలోచనలు పక్కకు బెట్టి అతను నిద్రపోయాడు. ఉదయం అయిదుగంటలకే లేచి, ఆరు గంటల బస్సుకి బయలుదేరాడు





వెంకట్రాయుడుగారి పంచదార మిల్లు ఉత్తర ధ్రువమయితే, రామభద్రరాజుగారి గ్రామం దక్షిణ ధ్రువంలో ఉంది. అతను గ్రామంలో నివసించడంలేదు. మామిడితోటలో ఒక పర్ణశాల వేసుకొని ఉంటున్నాడు. అడ్డురోడ్డు దగ్గిర దిగి అరమైలు నడుస్తేనేగాని అక్కడికి చేరుకోలేం.

చంద్రశేఖరానికి ఆదివారం ప్రయాణం చాలా హాయిగా తోచింది.

పల్లెలు, పొలాలు, తోటలు, వాటి పక్క నుంచి పోయేరోడ్డు ప్రశాంతమైన వాతావరణం అన్నీ చూసుకుంటూ గమ్యం చేరేసరికి పదిన్నర అయింది.

రామభద్రరాజుగారి పర్ణశాల చాలా అందంగా ఉంది.

వీధి వరండాలో అతను వాలుకుర్చీ వేసుకొని వార్తాపత్రిక చదువుకుంటున్నారు.

చంద్రశేఖరాన్ని చూసి అతను నవ్వారు. లాయరుగారి నమస్కారాన్ని కూడా ఆయన అందుకోలేదు.

"నాకు తెలుసు, మీరీ ఉదయం ఇక్కడికి వస్తారని'' అన్నారతను.

చంద్రశేఖరం అతని పక్కనున్న బెంచీ మీద కూర్చున్నాడు.

"మీరు రప్పించారు. నాకు ఊపిరితీయడానికి కూడా తీరిక లేకుండా పని. అన్నీ వెనక్కుబెట్టి ఆదివారంనాడు రెక్కలు కట్టుకొని ఇక్కడికొచ్చి వాలాను'' అన్నాడు చంద్రశేఖరం.

"మీరు పొద్దుటనుంచి ఏమీ తినినట్లు లేదు. నేను ప్రకృతి వైద్యం చేస్తాను. ఉదయం పళ్లు తింటాను. మధ్యాహ్నం ఉడికించిన కూరలు, గోధుమ అన్నం. మీరు ఈరోజు మట్టుకు ఇబ్బందిపడాలి.

"నేను సాత్వికమైన ఆహారం తినవలసిన వాడిని. మీరు తినేది నాకు కూడా నచ్చుతుంది'' అన్నాడు చంద్రశేఖరం.

రాజుగారు లోపలికి పోయి నాలుగయిదు రకాల పళ్లముక్కలు, ఒక గ్లాసుతో బత్తాయి

రసం తెచ్చి నిజమైన ఫలహారం చేయించారు చంద్రశేఖరంచేత.

ఇద్దరూ సావకాశంగా కూర్చున్న తరువాత, రాజుగారే సంభాషణకు ఉపక్రమించారు.

"లాయరుగారూ, కిందటి ఆదివారం మీకు కొంత సమాచారం తెలిసిందనుకుంటాను''

"తెలిసింది. కాని, మీ అక్కగారి గురించి ఏమీ లభించలేదు. ఆమెను ప్రచ్ఛన్నంగా ప్రేమించి విరాగిగా బ్రతుకుతున్న పెద్ద అధికారి అంతరంగం తెలుసుకోడానికి అవకాశం లభించింది''

"ఈ ప్రేమతో వచ్చిన చిక్కే యిది. దాని మాయలోపడిన వాళ్లకు ఏం చేయాలో, ఏం మానాలో తెలియదు. జీవితంలోని మా ధుర్యాన్ని వాళ్లు చేజేతులా నాశనం చేసుకుంటారు''

"నాకు చాలా కష్టమనిపించింది''

"ఈవిధంగా మీరు చాలామంది దగ్గిర చాలా సంగతులు తెలుసుకోవలసి ఉంటుంది''

"మీ దగ్గిర కూడానా?"

"నాకు కూడా కొన్ని సంగతులే తెలుసు''

"సరే. మీ అక్కగారికి, మీకు వయసులో ఎంత తేడా?"

"ఆమె నాకన్న ఆరు సంవత్సరాలు పెద్ద''

"మీరిద్దరూ కలిసి బాల్యం గడిపారా?"

"లేదు. నేను నా ఎనిమిదో ఏటినుంచి, మా అమ్మమ్మగారి ఇంట్లో ఉండి చదువుకున్నాను''

"మీ అక్కగారికి వివాహం నిశ్చయమైన సంగతి ముందుగా తెలియలేదా?"

"మాకు శుభలేఖ వచ్చింది.. అప్పుడు తెలిసింది''

"శుభలేఖ అందిన వెంటనే బయలుదేరలేదా?"

"మరునాడు బయలుదేరాలని అనుకున్నాము. కాని, ఆ రాత్రే ఒక మనిషి పెళ్లి రద్దయినట్లు కబురు తెచ్చాడు.

"తరువాత మీ అక్కగారిని ఎప్పుడు చూశారు?"

"సిరిపురం రాజావారు పోయిన తరువాత"

"పెద్దవాళ్లు ఎవ్వరూ వెళ్ళలేదా?"

"అప్పటికి మా తండ్రిగారు, తల్లిగారు పరమపదించారు''

"అంటే వాళ్లు..."

"చాలాకాలం బతకవలసినవాళ్లు. ఏభై సంవత్సరాలు నిండకుండానే పోయారు. మా అక్కగారిని ఇంటినుండి తరిమివేసిన తరువాత, నలుగురిలో తల ఎత్తుకు తిరగలేక పోయారు. ఇద్దరికీ మతిస్థిమితం తప్పింది.

"అసలు విషయం అడగడం మరచిపోయాను. మీరు ఎంతమంది అన్నదమ్ములు. మీకు ఎంతమంది అప్పచెల్లెళ్లు?"

"నాకు ఇద్దరు అక్కలు- నేనొక్కడినే మగపిల్లాడిని మా వాళ్లకు''

"పెద్ద పిల్ల బతుకు నడివీధిలో పడిన తరువాత మీ చిన్నక్కగారికి ఎలా పెళ్లయింది?"

"ఎవరో దైవం అడ్డుపడ్డాడు. మా చిన్నక్క పెళ్ళి చాలా విచిత్రంగా జరిగింది. మా మేనత్త కొడుకు నిజం తెలుసుకొని ఆమెను పెళ్ళాడకపోతే, ఆమె కూడా నావలెనే బ్రహ్మచర్యం పాటిస్తూ ఉండేది''

"రాజుగారూ! మీరెందుకు పెళ్ళిచేసుకోలేదు?"

"ఏం ప్రశ్నవేశారు! మా పెద్దక్కగారికి పెళ్ళి కాకపోతే నేనే ముఖంతో పెళ్లి చేసుకోగలను?"

"మీ చిన్నక్కగారికి వివాహమయింది

కదా?"

"అయితేనేం- ఆడపిల్లలలో ఏ ఒక్కరికి- అంటే నా కన్న పెద్దవాళ్ళకి, పెళ్ళి కాపోయినా, చిన్నవాళ్ళు పెళ్ళి చేసుకోరు''

"మీకింకా వయసు మించిపోలేదు''

రామభద్రరాజు పకాలున నవ్వారు.

"మనం జపం విడిచి లొట్టలలో పడుతున్నట్లున్నాం"

"అవునవును. మీ చిన్నక్కగారు ఎక్కడున్నారు?"

"వారు న్యూయార్కులో ఉన్నారు. మా బావగారు అక్కడ పెద్ద ఉద్యోగం చేస్తున్నారు''

"ఈ రోజుల్లో అమెరికా వెళ్ళినవాళ్ళు చాలామంది ఉన్నారు. ఆ రోజుల్లో కూడా ఉన్నారా?"

"వాళ్ళు పెద్ద జమీందారులు. తెలివిగా ఆస్తులను అమ్మి, డబ్బు విదేశీయమైన బాంకులలో వేసుకున్నారు. పిల్లలను విదేశాలకు పంపించారు, పరిశ్రమలు ప్రారంభించారు. మా చినబావగారు వారిలో ఒకరు''

"మీ పెద్దక్కయ్యగారి బాల్యం గురించి తెలియజేయమని మీ చిన్నక్కగారికి రాస్తే''

"ఆమె జవాబు రాస్తుందిగానీ బహుశా ఆ వివరాలు మీకు అట్టే ఉపయోగించవు. అవన్నీ వాళ్ళ బాల్యానికి సంబంధించినవే''

"మీరు మీ అమ్మమ్మగారి యింటికి వెళ్ళిన వయసులో మీ అక్కగారు ఎలా ఉండేవారు?"

"నాకు వచ్చీరాని జ్ఞానం- ఆమె చాలా చక్కగా ఉండేవారు. మాకు చాలా మంచి కథలు చేప్పేవారు''

"సిరిపురం రాజావారు పోయిన తరువాత మీరు ఆమె దగ్గిరికి వెళ్ళినట్లు చెప్పారు. అంతకు పూర్వం ఆమెను మీరు కలియలేదా?"





"మా తండ్రిగారు చాలా పట్టుదల మనిషి- వారు చాలా తీవ్రమైన ఆంక్ష విధించారు. మా కుటుంబంలో ఎవరము కూడా, తను బతికున్నంతకాలం, మా అక్కగారి గుమ్మంలో కాలుపెట్టకూడదన్నారు''

"చిన్నప్పటి మీ అక్కగారికి, పదిహేను సంవత్సరాల తరువాత మీరు చూసిన అక్కగారికి''

"చిన్నప్పుడే మా అక్కగారిని చూశాను. తరువాత ఆమెను చూడలేదు''

"నాకు విషయం అర్థం అవడంలేదు. కొంచెం విశదంగా చెప్పండి''

"విశదంగా చెప్పడానికి ఏమీలేదు. ఏనాడయితే రాజావారి అంతఃపురంలో ఆమె స్థిరపడ్డారో, ఆనాటినుంచి ఆమర్యాదలే పాటిస్తున్నారు. నాతో కూడా 'ఆమె తెరవెనుక నుండే మాట్లాడారు''

చంద్రశేఖరం మాటలు లేకుండా కొంచెంసేపు ఉండిపోయాడు. తరువాత నెమ్మదిగా అడిగాడు.

"చిన్నప్పుడు ఆమె మీకు కథలు చెప్పారు. అప్పటి మాటలకి, ఇప్పుడావిడ ఆడిన మాటలకు మీకు ఏమేనా భేదం అనిపించిందా?"

"భేదం స్ఫుటంగా తోచింది''

"ఎందులో?"

"కంఠస్వరంలో, సంభాషణలో..."

ఏవిధంగా?"

"రెండింటిలోను పరిణితి కనిపించింది. ఆమె గొంతులో మార్దవము, ఆమె ఆలోచనా ధోరణిలో నిశితత్వము నాకు గోచరించాయి. ఆమె చాలా తక్కువ మాట్లాడారు. ఆ తక్కువగా ఆడిన మాటలు అర్థవంతాలై, ధర్మబద్ధాలై, శ్రవణసుభగాలై వినిపించాయి''

చంద్రశేఖరం, ఒక అయిదు నిమిషాలు ఆలోచించి అడిగాడు.

"మీరు ఆమెను ఎన్నిసార్లు కలిశారు?"

"రాజావారు పోయిన నెల తరువాత కలిశాను. అది ప్రారంభం. అప్పటినుండి ప్రతి పదిహేను రోజులకు ఒకసారి పోయి ఆమెతో మాట్లాడి వస్తున్నాను''

"దివాన్‌జీగారు పోయిన తరువాత ఆమె ఆర్థిక పరిస్థితిలో మార్పు వచ్చింది. ఆమె స్వయంగా మీకు దాని గురించి చెప్పారా?"

"లేదు... నాకే అర్థమయింది. ఉద్యోగాల నుండి తప్పించిన దాసీజనులు నాతో చెప్పుకొని ఏడ్చారు''

"వాళ్ళందరూ ఆమెనే నమ్ముకొని బతికారు. వాళ్ళు దుఃఖించడం సహజమే కదా!"

"వాళ్ళు ఉద్యోగాలు పోయినందుకు విచారించలేదు. మా అక్కగారు తన చదువు, సంగీతం వెనకబెట్టి యింటి పనులు చేసుకుంటున్నందుకు వాళ్ళు బాధపడ్డారు''

"ఆమె మీ యింటి విషయాలేమైనా అడిగారా?"

"నేనే ఆమెకు చెప్పాను. ఆవిడ ఏవిధంగా చలించారో నాకు తెలియదు. ఆమె నేను చెప్పినదంతా మౌనంగా విన్నారు.. ఒక్క ప్రశ్న కూడా వేయలేదు. చివరకు, నేను వెళ్ళిపోతున్నానని చెప్పినా ఆమె బదులు పలకలేదు''

"మీరు సహాయం అందించదలచినప్పుడు ఆమె ఏమన్నారు?"

"ఆమెను ఒకదారికి తీసుకురావడానికి మూడు నెలలు పట్టింది. రాజావారు లేరు. రాణీగారు లేరు. వారి రాజ్యమనండి, జమీందారీ అనండి, లేదు. మా అక్కగారి బంగళా మాత్రమే మిగిలింది. రాజావారు చనిపోయి పదిహేను సంవత్సరాలైనా, ఈ రాచరికపు మర్యాదలు, మాటపట్టింపులు ఎందుకని నేను వాదించాను. ఆమె చాలా నమ్రతతో జవాబిచ్చారు. పదిహేను సంవత్సరాలు రాజావారి కోసమే తాను బతికాననీ, మిగిలిన కాలం కూడా వారిని స్మరించుకుంటూ కాలం గడుపుతాననీ ఆమె విశదీకరించారు. అటువంటప్పుడు రాజావారి ఆస్తిలోనో లేక ఆ ఆస్తిని అమ్మగా వచ్చిన ధనంలోనో, ఒక చిన్న భాగం కోరడంలో తప్పులేదని ఆమెకు నచ్చజెప్పాను''

చంద్రశేఖరం కొంచెంసేపు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. అడగడానికి మరేం ప్రశ్నలున్నాయి?

"రాజుగారూ, మీరెంతవరకూ చదువుకున్నారు?"

"ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఇంగ్లీషులో ఆనర్సు పాసయాను. రాంకులలో వచ్చాను''

"మరి ఉద్యోగం చేయలేదేమి?"

"మా తల్లిదండ్రులను చూడవలసిన బాధ్యత ఉండనే ఉంది. వాళ్ళిద్దరూ నా చదువు పూర్తయిన రెండు సంవత్సరాలకు చనిపోయారు. అక్కగారి బాధ్యత ఎప్పుడూ ఉంది, నేను ఒంటిగా..."

రాజుగారి మాటను సగంలో ఆపి చంద్రశేఖరం ప్రశ్నించాడు.

"మీరెందుకు ఒంటిగా ఉండదలచారో అర్థంకాలేదు. చదువుకున్న రోజుల్లో మీరెవరినీ ప్రేమించలేదా?"

రాజుగారు నవ్వి ఊరుకున్నారు.

"అది రహస్యమైతే చెప్పమని బలవంతం చెయ్యను''

"రహస్యానికేముంది. ఆ అమ్మాయి చాలా పెద్ద ఉద్యోగం చేస్తున్నది. ఆమెకు ఇద్దరోముగ్గురో పిల్లలు కూడా!"

"మీ విషయానికి వస్తే- మీరు కూడా స్వతంత్రమైన వ్యాపారమేదైనా పెట్టుకోవచ్చే!"

"ఒంటరిగా జీవించవలసిన నాకు ఈ తోటలు ఈ భూములు సరిపడతాయి. నేను చాలా స్వేచ్ఛగా జీవిస్తున్నాను. ఉచితంగా ప్రకృతి వైద్యం చేస్తున్నాను. నాకేమీ లోటులే








ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షల కు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**జనవరి చతుర నవల 'పసిడి పంజరం'**............

**సమీక్షకుని పేరు :** ..........................................

**చిరునామా :** ..........................................

..........................................

..........................................

..........................................

దు. తల్లిదండ్రులు యిచ్చిన ఆస్తిని జాగ్రత్తగా కాపాడుకుంటే పదితరాలవరకు హాయిగా జీవించవచ్చు''

చంద్రశేఖరం నవ్వాడు.

"మీ తల్లిదండ్రులకు మీరొక్కరే పుత్రులు. మీరు వివాహం చేసుకోలేదు. ఈ తరంతో మీవంశం..."

"లాయరుగారు! మంచి ప్రవర్తనగల యిద్దరు అనాథ బాలురను పెంచుకుంటే ఈలోటు కూడా తీరుతుంది. మా అక్కగారి కేసు పరిష్కారమైన తరువాత ఆ పనే చేయదలచాను''

"చాలా ఉత్తమమైన పని''

రామభద్రరాజుగారికి కూడా ఒక వంటమనిషి ఉన్నాడు. తోటలు పొలాలు చూచుకోడానికి పనివాళ్ళున్నారు.

రమారమి ఒంటిగంటకు వంటమనిషి యిద్దరికీ భోజనం వడ్డించాడు. పీటలు వేసి అరిటాకులు పరిచాడు. పప్పు, గోధుమ అన్నం, ఉడికించిన కూరలొక రెండు, పచ్చికూరల పచ్చడి, పెరుగు. ఆ భోజనం అదోరుచిగా ఉంది.

చక్కని గాలి, మంచి వెలుతురు, స్వాదిష్టమైన భోజనం, ఎటువంటి పరిస్థితులలోను తొందరపడని స్వభావం, అన్నిటికన్న రామభద్రరాజుగారే ఒక ప్రత్యేకమైన వ్యక్తి.

భోజనమైన తరువాత రాజుగారు కొంచెంసేపు విశ్రమించి, పిమ్మట లాయరుగారికి నిమ్మతోట, అరటితోట, కూరగాయలమళ్ళు, పూల మొక్కలు, తులసి వనం, అన్నీ చూపించారు. ఇదో ప్రపంచం.

సాయంకాలం చంద్రశేఖరాన్ని అడ్డురోడ్డు దగ్గిర బస్సు ఎక్కించే ముందు మరికొందరి పేర్లిచ్చి సాగనంపారు రాజుగారు.

అన్ని కేసులూ ఒక పద్ధతిలో నడుస్తుంటే, ఈ కేసు మాత్రం చంద్రశేఖరాన్ని తన దారిలో నడిపిస్తున్నది.

★ ★ ★

"అవేం భోజనాలండీ! బాబుగారు! మీరెప్పుడైనా పెళ్ళి నాటి విందులో..." రామాయమ్మ అంతవరకు చెప్పి ఆగిపోయింది.

చంద్రశేఖరం ఉదయం సిరిపురం వచ్చాడు. ఈమధ్యనే నాలుగు లాడ్జీలు పట్టణంలో కట్టించారు. అన్నిటికన్న మంచిదానిలో అతను బసచేశాడు. పక్కనున్న హొటలులో టిఫిన్ చేశాడు. రామభద్రరాజు యిచ్చిన పేర్లలో రామాయమ్మ పేరుంది. ఆమె గొల్లల వీధిలో చివరి యింట్లో, కూతురి దగ్గిర ఉంటున్నది.

రామాయమ్మకు అరవైయేళ్ళుంటాయి. కొంచెం బరువైన శరీరం. యిల్లు వెతుక్కుంటూ విశాఖపట్నంనుంచి ఎవరో పెద్ద మనిషి వచ్చేడంటే ఆమెకు ఆశ్చర్యం ముంచెత్తింది. వచ్చినతను ఉత్తిచేతులతో రాలేదు. పెద్ద మిఠాయి పాకెట్టు తెచ్చాడు. ఆ పెద్దమనిషికి వీధి వరండాలో వాలుకుర్చీ వేసి, పక్కనే చాపపరచుకుని ఆమె కూర్చుంది.

ఆమె నారాయణరాజుగారింటిలో పని చెయ్యలేదు. నారాయణరాజుగారంటే రామభద్రరాజుగారి తండ్రిగారు. అతను తన యింట్లో తన పినతండ్రి కూతురు పెళ్ళి జరిపించారు. ఆ వివాహానికి రామాయమ్మ పుట్లకొలది పాలు సరఫరా చేసింది. చిక్కటి గేదె పాలు- అటు కోవాకి ఇటు పెరుగుకి- ఆమెకు నారాయణరాజుగారి పెద్దమ్మాయితో చనువుంది. బహుశా ఆకారణంచేతనే రామభద్రరాజు రామాయమ్మ పేరు కూడా లిస్టులో చేర్చినట్లున్నారు.

"నేనెప్పుడూ అటువంటి విందులో పాల్గొనలేదు'' అన్నాడతను.

"బాబుగారు! అటువంటి ఆచారాలు ఎక్కడా చూచి ఉండరు. పెండ్లి కుమార్తెతో ఒక్క ముత్తయిదువే వస్తారు. మిగిలిన వారందరూ మగాళ్లే'

"అవునవును. నేనూ విన్నాను''

"పెళ్ళి విందుకు చాలా పెద్ద విస్తళ్లు ప్రత్యేకంగా కుట్టిస్తారు. సన్నటి దగ్గిరకుట్టుతో గుండ్రంగా ఉంటాయవి. విస్తరిలో వడ్డించే కూరలు రోజూ యింట్లో వండుకునేవి కావు. కొత్త పద్ధతిలో వండిస్తారు. పచ్చళ్ళు, నాలుగు తీపి వస్తువులు, వాటిలో కోవా బిళ్ళలు, పూత రేకులు తప్పకుండా ఉంటాయి. నాలుగు కారపుపిండి వంటలు, ఊరగాయలు, అప్పడాలు, వడియాలు, వెన్నకాచిన నెయ్యి, కత్తితో కోయవలసిన గడ్డపెరుగు, గోళ్ళలో యిమిడే సన్న బియ్యపుటన్నం"

"చాలా గొప్ప భోజనమన్న మాట!"

"భోజనాల మాట అటుంచండి బాబుగారు! ఆ పిలుపులు, అంత బాగా మరెవరూ పిలవరనుకోండి. గడ్డం పట్టుకొని, బతిమాలి మరీ భోజనాలకు పిలుస్తారు. మగాళ్ళందరూ పంక్తులు దీరి కూర్చుంటారు. మొదటి పంక్తిలో, అన్ని మర్యాదలు తెలిసినవారు ఒకరుంటారు. తొలిసారి వడ్డనకే అన్ని దినుసులూ సమృద్ధిగా వడ్డిస్తారు. భోజనాలు కొంతవరకు అయిన తరువాత, మారు వడ్డించడానికి, అన్ని పదార్థాలను తీసుకొని వస్తారు. ముందు పంక్తిలో కూర్చున్న అతను, చేతులు రెండూవద్దని అడ్డుపెట్టి అంటారు. 'ఏమహానుభావుడు ఇంతకన్న హెచ్చు కావాలంటాడు, నాకు మాత్రం మరేమీ వద్దు' ఆ విధంగా రెండోసారి, మారు వడ్డన కోసం తెచ్చిన వస్తువులు అలాగే తిరిగి పట్టుకుపోతారు. భోజనాలు అయిన తరువాత వయసులో నున్న దాసీజనం, అతిథుల చేతులమీద పన్నీరు కలిపిన నీరు పోస్తారు. మల్లెపువ్వుల వంటి తువాళ్ళు పట్టుకొని పక్కనే నిలుచుంటారు. ఆ తాంబూల మేమిటండీ! అన్ని రకాల సుగంధద్రవ్యాలు, లేత తములపాకులు, ప్రశస్తమైన వక్కపొడి అన్నీ అందిస్తారు. బాబుగారు! ఈ రోజుల్లో అలాంటి భోజనాలు కావాలన్నా దొరుకుతాయా?"




రామాయమ్మ మాటలు వింటూ చంద్రశేఖరం ఆశ్చర్యచకితుడయాడు. ఆమె మాటలలో యాస తక్కువ. పెద్ద వాళ్ళ దగ్గిర తరచు ఉంటూ, మాటలాడడంలో ఆమె నేర్పు సంపాదించినట్లున్నది.

"రామాయమ్మా! నేను నారాయణరాజుగారి పెద్దమ్మాయి గురించి తెలుసుకోడానికి వచ్చాను. ఈ భోజనాల సంగతి బాగానే ఉంది. మిగిలిన విషయాలు కొంచెం చెప్పు తల్లీ!"

""బాబుగారు! కొంచెం మజ్జిగ తీసుకొస్తాను. సావకాశంగా కూర్చోండి''

రామాయమ్మ యింట్లోకి వెళ్ళింది.

చంద్రశేఖరం ఆలోచిస్తున్నాడు. తాను కోరినట్లు, సంగతులేవీ తొందరగా ఊడిపడడంలేదు.

రామాయమ్మ లోపలినుంచి వచ్చేసరికి పావుగంటయింది.

పెద్దగ్లాసులో చిక్కటి మజ్జిగ- పైన వెన్న, కరివేపాకు, కొత్తిమీరి, అల్లం, పచ్చిమిరపకాయలు దంచివేసినది. చాలా బాగుంది. చాలా చాలా బాగుంది.

"బాబుగారు, నేను నారాయణరాజుగారికి చాలాకాలం పాలు కొలిచాను. వారికి యిద్దరు అమ్మాయిలు, ఒక అబ్బాయి. వారి యిల్లు రాజవీధిలో మధ్యనుంది, ఎంత పెద్ద పెంకుటిల్లో! మీరు చూసే వుంటారు!"

"నేను చూడలేదు. అందులో యిప్పుడెవరుంటున్నారు?"

"బ్యాంకుకి అద్దెకిచ్చారు''

"పాపం! చాలా మంచి కుటుంబం. నిష్కారణంగా శిథిలమయింది''

"అదే నేను పడ్డబాధ. పెద్దమ్మాయిగారి పెళ్ళి అవడానికి ముందు, ఆ యింట్లో వారి పినతండ్రి కూతురుగారి పెళ్ళయింది. అప్పుడు పెద్దమ్మాయిగారితో నేనన్నాను, 'అమ్మాయిగారు, మీ పెళ్ళికి యింతకు రెండు రెట్లు చుట్టాలు వస్తారు. కాబోయే మీ భర్తగారు

చాలా పెద్ద చదువులు చదివి, చాలా పెద్ద ఉద్యోగం చేస్తున్నారట. మీ పెళ్ళి కోసమని మరో నాలుగు గేదెలు కొన్నాను''

"ఆమె ఏమన్నారు?"

"ఏమంటారు? నవ్వి ఊరుకున్నారు''

చంద్రశేఖరం కొంచెంసేపు ఆలోచించి అడిగాడు.

"ఆమెకీ సంబంధం నచ్చలేదా?"

"తల్లి దండ్రులు కుదిర్చిన సంబంధం ఆమె ఎలా కాదంటారు?"

"అవునవును''

"నిజం చెప్పాలంటే, అమ్మాయిగారి పెళ్ళి కి రెండు నెలల ముందునుంచి ప్రయత్నా లు మొదలయాయి. నారాయణరాజుగారు స్వయంగా వెళ్ళి అందరు బంధువులను పిలిచారు. వారం రోజుల ముందు పందిరి వేయించారు. నేను అర్జంటుగా మా అక్కగా రింటికి వెళ్ళవలసి వచ్చింది. రెండు రోజుల్లో తిరిగి వచ్చాను. ఆసరికి పందిరి కూల్చివేశా రు. తోరణాలు తెంపారు. ముగ్గులు చెరిపా రు''

"ఎందుకని?"

"అమ్మాయిగారు చెడిపోయారట!"

"అంటే''

"రాజావారితో ఆమె సంబంధం పెట్టుకు న్నారు''

"ఎవరు చెప్పారు?"

"ఒకరు చెప్పడమేమిటి? లోకమంతా కో డై కూసింది''

"మరేవిధమైన రుజువు, సాక్ష్యం లేవా?"

"రుజువులు సాక్ష్యాలు దేనికి? నారాయ ణరాజుగారే ఆమెను స్వయంగా యింటి నుండి తరిమివేశారు''

చంద్రశేఖరం ఆలోచించి అడిగాడు.

"ఆ తరువాత నువ్వు అమ్మాయిగారిని కలిశావా?"

"బాబుగారూ! నేను పరువూ, మర్యాదా కలదానిని''

"ఆమె ఎక్కడికి వెళ్ళారు?"

"రాణివాసంలో కలిసిపోయారు''

"మీవూళ్లో, ఇంత అన్యాయం జర్గిగితే, మీరందరూ చూస్తూ ఊరుకున్నారా? ఒక ఆడకూతురి బతుకును మంటలో కలుపు తుంటే, ఆమెను పెళ్ళాడదలచిన అతని జీవితం దుర్భరం చేసినందుకు, రాజావారిని ఎవరూ నిలదీసి అడగలేదా?"

"ఏమడుగుతాం బాబుగారు! కొండను గుద్దితే గొర్రె పోతు కొమ్ములే విరుగుతాయి''

"రాజావారికి ఆడవాళ్ళంటే అంత సరదా నా?"

"ఏమో! అంతఃపురంలో జరిగేవి మన కేం తెలుస్తాయి?"

రామాయమ్మ, రాజావారిమీద అక్కసు పెంచుకోడంలో తప్పులేదు. దివాణం స్థలం ఆక్రమించి, పశువులను కడితే, రాజావారు చర్య తీసుకున్నారు. అందుకే ఆమెకు అంత కోపం.

చంద్రశేఖరం చాలామందిని కలిశాడు. ఇక్కడో ముక్క, అక్కడోముక్క, అసలు వారిని కలుస్తే ఈ శ్రమ చాలావరకు తగ్గు తుంది. కాని, తను మాత్రం, లోకుల దృష్టిలో ఆమెను చూసి నిజాన్ని రాబట్టాలి.

అతను జరిపిన ఇంటర్వ్యూలలో లక్ష్మీ నారాయణగారితో జరిపినది చాలా ముఖ్య మైనది. ఆయన సిరిపురం ఆస్థాన పండితు లు. రాజుగారు పోయినతరువాత, దివాన్‌జీగా రు బతికి ఉన్నంతవరకు, వారికి పింఛను దొరికేది. వారు ప్రస్తుతం తమ కొడుకు దగ్గిర ఉంటున్నారు.

వారి యిల్లు వెతుక్కొని వెళ్ళేసరికి పన్నెండు గంటలయింది.

శాస్త్రిగారు అప్పుడే దేవతార్చన ముగించా రు. కోడలు వడ్డనకు ప్రయత్నం చేస్తున్నది. చంద్రశేఖరం వచ్చిన సంగతి ఆమె మామగా

రికి చెప్పింది. ఆయన క్షణంసేపు ఆలోచించారు. భోజనాలవేళ వచ్చిన అతిథిని ఎలా వెళ్ళిపోమనగలరు?

"మామగారు మిమ్మల్ని కాళ్ళు కడుక్కోమంటున్నారు''

"ఎందుకమ్మా! నేనెక్కడో భోజనం చేసి వస్తాను''

అతిథికి అభ్యాగతికి పెట్టనిదే ఆయన భోజనం చేయరు''

"సరే!... తప్పదు కదా!"

"మరొక చిన్న నియమం. తడిగామంచా యిస్తున్నాను. మడి పంచ పీటమీద ఉంచుతాను. మీరు కొంచెం శ్రమపడాలి''

ఆ యింట్లో ఆచారం, మడి- అన్నీ జరుగుతున్నాయి. చంద్రశేఖరం మరేమీ అనకుండా తడిగామంచా కట్టుకొని, మడి పంచ తీసుకున్నాడు.

భోజనం పూర్తయేవరకు శాస్త్రిగారు ఏమీ మాట్లాడలేదు. వచ్చిన వారెవరో తెలుసుకోడానికి కూడా ప్రయత్నించలేదు.

భోజనం చాలా బాగుంది. శాస్త్రిగారి అబ్బాయి కాలేజీలో లెక్చరరుగా పనిచేస్తున్నాడు. అతను ఒంటిగంట తరువాత వస్తాడు. మనుమలు కూడా తండ్రితోనే భోజనం చేస్తారు. శాస్త్రిగారి భార్య, కోడలు ఆ తరువాత భోజనం చేస్తారు.

వాళ్ళుంటున్నది పెద్ద పెంకుటిల్లు. వీధి వరండా చాలా వెడల్పుగా ఉంది. దానికి ఒక చివరను చిన్న గది, విశాలమైన ముందుహాలు, పెద్ద మండువా, మండువాకు యిటుపక్క, అటుపక్క పడక గదులు, తరువాత నట్టిల్లు, దానిని దాటితే వంటిల్లు అలా అన్నీ ఉన్నాయి. పెద్ద పెరడు, నుయ్యి అన్నీ అమరి ఉన్నాయి. శాస్త్రిగారి తండ్రిగారు ఆ యింట్లోనే ఉండేవారు. తరువాత శాస్త్రిగారు అక్కడే స్థిరపడ్డారు. వీధిలో చాలా యిళ్ళు కొత్తరకాలలో వచ్చినా, ఈ యిల్లు మాత్రం మార్పులు చెందలేదు. తాను బతికి ఉన్నన్నాళ్ళు ఏ మార్పులూ చేయించవద్దని శాస్త్రిగారు కొడుకుతో చెప్పారు. ఉన్న ఒక్క కొడుకు తండ్రిమాట శిరసావహించాడు.

ఇద్దరూ భోజనాలు ముగించి ముందు హాలులోకి వచ్చారు.

"అయ్యా! మీరెవరో? అన్ని విషయాలు మనం సావకాశంగా మాట్లాడుకుందాం. కొంచెంసేపు విశ్రాంతి తీసుకుంటే, మీరు చెప్పిన మాటలు నా చెవిని పడతాయి. లేకపోతే నా కళ్లు మూతలుపడి, ఏవీ వినిపించుకోలేను. వాలు కుర్చీలో కూర్చోండి. టేబిలు మీద అన్ని రకాల పత్రికలు ఉన్నాయి, చదువుకోండి. మా అబ్బాయి మరొక్క అరగంటలో వస్తాడు. మీరు మూడు దాకా ఓపికపడితే అన్ని సంగతులు మాట్లాడుకోవచ్చు''

శాస్త్రిగారు తమ పడక గదిలోకి వెళ్లిపోయారు.

చంద్రశేఖరానికి పత్రికలు చదవాలని పించలేదు.

శాస్త్రిగారు ఆస్థాన విద్వాంసులు. తరచు రాజావారితో సాహిత్య చర్చలు చేసి ఉంటారు. కాబట్టి ప్రభువుల గురించి వారికి తెలియడం సబబు. కాని ఈ పండితులకు రామభద్రరాజు అక్కగారి గురించి ఏం తెలుస్తుంది? ఆమె, తన స్వంత తమ్ముడిని చూడడానికి కూడా అంగీకరించలేదు. అటువంటప్పుడు ఆస్థాన విద్వాంసులను ఎలా చూస్తారు, ఎలా మాట్లాడతారు?

ఒకవేళ ఆమె శాస్త్రిగారితో గోష్ఠి జరిపే ఉండవచ్చు. కాని, ఈ కేసుకు అదెంతవరకు ఉపకరిస్తుంది?

బహుశా, రాజావారు ఆమెపట్ల ఎటువంటి అభిప్రాయం కలిగి వుండేవారో తెలుసుకోవచ్చు. రాజావారి వైదుష్యం, సహృదయత, రసికత మొదలైన వాటి గురించి కొన్ని వివరాలు రాబట్టవచ్చు.




రామభద్రరాజుకి మరెవరూ దొరకలేదా?

ఇంతలో శాస్త్రిగారి అబ్బాయి, ఇద్దరు మనుమలు కాలేజీనుంచి వచ్చారు.

చంద్రశేఖరం కుర్చీలోంచి లేవబోయాడు. లెక్చరరు అతనిని లేవవద్దని చేతితో సంజ్ఞ చేశాడు.

అయినా తానెవరో అతనికి తెలియజేయడం ధర్మమనిపించింది చంద్రశేఖరానికి.

"నా పేరు చంద్రశేఖరం. విశాఖపట్నంనుండి వచ్చాను. మీ నాన్నగారు శ్రీలక్ష్మీనారాయణ శాస్త్రిగారితో పనుంది''

శాస్త్రిగారి అబ్బాయి అతనికి నమస్కారంపెట్టి యింట్లోకి వెళ్లిపోయాడు. మరొక్క అరగంటలో పిల్లలను తీసుకొని అతను తిరిగి కాలేజీకి వెళ్లిపోయాడు.

అనుకున్న వేళకు శాస్త్రిగారు లేచారు. పెరట్లోకి వెళ్లి వచ్చి, మంచినీరు తాగి హాలులోకి వచ్చారు.

చంద్రశేఖరానికి దగ్గిరలో మరో వాలుకుర్చీలో కూర్చున్నారు. చిన్న బల్లమీద చెంబుతో మంచినీళ్లు పెట్టింది కోడలు.

"అయ్యా! ఇప్పుడు చెప్పండి! మీరెవరు? ఎక్కడినుంచి వచ్చారు? నాతో మీకేం పని?" అన్నారాయన.

"నా పేరు చంద్రశేఖరం. విశాఖపట్నంనుండి వచ్చాను. నేను లాయర్ని. సిరిపురం రాజావారి గురించి కొన్ని సంగతులు తెలుసుకోడానికి వచ్చాను'' అన్నాడు చంద్రశేఖరం.

"మంచిది... మీకే సంగతులు కావాలో అడగండి. నాకు తెలిసినంతవరకు చెప్తాను''

"వారి గురించి చెప్పేముందు మీ వివరాలు తెలుసుకోగోరుతున్నాను''

"అంటే?"

"మీరు ఎక్కడ జన్మించారు?"

"బొబ్బిలికి సమీపంలోనున్న అగ్రహారం"లో జన్మించాను''

"మీ తల్లిదండ్రులు?"

"సూరిశాస్త్రిగారు, వెంకమ్మగారు''

"మీ విద్యాభ్యాసం?"

"కొద్దివరకు బొబ్బిలిలోను పై తరగతులు విజయనగరంలోను''

"ఏ స్థాయి వరకు?"

"ముందుగా వ్యాకరణ శిరోమణిని. తరువాత సాహిత్య శిరోమణిని. పిదప ఉభయ భాషా ప్రవీణ పట్టం పుచ్చుకున్నాను''

"అంటే చాలా సంవత్సరాలు విద్యాభ్యాసంలో గడిపారన్న మాట"

'అవును''

"మీరు ఏయే ఉద్యోగాలు చేశారు?"

"చదువయిన తరువాత ఒక సంవత్సరం సిరిపురం హైస్కూలులో తెలుగు పండితుడిగా పనిచేశాను''

"అటు తరువాత?"

'రాజావారు ఒకసారి మా స్కూలుకు రావడం తటస్థించింది. వారు విద్యార్థుల మధ్య కూర్చొని, పాఠం చెప్పమన్నారు. శ్రీనాథుడి శృంగార నైషధంలో హంసదౌత్యం పాఠ్యపుస్తకంలో ఉంది. తెలుగు పద్యాలకు అర్థం, తాత్పర్యం, సమాసాదులు చెప్పడమే కాకుండా సంస్కృత నైషధంలో, ఆ సందర్భంలో వచ్చిన శ్లోకాలు చదివి వివరించాను. ఆయన చాలా సంతోషించారు. ఆరు నెలలు నా గురించి ఆలోచించారు. మరొకరు నా స్థానంలో పనిచేయడానికి దొరకగానే, వారిని తెలుగు పండితులుగా నియమించి నన్ను ఆస్థాన కవులుగా తీసుకున్నారు''

"మీరు పండితులే కాకుండా కవులు కూడానా?"

"అవును... నేను పదో ఏటనుంచి పద్యాలు అల్లాను. పదిహేనో ఏటినుంచి శ్లోకాలు రచించాను. ముందు నేను కవిని. తరువాత పండితుడిని''

"తావి వచ్చి బంగారానికి బంధువ యింది''

"చాలా బాగుంది మీ ప్రశంస!"

"ఆస్థానకవిగా మీరు రాజావారి మీద పద్యాలు చెప్పడమేనా, లేక మరే విధమైన సాహిత్య చర్చవంటిది ఉండేదా?"

"సిరిపురం రాజావారి గురించి మీకు ఏమీ తెలిసినట్లు లేదు''

"నిజానికి, వారి పేరు కూడా సరిగా జ్ఞాపకముంచుకోలేదు''

"వారి పేరు వెంకటరంగారావుగారు. ప్రభుత్వం వారికి బహదూర్ అన్న బిరుదు నిచ్చి గౌరవించింది''

"మీరు ఏ వయసులో ఆస్థాన కవులయారు?"

"పాతిక సంవత్సరాల ప్రాయంలో ఆ పదవికి నియమింపబడ్డాను''

"ప్రస్తుతం మీ వయసు?"

"అరవై అయిదు''

"రాజావారికి, మీకు వయసులో ఎంత తేడా?"

"నాకన్న వారు ఒక నెల చిన్న''

"అయితే మీ యిద్దరిమధ్య ఎటువంటి సంబంధముండేది?"

"స్నేహితుల మధ్యనుండే సాన్నిహిత్యం, సోదరుల మధ్యనుండే బంధుత్వం"

"మళ్లా మనం అసలు విషయానికి వద్దాం. ప్రతిదినం మీరు రాజావారిని దర్శించేవారా''

"వారంలో నాలుగుసార్లు వారి దర్శనం చేసేవాడిని. శనివారం, ఆదివారం, మంగళవారం వారి దగ్గిరికి వెళ్లేవాడిని కాను. సాధారణంగా సాయంకాలాలలో, అంటే అయిదు నుండి రాత్రి తొమ్మిది వరకు వారితో గడిపేవాడిని. ఒక్కొక్కసారి రాత్రి పన్నెండు వరకు వారితో ప్రసంగిస్తూ ఉండిపోయేవాడిని''

"ఆయన మీతో ఏ విషయాలు చర్చించేవారు?"

"సాహిత్యం మీద చర్చలు జరిగేవి. వ్యాకరణం కూడా దానిలో భాగమని వారి అభిప్రాయం. నెలకు రెండు మూడుసార్లు భాషాశాస్త్రం మీద కూడా గోష్ఠి జరిగేది''

"మీ సాహిత్య చర్చ ఏయే భాషలలో జరిగేది?"

"తెలుగు, సంస్కృత భాషలలో''

"అంటే రాజావారికి సంస్కృత భాషా పరిజ్ఞానముందన్నమాట"

"బాగా ఉంది.

"చాలా గొప్ప సంగతి. ఈ చర్చలలో మీరిద్దరే పాల్గొనేవారా, లేక మరెవరేనా మీతో చేరేవారా?"

"ఏకాంతంగా మేమిద్దరం సాహిత్య గోష్ఠిలో కాలం గడిపేవాళ్లం. మరొకరిని చేర్చుకోడానికి ఆయన యిష్టపడేవారుకారు. ఎవరేనా వస్తే ఆ ప్రసంగం అక్కడితో ఆగిపోయేది''

"రాణీగారు కూడా పాల్గొనేవారా?"

"ఆమె ఎప్పుడూ పాల్గొనలేదు''

"మీరు ఎటువంటి కావ్యాల గురించి ప్రసంగించేవారు?"

"తెలుగులోను, సంస్కృతంలోను పంచ మహా కావ్యాలున్నాయి. తరచు వాటిలో చర్చలు జరిగేవి''

"అదికాదు, మీరు శృంగార రస ప్రధానమైన కావ్యాల గురించి, కరుణరస ప్రధానమైన వాటిగురించీ..."

"ఆవిధంగా చెప్పవలసి వస్తే, కరుణరస ప్రధానాలైన కావ్యాలనే వారు యిష్టపడేవారు''

"మీరు మరోవిధంగా భావించకుండా ఉంటే, చిన్న ప్రశ్న''

"అడుగు''





"సాధారణంగా ప్రభువులు భోగపరాయణులు. మరి రంగారావు బహదూర్ వారు...?"

"ఆయన శ్రీరామచంద్రమూర్తి ఏక పత్నీ వ్రతస్తులు. ఇతర స్త్రీలను కన్నెత్తి చూడని మహానుభావులు''

చంద్రశేఖరం తన వాక్చాతుర్యంతో రహస్యాలు రాబడదామనుకున్నాడు. కాని, అటువంటివి చెప్పడానికి ఈయన ముందుకు రావడంలేదు.

మరేం చేయాలి?

తాను లాయరు. ఎన్నో పద్ధతులున్నాయి, తాను కోరినది తెలుసుకోడానికి.

"మీ వంటి మహా విద్వాంసులకు శిష్యులుండడంలో అబ్బురం లేదు. ఈ తరం కవులలోకాని, రచయితలలోకాని, పండితులలో కాని మీ శిష్యులెవరేనా ఉన్నారా?"

"నేను తెలుగు పండితుడిగా కొంతకాలం పనిచేస్తే శిష్యులు ఉండేవారేమో! కాని ఉద్యోగంలో ప్రవేశించిన ఒక సంవత్సరంలోనే ఆస్థానకవిగా చేరడంతో నేను మరెవరినీ శిష్యులుగా చేర్చుకోలేదు. దీనికి కూడా ఒక ప్రబలమైన కారణముంది. రాజావారితో నాలుగు రోజులు ప్రసంగించడానికి, చాలా గ్రంధాలను చదవడం అవసరం పడేది. దానా దీనా, నేను ఎవరినీ శిష్యరికానికి చేర్చుకోలేదు''

"పై వాళ్లలో శిష్యులు మీకు లేకపోవచ్చు. రాజావారికి సంబంధించిన వారికి..."

"ఈ సంగతి నువ్వడగకూడదు. నేను చెప్పకూడదు''

చంద్రశేఖరం కొంచెంసేపు మాట్లాడలేదు, తరువాత చాలా వినయంగా అన్నాడు.

"మిమ్మల్ని యిబ్బందిలో పెడుతున్నాను క్షమించండి'' శాస్త్రిగారు కూడా ఆలోచించారు.

"అవును... నేను, రాజావారు ఈ సంగతి మరెవరికీ తెలియకుండా ఉండాలని కోరాము''

"మీరు మంచి ఉద్దేశంతో ఈ సంగతి పైవారికి తెలియకుండా ఉండడంకోసం కట్టుదిట్టం చేశారు. కాని దాసదాసీజనం గురించి మీరు పట్టించుకున్నట్లు లేదు''

"వాళ్లను కూడా దూరంగానే ఉంచాము''

"ఇవాళ రాజా వేంకటరంగారావు బహదూరుగారు లేరు. వారి సంపద అంతా ప్రభుత్వానికి చెందిపోయింది. మీరు రహస్యమని దాచిపెట్టిన విషయం అందరికీ తెలిసిపోయింది''

శాస్త్రిగారికి కోపం వచ్చింది.

"రహస్యం రహస్యమే. నేను నా నోటితో ఎవరికీ చెప్పలేదు''

పెద్దాయన బల్లమీద చెంబు తీసుకొని, నీళ్లు గడగడ పైనున్న గామంచాతో ముఖం తు ుకున్నారు.

శాస్త్రిగారికి అరవై ఐదు సంవత్సరాలున్నాయి. మనిషి పొడవుగా ఉంటారు. దానికి తగిన శరీరముంది. నిరాడంబరంగా, పెద్ద ఖద్దరు గామంచా కట్టుకున్నారు. అటువంటిదే మరొకటి పైన వేసుకున్నారు. ఆయన చేతికి బంగారు కడియాలు కాని, మరే విధమైన, విద్వాంసులు ధరించే కీర్తి చిహ్నాలు లేవు. గొంతు గంభీరమైనది. ముఖంలో వర్చస్సు గోచరిస్తున్నది. అనృతమాడరు, వాగ్దాన భంగం వారి వంశంలోనేలేదు.

మరి, చంద్రశేఖరం ఏం చేయాలి?

శాస్త్రిగారే తప్ప మరొకరా సంగతి చెప్పలేరు.

"వాగ్దాన భంగం కాకుండా, నేనడిగే కొద్ది ప్రశ్నలకు, దయచేసి జవాబులు చెప్పమని ప్రార్థిస్తున్నాను''

ఇంతకోపంలోను శాస్త్రిగారు పకాలున నవ్వారు.

"నువ్వు లాయరువన్నమాట మరచిపో



యాను''

"ఛాత్రులకు ప్రస్తుతం ఒకరే అనుకుందాం, వారికి మీరు విద్యగరిపారు. మరి, ఎన్ని సంవత్సరాలు?"

"పన్నెండేళ్లు''

"ఏ శాస్త్రానికి సంబంధించినదా విద్య?"

"సాహిత్యశాస్త్రానికి సంబంధించినది''

"ఎంత లోతులకు పోయారు?"

"నేను అధ్యయనం చేసినది కొన్ని సంవత్సరాలు కూలంకషంగా పూర్తి చేసినది, ఇతరులనుండి నేను తెలుసుకున్నది, నా బుద్ధి వికసించడం వలన నేను కొత్తగా కనుక్కొన్నది, నేను ప్రాణాతిప్రాణంగా పరిగణించి మథించిన అలంకార శాస్త్రం, నేను అధికారికంగా చెప్పిన వ్యాకరణ శాస్త్రం, ఇవన్నీ ఇంకా ఎన్నో నేను పన్నెండు సంవత్సరాలు బోధించాను, అంతేకాకుండా మరో రెండు సంవత్సరాలు నేను వారి విద్వత్తును పరీక్షించాను''

చంద్రశేఖరం వింటున్నాడు, భావావేశంతో శాస్త్రిగారు చెప్తున్నది వింటున్నాడు. మళ్లా శాస్త్రిగారే మాట్లాడారు.

"మరి నాకు బోధించడానికేమీ మిగులలేదు, రెండు సంవత్సరాలు నేను జరిపిన పరీక్షలలో వారు నన్ను అన్నివిధాల మించి పోయారని తెలుసుకున్నాను''

"ఒక వ్యక్తికి ఇంత ధీశక్తి ఉంటుందా అన్న సందేహం నాకు కలుగుతున్నది''

"వారు ఏక సంథాగ్రాహి''

"ఇదంతా తెలుగులోనేనా, లేక సంస్కృతంలో కూడానా?"

"తెలుగు సంస్కృతంలో భాగం. వారికి సంస్కృతంలోనే చాలా వరకు బోధించాను. వారు సంస్కృతంలోనే జవాబులిచ్చేవారు''

చంద్రశేఖరం చాలా సేపు ఆలోచించాడు.

అడగడానికి మరి ప్రశ్నలులేవు.

"మీరు మహాపండితులు, మీ అంతటి శిష్యులను తయారుచేశారు. మీకు నా నమస్కారాలు''

"బాగుంది, బాగుంది!"

"ఆ శిష్యులు కూడా మీ వలె వర్చస్వియై ఉంటారని అనుకుంటాను''

"చాలు చాలు! రాచవారి మర్యాదలు పాటించాను. తెర వెనుక కూర్చొని విద్య నేర్చుకున్న వారి రూపు రేఖలు తెలుసుకోడానికి నేను బిల్హణుడిని కాను. ఒక్క నిజం చెప్తున్నాను, శిష్యాదిచ్ఛేత్ పరాజయం, ఇది నానుడికాదు అయినా వాస్తవం. వారు గురువుల కన్నా రాజావారికన్నా విద్యాధికులు''

చంద్రశేఖరం వంగి అతని పాదాలకు నమస్కరించి సెలవు తీసుకున్నాడు.



"అమ్మాయి మల్లికా! అల్లుడుగారు వచ్చారు. మన రాజావారి గురించి తెలుసుకోడానికి వచ్చారు. ముందు మర్యాదలు జరిపి, అటు పిమ్మట సావధానంగా సంభాషించడం నా కర్తవ్యం" అంది చిట్టిరాజు.

సిరిపురంలో ఇప్పటికీ దేవాలయం వీధి ఉంది. ఒకప్పుడు అక్కడ ఒకే వృత్తికి చెందినవారు ఉండేవారు. క్రమంగా తగ్గిపోయారు. ఇప్పుడు ఆ వృత్తీలేదు, ఆ మనుషులూ లేరు.




చిట్టిరాజు పేరు హేమాంగి. రామభద్రరాజు యిచ్చిన పేర్లలో రెండే మిగిలిపోయాయి. ఒకటి చిట్టిరాజుదైతే, రెండవది వైణిక సార్వభౌమ గోపాలశర్మగారిది.

ఆరు నెలలయి, ఒక్క ఆదివారం కూడా విడువకుండా, చంద్రశేఖరం ఊరు తరువాత ఊరు తిరుగుతూనే ఉన్నాడు. వ్యక్తులను కలుస్తూనే ఉన్నాడు. ప్రశ్నలు అడుగుతూనే ఉన్నాడు. అవధానం చేస్తూనే ఉన్నాడు. దొరికిన ముక్కలనన్నిటినీ సమీకరించి, కోర్టులో ధారణతో దానిని పూర్తిచేయాలి.

పర్యటనలు జరిపిన ఈ ఆరు నెలలలోను అతనొక సత్యం తెలుసుకున్నాడు. రామభద్రరాజుగారి అక్కగారి గురించి చెప్పమంటే జవాబులు సరిగా రావు. వచ్చినవి కూడా ఉపయోగపడలేదు.

మరొక్క సంగతి కూడా అతను గమనించాడు. అతను కలిసిన వారెవరికీ రాజావారి మీద గౌరవం ఇంకా తగ్గలేదు, ఒక్క గొల్లరామాయమ్మకి తప్ప. అతని గురించి అందరూ మంచి మాటలే చెప్పేవారు. ఒక నిందావాక్యం కూడా ఎవరినుండీ వినలేదు.

రాజా వెంకట రంగారావు బహదూర్ వారి గురించి చెప్పేటప్పుడు అప్రయత్నంగా ఆమె గురించి చెప్పేవారు. వాటినన్నిటినీ చంద్రశేఖరం జాగ్రత్తగా డయరీలో రాసుకున్నాడు. వారం వారం ఏదో ఒక కొత్త విషయం తెలుస్తూనే ఉంది. రాజావారి విషయంలో అయితే ఎన్నో సంగతులు తెలిశాయి.

చంద్రశేఖరం, ఉదయం తొమ్మిదింటికే సిరిపురం చేరుకున్నాడు. చిట్టిరాజుగారి యిల్లు తెలుసుకోడానికి అంత కష్టమవలేదు. పట్టణం చాలా అందంగా కనిపించింది. ఆ చక్కదనం కొత్తగా వచ్చినదికాదు. చాలా సంవత్సరాలయి, శ్రద్ధ తీసుకొని పోషించిన సౌందర్యమది.

రాజావారు బతికున్న దినాలలో కోట, కోటచుట్టూ ప్రహరీ, దానికి నాలుగు దిక్కులా నాలుగు ద్వారాలు, ప్రహరి చుట్టుకొని పదహారడుగులు లోతైన కందకం, కందకంలో నీళ్లు, వాటిలో తామరపూవులు, సింహద్వారం దగ్గిర తప్ప, మిగిలిన మూడు ద్వారాల వేపు కందకం మీద వేసిన కర్రవంతెనలు ఉండేవి. వారు చనిపోకముందే పట్టణం మునిసిపాలిటీ అధీనమయింది. వారు పోయిన తరువాత కందకంలో నీళ్లు ఎండి పోయాయి. మరి వాటిలో తామర పూవులెలా ఉంటాయి? దివాన్‌జీగారు ఉన్నంతకాలం కందకముంది. వారు చనిపోయిన పిమ్మట, రాజావారి ఆస్తులన్నీ ప్రభుత్వానికి దఖలు పడిన తరువాత కోట యొక్క స్వరూపమే పూర్తిగా మారిపోయింది. కందకం కప్పివేశారు, కర్రవంతెనలు ఎందుకూ పనికిరాకుండా శిథిలమయాయి. ప్రహరీ పడగొట్టారు. కోటలోని పాత భవనాలను కొట్టించి వేశారు. ఒకటో రెండో బాగుంటే ఒక దానిలో బాంకు, ఒక దానిలో మునిసిపల్ కార్యాలయం, మరొక దానిలో ఉన్నత పాఠశాల నెలకొల్పారు. ఆవిధంగా, చంద్రశేఖరం సిరిపురం వెళ్లేసరికి దాని రూపమే మారిపోయింది.

కోటకు సమీపంలో పార్కు, పట్టణ గ్రంథాలయం, రాజావారి నిధులతోనే నడుస్తున్నాయి. రాజావారు జీవించి ఉన్నప్పుడే వాటికి నిధులను సమకూర్చడంచేత ఆ రెండూ ఏ యిబ్బందీ లేక నడుస్తున్నాయి. మిగిలినవన్నీ ప్రభుత్వం అమ్మివేసింది... ఒక్క బంగళా తప్ప.

ఇంతలో చిట్టిరాజు కూతురు మల్లిక, చంద్రశేఖరానికి మర్యాదలు జరపడానికి హాలులోకి వచ్చింది.

చిట్టిరాజు యిల్లు చాలా విశాలమైన స్థలంలో కట్టినది. చుట్టూ కాంపౌండువాలు, గేటు తీసుకొని లోపలికి వెళ్తే పూల మొక్కలు, మల్లెపందిళ్లు, వాటికి సమీపంలో విశాల

మైన సిమెంటు బెంచీలు కనిపిస్తాయి. వెడల్పైన వీధి వరండా దాటగానే పెద్ద హాలు కనిపిస్తుంది.

హాలులో దూలానికి వేలాడుతూ యినుప గొలుసులు, గొలుసులకు తగిలించిన పెద్ద ఉయ్యాలబల్ల దానిమీద సవిలాసంగా కూర్చున్న చిట్టిరాజు చంద్రశేఖరానికి ఎదురయింది.

చంద్రశేఖరం మంచి వయసులో ఉన్నాడు. మనిషి కొంచెం పొడుగు. పొడుగుకు తగిన శరీరం. టెన్నిసు ఆడతాడేమో, భుజాలు కండలుదేరి కనిపిస్తాయి. అతని ముఖంలో ఒక అనిర్వచనీయమైన కాంతి, ఆ కాంతి అతని చూపులనుండి ప్రసరించినట్లు కనిపిస్తుంది.

అతని గొంతులో మార్దవం, మాటలలో ప్రత్యేకత అటు ఇంగ్లీషులోను, ఇటు తెలుగులోను అతను గొప్పవక్త అందుచేత అతనిని చూసినా, అతని మాటలు విన్నా ఎదుటివారికి అతనిపై గౌరవభావం కలుగుతుంది.

చిట్టిరాజు చాలా సులువుగా అవన్నీ కనిపెట్టింది. సహజంగా సంస్కారం కల మనిషి అవడంచేత, చంద్రశేఖరానికి రాజమర్యాదలు చేయడానికే ఆమె ప్రయత్నించింది.

మల్లిక చాలా అందమైనది. పాతికేళ్లకు మించని వయసు ఆమెది. ఆమె నడకలో వయ్యారం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

అల్లుడుగారికి అని చిట్టిరాజు అనగానే, చంద్రశేఖరానికి మతిపోయింది. ఒళ్లు చచ్చినట్లయింది.

"అయ్యా! మీరు కంగారు పడకండి. చిన్నవాళ్లను అల్లుడుగారని, మా వయసువారిని బావగారని పిలవడం మా ఆచారం. మీరు సిగ్గుపడకండి. రాజారంగారావు బహదూర్ వారి గురించి తెలుసుకోడానికి వచ్చిన వారిని గౌరవంగా చూడడం మా ధర్మం"




మర్యాద చాలా చక్కగా జరిగింది.

పెద్ద ఇత్తడిపళ్లెం తెచ్చి, దానిలో చంద్రశేఖరం పాదాలు కడిగింది మల్లిక. పైట చెంగుతో తడిఒత్తింది. కుడిచేతిమండకి గంధం పూసింది. దానిమీద బర్గుండ జల్లింది. అతని చొక్కాకు సెంటు రాసింది. అతిధికి పాదాభివందనం చేసింది. తాగడానికి ఏలకులపొడి, పచ్చకర్పూరం కలిపిన పాలనిచ్చింది. విసనకర్రతో విసురుతూ పక్కన నిలుచుంది.

చిట్టిరాజు తూగుటుయ్యాలనుండి దిగి, చంద్రశేఖరం కుర్చీకి దగ్గిరగా చాప వేసుకొని కూర్చుంది.

"మల్లికా! నువ్వు కూడా అమ్మగారి దగ్గిర కూర్చో! ఇక్కడ మంచి గాలి వీస్తున్నది. మీదను పంకా తిరుగుతున్నది. వెలుతురు కూడా బాగా వస్తున్నది'' అన్నాడు చంద్రశేఖరం.

"బాబుగారు! మీరు ఈ పూట మా ఇంట భోజనం చేయమని కోరుతున్నాను. మేము శాఖాహారులం. మీకు అభ్యంతరమైతే, హెూటలునుంచి భోజనం తెప్పిస్తాను'' అంది చిట్టిరాజు.

చంద్రశేఖరం నవ్వి అన్నాడు.

"నాకు అటువంటి పట్టింపులు లేవు. నాకు శాఖాహారం ఎవరు పెట్టినా కాదనను. మీరు ఆదరంగా ఏర్పాటులు చేస్తున్నారు. నేను చాలా అదృష్టవంతుడిని''

"మల్లికా! నువ్వు ఆ ప్రయత్నం చేయవలసింది. నేను వీరితో మాట్లాడాలి''

మల్లిక లోపలికి వెళ్లిపోయింది.

"బాబుగారు! మా గురించి మీకు అంతగా తెలియదనుకుంటాను''

"నిజానికి, ఏమీ తెలియదు''

"మమ్మల్ని అందరూ వేశ్యలని పిలుస్తారు. కావి, ఎంతమందికి మాలో గల భేదాలు తెలుసు?"

"ఎవరిదాకానో ఎందుకు, నాకు సహితం

తెలియవు''

"అందరూ మమ్మల్ని బోగంవాళ్లని, సానులని, పడుపుకత్తెలని పిలుస్తారు. సంస్కృతంలో వేశ్య అన్న పదానికి వారస్త్రీ, గణిక, క్షుద్ర, శూల, వారవధువు, నగరవధువు, రూపాజీవ, కామరేఖ, వారవిలాసిని మొదలైన చాలా పర్యాయపదాలున్నాయి. మామూలు వారవనితకు గణికకు భేద ముంది. గణిక సంగీత, సాహిత్య, నాట్యశాస్త్రాలలో నిష్ణాతఅయి, రాజవంశంలో ఒకరిని జీవితభాగస్వామిగా స్వీకరిస్తుంది. తనను కోరిన వ్యక్తిని కళాపూర్వకంగా రంజింపజేయడమే కాకుండా, అతనికి రాజ కార్య నిర్వహణలో సలహాదారుగా పనిచేస్తుంది. నేను గణికను''

చంద్రశేఖరం చాలా ఆశ్చర్యపోయాడు.

"మీరు నన్ను క్షమించాలి. మిమ్మల్ని నేను చాలా తక్కువగా అంచనా వేశాను''

"ఇది మీ లోపం కాదు. ప్రతివాళ్లు మమ్మల్ని గర్హించడం తప్ప, సరిగా అర్థం చేసుకోలేరు''

"అది నిజమే!"

"సమాజంలో కలిగిన మార్పులకు అనుగుణంగా మేము కూడా మారిపోయాం. నాకు సంఘంలో ఒక స్థానముంది. నా కుమార్తెకు మరో స్థానముంది. ఆమెకు సలక్షణంగా వివాహం జరిపించాను. మా అల్లుడు గారు బ్యాంకు మానేజరు. నాకు ఇద్దరు మనుమలు'

"చాలా మంచి సంగతి విన్నాను. నా మనసులోని సందేహాలకు మీరు సరియైన సమాధానం చెప్పారు. ఇక మనం అసలు ప్రసంగంలోకి వద్దాము. మీకు రాజావారు ఎలా తెలుసును?"

"తన పోషణలో నన్ను ఉంచుకున్నవారు రాజావారి బంధువులు. తరువాత, రాజావారి ఆస్థాన నర్తకిని నేను. శ్రీ వేణుగోపాలస్వామి సేవలకు నియోగింపబడిన దేవదాసిని నేను. రాజావారినుండి మడిమాన్యాలు పొందినదానిని. ఈనాటికి కూడా దేవుడికి జరిపే ఉత్సవాలలో నేను నాట్యం చేస్తాను''

"ఆవిధంగా మీరు అప్పుడప్పుడు రాజా వారి దర్శనం చేసేవారన్నమాట"

"రాజా వేంకటరంగారావు బహదూర్ వారి గురించి మీకు ఏమీ తెలియదని మీ మాటలబట్టి రూఢి అవుతున్నది''

"ఇప్పటికి కూడా వారిని సరిగా అర్థం చేసుకోలేకపోతున్నాను''

"వారు నాట్యశాస్త్రం బాగా చదువుకున్నారు. జాయపసేనాని రచించిన నృత్య రత్నావళి వారు అధ్యయనం చేశారు. రాజావారు శ్లోకం తరువాత శ్లోకం చదువుతుంటే, ఆ ప్రకారం నేను ముద్రలు ధరించేదానిని. తాండవం చేసేదానిని. నాట్యం చేసేదానిని''

"నాకివేవీ బోధపడడంలేదు''

"మీకు తేలికగా బోధపడేటట్లు కొద్దిగా చెప్తాను. నృత్తము, నృత్యము, నాట్యము అన్న మూడింటిని పర్యాయపదాలుగా సాధారణంగా వాడతారు. పాట, వాద్యాలు మొదలైన వాటితో కలిసి, లయను మాత్రమే ఆశ్రయించి అభినయించేది, లేక అంగాలను ఆడించేది నృత్తం. భావాలను ఆశ్రయించి చేసేది నృత్యం. సాత్వికభావాలతో కూడి, రసాశ్రయమై, వాక్యార్థాన్ని అభినయించేది నాట్యం"

"మీరు కూడా శాస్త్రాన్ని సంస్కృతంలో చదువుకున్నారా?"

"అదే నేను చెప్పినది. నేను గణికను తెలుగు సంస్కృత సాహిత్యాలను గురుముఖంగా నేర్చుకున్నాను. సంగీతం మా అమ్మగారే నేర్పారు. నాట్యం నాకు వెన్నతో పెట్టిన విద్య. ఇది నా చదువు సంధ్యల గురించి. సిరిపురం పట్టణంలో ఉపవనాలు, పారిశుధ్యం మొదలైన వాటిలో నాకు చాలా ప్రమేయముంది. నన్ను పోషించినవారు, నా

సలహాలమేరకు వీటిని తీర్చి, రాజావారికి చాలా పేరు తెచ్చారు. పట్టణంలో ఏవి రమ్యంగా కనిపించినా, వాటి వెనుక నా ప్రచ్ఛన్న హస్తముంది''

చంద్రశేఖరం ఒక విషయం తెలుసుకోడానికి వచ్చాడు. అంతకన్న గొప్ప విషయం మరొకటి తెలుసుకుంటున్నాడు.

"మీ పోషణకర్తలు రాజబంధువులన్నారు. వారు రాజావారి ఆస్తులకోసం ప్రయత్నించలేదా?"

"వారు చాలా ఉదాత్తమైన స్వభావం కలవారు. ఆ ఆస్తులమీద వారికి మనసులేదు''

"నాకొక్క సందేహం. పెద్దవారి కుటుంబాలలో, ముఖ్యంగా ఆడ వారి విషయంలో, ఘోషా పద్ధతి ఉంటుంది. అది మీపట్ల వర్తించలేదా?"

"నేను రాజనర్తకిని. దేవుడి ఉత్సవాలలో నృత్యం చేసినదానిని. ఇంకా మరో విశేషం- నన్ను పోషించినవారు మా ఇంటికే వచ్చేవారు. నేను మాత్రం ఘోషా పద్ధతి పాటించలేదు''

"మీరు రాజుగారి ఎదుట, శాస్త్రప్రకారం



నృత్యంకాక అభినయం చేశారని చెప్తున్నారు. దానికి మీ పోషణకర్త అభ్యంతరం తెలియజేయలేదా?"

"వారు రాజావారి దగ్గిర ఉన్నతోద్యోగం చేశారు. రాజావారికి బావగారి వరుస అవుతారు. అంతేకాక, రాజావారు రాణీగారు కూర్చొని నా నృత్యం తిలకించేవారు. రాజావారు శాస్త్ర పారంగతులు. వారు ఎలా చేయమంటే ఆవిధంగా నేను నృత్యం చేసేదానిని. అందుచేత నా పోషణకర్తకు నామీద కొంచెమైనా అనుమానం లేదు''

"రాజావారికి శాస్త్రం వచ్చునన్నారు. మరి మీకో?"

"శాస్త్రం నాకు కొట్టినపిండి. వారు సూచించడమే చాలు, మిగిలినదంతా నేను ప్రయోగపూర్వకంగా నాట్యమాడి చూపించేదానిని''

"మీరు శృంగార ఘట్టాలను అభినయించినప్పుడు, రాజావారికి మీయందు మనసు కలుగలేదా?"

"వారు శ్రీరామచంద్రమూర్తితో సమానులు. భార్యయందు బద్ధానురాగులు. వారికి మనసు చలించడమన్న ప్రసక్తేలేదు''

"మీరు ఎన్నోయేట రాజనర్తకిగా కొలువులో ప్రవేశించారు?"

"నా ఇరవయ్యోయేట"

"అంతకుపూర్వం ఎవరుండేవారు?"

"మా తల్లిగారు''

"ఇది వంశపారంపర్యంగా వచ్చే వృత్తా?"

"అలాగే చెప్పుకోవాలి''

"ఈ నాట్యంలో భేదాలున్నాయా?"

"ముఖ్యమైనవి రెండు- ఒకటి మార్గరీతి- రెండు దేశీరీతి''

"మీకు దేనిలో ప్రావీణ్యముంది?"

"రెండింటిలోనూ''

"రాజావారు ఏ పద్ధతిపై ఆసక్తి చూపేవారు?"

"దేశీరీతిమీద"

"కొంచెం వివరంగా చెప్తారా?"

"జానపద నృత్యం, పదాలు, జావళీలు ఈ దేశీరీతి ముఖ్యవిభాగాలు. రాజావారికి క్షేత్రయ్యగారి పదాలమీద, ధర్మపురి సుబ్బారావుగారి జావళీలమీద చాలా ఆసక్తి''

"రాజావారు మీ అభినయంతీరులను రాణీగారితో కలిసి తిలకించేవారు. క్షేత్రయ్యగారి పదాలుకాని, సుబ్బారావుగారి జావళీలు కాని శృంగారపరంగా చెప్పినవి. వాటిని మీరు అభినయిస్తుంటే, శృంగారభావాలు ప్రకటిస్తుంటే, రాణీగారి పక్కన కూర్చొని, చూసి ఆనందించడానికి రాజావారికి బిడియం వేయలేదా?"

"బాబుగారు! మీరో విషయం మరచిపోతున్నారు. శాస్త్రం క్షుణ్ణంగా తెలిసినవారికి ఈ భావచాంచల్యం ఉండదు. శాస్త్రం శాస్త్రమే''

చంద్రశేఖరం ఆలోచిస్తున్నాడు. ఈ రాజావారు, ఈ రాణీగారు, ఈ శాస్త్రపారంగతులు, ఈ రసికులు, ఈ కళాప్రవీణులు కాలగర్భంలో కలిసిపోతున్నారు. వినయంగా వాళ్లు తప్పుకుంటున్నారు. ఈనాటి కళ వ్యాపారసరళిలోనే సాగుతున్నది.

ఇంతలో మల్లిక వచ్చింది.

"అమ్మా! వంట అయిపోయింది. నువ్వు కూడా బావగారితో భోజనం చేస్తావా, లేక వారికొక్కరికే వడ్డించమన్నావా?" అంది మల్లిక.

"మల్లికా? నాకు భోజనానికి తొందరలేదు. తమ్ముడుగారు రానీ, వారితో కలిసి భోజనం చేస్తాను'' అన్నాడు చంద్రశేఖరం.

"అల్లుడుగారు మధ్యాహ్న భోజనానికి ఇంటికి రారు. అతనికి కారియరు పంపుతాము. మల్లికా! నాకు కూడా బాబుగారితో వడ్డించు'' అంది చిట్టిరాజు

మల్లిక హాలులోనే తల్లికి, చంద్రశేఖరానికి పీటలు వేసింది. పేకుబల్లలతో చేసిన పెద్దపీట




లవి. వెండికంచాలు పెట్టింది. కంచాల మధ్య చిన్న బంగారపు పూలుతాపి ఉన్నాయి. అవి పలువురు భుజించే దోషాన్ని పోగొడతాయి. వెండిమర చెంబులు, వెండిగ్లాసులు వెండిగిన్నెలు.

చంద్రశేఖరం ఆశ్చర్యంతో సతమతమవుతున్నాడు. ఈనాడు చాలా సంపన్నులు కూడా ఈవిధంగా వెండిసామాను ఉపయోగించడంలేదు.

"మీరు ఏమీ ఆశ్చర్యపోనక్కరలేదు. వీటినన్నిటినీ రాజావారు అప్పుడప్పుడు అనుగ్రహించినవి. నేను కళలో గొప్పదానిని కావచ్చు. కాని ఈ సంపద అంతా వారిచ్చినదే. మేము రోజూ అరిటాకులలోనే భోజనాలు చేస్తాం" అంది చిట్టిరాజు.

కంచంనిండా కూరలు, పచ్చళ్ళు, సన్నబియ్యపుటన్నం, అప్పడాలు వడియాలు, కమ్మని నేయి, గడ్డపెరుగు, పాయసం, రాజమర్యాదలే జరుపుతున్నారు.

చంద్రశేఖరం వెళ్లిన ప్రతిచోట ఇటువంటి మర్యాదలు జరగలేదు. కొందరు అతనిని చాలా తొందరగా వదిలించుకోడానికి ప్రయత్నించారు. కొందరు చాలా ఆదరించి, అతిథులను గౌరవించడం తమ ధ్యేయమని భావించారు. కాని, అతను మానావ మానాలను సమానంగానే స్వీకరించాడు. ఇదంతా దేనికి? దీనమైన పరిస్థితులలోనున్న ఒక మహిళకు సహాయం చేయడానికి.

'భోజనం ఎంత ప్రత్యేకమైనదో, అటు తరువాత చేసిన తాంబూల సేవనం కూడా అంత గొప్పదే. మెత్తటి తమలపాకులు, కొబ్బరినీటిలో కసతీసిన వక్కపొడి, ముత్యాలు కాల్చి చేసిన సున్నం, అన్నిరకాల మేలుజాతి సుగంధద్రవ్యాలు. ఈనెలు తీసికట్టిన చిలుకలు ఓహో! ఏమి అదృష్టం. అందరికీ ఇటువంటి మర్యాద లభిస్తుందా.

"బాబుగారు! మీరు కొద్దిసేపు నడుము వాలుస్తారా! గదిలో పక్కపరచే ఉంది''

చంద్రశేఖరం లజ్జించాడు. ఆ గణిక పూలపాన్పు సిద్ధం చేసింది. వింజామరలు వీచి, మధురమైన సంభాషణలు జరపడంలో ఆమెకు అనుభవమున్నది.

కాని ఈ సుఖప్రారబ్ధానికి అతను లొంగిపోలేదు.

"హేమాంగిగారు! కోర్టులో పనిచేసే నావంటివాడికి మధ్యాహ్ననిద్ర గగనకుసుమంకదా?"

చిట్టిరాజు నవ్వింది. తాంబూలపు ఎరుపు ఆమె పెదవులను కెంపులుగా తీర్చింది.

"మీకు శిష్యురాండ్రు ఎవరేనా ఉన్నారా?" అతనే మళ్లా అన్నాడు.

"లేకేం! మనుమడొక శిష్యుడు. మనమరాలొక శిష్యురాలు''

"చాలా బాగుంది. మీతోనే ఈ విద్య అంతం కాకూడదు. విద్యారహస్యాలనండి, మెలకువలనండి, గురుముఖతః నేర్చుకుంటేనే లభిస్తాయి. ఏనాటివాడు భరతముని. ఈనాటికి కూడా అతని నాట్యశాస్త్ర వైభవాలు పరంపరానుగతంగా మనకు సంక్రమించాయంటే గురుశిష్య సంబంధంవలననే''

"మరే! మా మనుమడు ఉదయశంకర్ అంత గొప్పవాడినవుతానంటాడు. మనుమరాలు మృణాళిని అంత గొప్పదాననవుతానంటుంది. విదేశాలలో ప్రదర్శనలిస్తామంటారు. మా కాలంలో ఇటువంటి ఆలోచనలే మాకు తోచలేదు''

"బాగుంది. మీరు, మీ కళను ముఖ్యంగా జావళీలను, పదాలను అభినయించడం మీ మనుమలకు నేర్పుతున్నారా?"

"వీళ్ళిద్దరూ ఇంకా చిన్నవాళ్లు. మనమడు పదేళ్లవాడు, మనుమరాలు ఎనిమిదేళ్లది. వాళ్లకి శృంగారమంటే ఏమి తెలుసు?"

"వీరు తప్ప మరెవరికీ మీరు శాస్త్రం నేర్పలేదా?"

చిట్టిరాజు వెంటనే సమాధానమియ్యలేదు.

ఆమె ఆవులించింది. చిటికెలు వేసింది.

"మధ్యాహ్నపు పూట మీరు నిద్దరపోతారు కాబోలు. మిమ్మల్ని చాలా ఇబ్బంది పెడుతున్నాను''

ఇంతవరకూ చాపమీద కూర్చున్న ఆమె వాలుకుర్చీ తెచ్చి చంద్రశేఖరం కుర్చీకి పక్కన వేసుకొని కూర్చుంది.

"మనం ఎంతవరకు వచ్చాం?" చిట్టిరాజు అడిగింది.

"మీరు మరెవరికేనా మీ విద్య నేర్పేరా అని''

ఆమె ఈసారి కూడా వెంటనే సమాధానమియ్యలేదు.

"మీకు ఇబ్బందిగా ఉంటే, ప్రస్తుతానికి ఆ విషయాన్ని విడిచిపెడదాం" ఆమె నవ్వింది.

"మీరు ఇంత దూరం ఏదో ప్రత్యేకమైన విషయాన్ని కనుక్కోడానికి నా దగ్గరికి వచ్చారు. నాకు ఏం చేయడానికి తోచకుండా ఉంది. ఈ విషయం ఎవరికీ చెప్పకూడదని రాజావారి ఆజ్ఞ''

ఇప్పుడు వారు లేరు. మీరు చెప్పే రహస్యం లోకోపకారానికని నేను చెప్తున్నాను. దానిని దాచిపెడితే నాకు మరొక దీనురాలికి సహాయం చేసే అవకాశాలు సన్నగిల్లుతాయి''

"నేనీ రహస్యాన్ని దాచిపెడితే ఏమీ ప్రయోజనముండదని, ఏదోరోజు అది బయట పడితే ఎవరమూ ఏమీ చెయ్యలేమని మీ అభిప్రాయమా?"

"అలా అని కాదు. దాసీజనం ఉన్నారు. వాళ్లకు డబ్బిచ్చి సంగతి తెలుసుకోవచ్చు. కాని వాళ్లు లేనిపోనివి చాలా చేర్చి సత్యాన్ని కప్పిపుచ్చుతారు. అటువంటివి కొన్ని నా చెవినీ పడ్డాయి. అందుకే చివరి ప్రయత్నంగా మీ దగ్గరికి వచ్చాను''

"మీరు చాలా నేర్పుగలవాళ్లు. నేను సూచనగా కొద్ది సంగతులు మాత్రమే మీకు చెప్తాను. మిగిలినవి మీరు సులువుగా ఊహించుకోవచ్చు''

"మీకొక వాగ్దానం చేస్తున్నాను. నేను విన్న సమాచారాన్ని అనవసరంగా అందరికీ వెల్లడించను. ఒకవేళ చెప్పవలసివచ్చినా జాగ్రత్తగా కొద్ది సంగతులు మాత్రం చెప్తాను. నామీద మీరు విశ్వాసముంచవచ్చు''

"అయితే వినండి. ఈ దేశీరీతి..."

"అంటే, వారికి మీరు మార్గరీతి నేర్పలేదా?"

"మార్గరీతిలో వారు నన్ను మించిపోయారు. దేశీరీతిలో రెండు రెట్లుగా ఘించారు''

"ఎన్ని సంవత్సరాలు వారికి నేర్పారు?"

"పన్నెండు సంవత్సరాలు శాస్త్రం నేర్పాను, రెండు సంవత్సరాలు చెప్పిన విద్యను పునః పరీక్ష చేశాను''

"వారు తను నేర్చుకున్న విద్యను మీవలె ఎవరికేనా ప్రదర్శించారా?"

"పైవాళ్లకెవరికీ ప్రదర్శన లివ్వలేదు''

"పైవాళ్ల సంగతి నేనడగలేదు. రాజావారికి వారు తమ నేర్పును చూపించారా?"

"ఆ సంగతి నాకు తెలియదు. రాణీగారు బతికి ఉన్నంతకాలం నేను కోటకు వెళ్లేదానిని. వారికి విద్య నేర్పేదానిని. రాణీగారు మరణించిన తరువాత, రాజావారు నాకు సెలవిచ్చారు''

"అంటే, మీరు మరొకరికి నాట్యం నేర్పడానికి కూడా కోటకు పోలేదా?"

"రాజుగారు సెలవివ్వడం, నేను నేర్పవలసినవారికి విద్య ముగిసిపోవడం ఒకసారే జరిగాయి. నేను విద్య నేర్పినవారు నాకంటే అద్భుతంగా నాట్యం చేయగలరు. వారికి చెప్పడానికి దగ్గిర మరి విద్య మిగులలేదు. అందుచేత వెళ్లలేదు''




"రాజుగారు పోయిన తరువాత కూడా వారి దగ్గిరికి మీరు వెళ్లలేదా?"

"ఏదో శాపం పెట్టినట్లు, నా ముఖం కూడా వారికి చూపించలేదు''

చంద్రశేఖరం క్షణం ఆలోచించాడు. మెల్లిగా అన్నాడు.

"మీరు మరేమీ అనుకోకండి. నాట్యం చేసేవారి రూపురేఖావిలాసాల గురించి కొంచెం చెప్పగలరా?"

"నావంటి స్త్రీలను కూడా వారు సమ్మోహితులను చేసేవారు.

"వారంత చక్కనివారా?"

"ఈ సంగతి మీరడగకూడదు. రాజావారి మీద గౌరవంతో మేము చెప్పకూడదు''

చంద్రశేఖరం ఆలోచించి అన్నాడు.

"మీవంటి శాస్త్రజ్ఞులను కూడా మోహంలో ముంచే, వారి అభినయం చాలా గొప్పదని చెప్పకతప్పదు''

"మీరు వేలు చూపితే, మండ మింగగలరు''

చంద్రశేఖరం నవ్వి అన్నాడు.

"అదికాదు. అంత గొప్పవారి గురించి ఎంత తెలుసుకున్నా తెలుసుకోవాలనే ఉంటుంది''

"అయితే వినండి. వారి గురించి నా అభిప్రాయాన్ని సూక్ష్మంగా చెప్తున్నాను. వారివలె జావళీలు, పదాలు అభినయించగలవారు నభూతోనభవిష్యతి''

చంద్రశేఖరం కుర్చీలోంచి లేచాడు. హేమాంగి దగ్గిర సెలవు తీసుకున్నాడు. మల్లికతో కూడా వెళ్తున్నట్లు చెప్పాడు.

ఇంతలో చిట్టిరాజు మనుమలిద్దరూ స్కూలునుంచి వచ్చారు. ఇద్దరూ చాలా అందంగా ఉన్నారు. వారి ముఖాలలో తెలివితేటలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. చంద్రశేఖరం, వారిద్దరి చేతుల్లోను, చెరో నూరు రూపాయల నోటు పెట్టి వెళ్లిపోయాడు.

★ ★ ★

చంద్రశేఖరం ఆరు నెలల్లో, ఒక్క ఆదివారం కూడా విడిచిపెట్టకుండా రామభద్రరాజు చెప్పిన వ్యక్తులందరిని కలిసి మాట్లాడాడు. కాని ఒక్కరిని మాత్రం కలియడానికి అవలేదు. చిట్టిరాజును కలిసిన తరువాత వారిని కలియదలచాడు. వారు వైణికసార్వభౌములు, గోపాలశర్మగారు. వారిని కలియడానికి మరుసటి ఆదివారం సిరిపురం వెళ్లాడు. కాని, వారు అంతకు రెండురోజులకిందే పరమపదించారు. చిట్టిరాజును చూడకుండా కిందటి వారం వారిని కలిస్తే ఎలా ఉండేదో?

ఆరు నెలల బట్టి శర్మగారు మంచం పట్టారు. చివరిరోజులలో వారికి చెరుపు మరుపు మాటలు సంధిపుట్టాయి. మనుష్యులనెవరినీ వారు గుర్తుపట్టలేకపోయారు. చిట్టిరాజును చూడకుండా వారిని కలిసినా, ఫలితం ఉండేదికాదు.

గోపాలశర్మగారి కుమారులు ముకుందశర్మగారు. వారు కూడా మహావిద్వాంసులే. చంద్రశేఖరం, మరో మూడువారాల తరువాత అతనిని కలిశాడు. అతను చనిపోయిన తన తండ్రి గొప్పదనం గురించి చాలా హెచ్చుగా చెప్పాడు. తండ్రిగారు జావళీలను ఎంత హాయిగా వాయించేవారో, అంత సౌలభ్యంతోను వేదం వాయించేవారని అతను చెప్పాడు. రాజావారికి కాని, వారి బంధువులకుగాని శర్మగారు, కోటలో వీణ నేర్పారా అని అడిగితే, తనకా సంగతి తెలియదని అతను చెప్పాడు.

చంద్రశేఖరం తెలుసుకోవలసిన చాలా ముఖ్య భాగమైన సంగీతం గురించి ఏమీ తెలియరాకుండా పోయింది. కాని గోపాలశర్మగారి అత్యద్భుతమైన వీణావాదన గురించి తెలుసుకున్న తరువాత, వాటిని వారి శిష్యులకు అన్వయించుకోడం సమంజసంగా అతనికి తోచింది. ఒకవేళ శర్మగారు జీవించి ఉంటే, వారు కూడా తమ శిష్యులకు

చెప్పడానికి తన దగ్గిర విద్య మిగులలేదని, తనను వారు మించిపోయారని చెప్పి ఉండే వారు.

చంద్రశేఖరం, తను డైరీలలో అప్పుడప్పుడు రాసుకున్న విశేషాలను ఒక క్రమంలోపెట్టి రాయడానికి ఒక నెలపట్టింది. ఆ నెలరోజులు అతను చాలా శ్రమపడ్డాడు. కోర్టులో ఈ కేసు గురించి వాదించినప్పుడు అది కేవలం సంగతులను గుచ్చినది కాకుండా, శ్రోతలు మరచిపోరానిదిగా ఉండాలని అతను అభిప్రాయపడ్డాడు. అందుచేత ఏవిధంగా మొదలు పెట్టడమో, ఏవిధంగా ఆసక్తి తగ్గకుండా ముందుకు పోవడమో, ఎంత అద్భుతంగా ముగించడమో అతను ఆలోచించసాగాడు.

రామభద్రరాజు అక్కయ్యగారి గురించి తెలుసుకోడానికి చేసిన ప్రయత్నంలో రాజా వేంకటరంగారావు బహద్దూరు వారిచరిత్రే లభించింది.

ఒక పరిస్థితిలో అతను ముందుకు వెళ్లలేకుండా ఉండిపోయాడు.

రాత్రుళ్లు! నిద్ర పట్టలేదు, కళ్లు ఎర్రబారాయి. అన్నిటిమీద విసుగు వచ్చింది. ఇది తన అసమర్థతగా అతనికనిపించింది.

అతను ఏదో పుస్తకం గురించి వెతుకుతుంటే, అనుకోకుండా అతనికి సంస్కృత ధాతువులమీద ఒక మహానుభావుడు రచించిన దీపిక కళ్లబడింది.

ఈ దీపిక వెనుక చాలా గొప్పకథ ఉంది.

చంద్రశేఖరం మద్రాసులో ఉన్న ఆఖరి రోజులలో ఒకసారి హైదరాబాదు వెళ్లి అడ్వకేటు సోమసుందరంగారిని కలియవలసి వచ్చింది.

సోమసుందరంగారు క్రిమినల్ లాలో నిష్ణాతులు. ఆయనకు సరియైనవాళ్లు దక్షిణాదిని లేరని చెప్పుకోవచ్చు.

ఆరోజు ఆదివారం ఉదయమే చంద్రశేఖరం వారి గృహానికి వెళ్లి వారిని కలిశాడు. నెలకు లక్షలు ఆర్జించే ఆ మహానుభావుడు చాలా సాదాసీదాగా కనిపించాడు. అతనికి ఏభై అయిదు సంవత్సరాలుంటాయి. వారి యిల్లు చాలా పెద్దది. చాలా ఆధునికమైన పద్ధతిలో కట్టించినది. చంద్రశేఖరమంటే ఆయనకి చాలా అభిమానం.

ఉదయం అంతా అతనితో చంద్రశేఖరం తను తెచ్చిన కేసు గురించి చర్చించాడు. వారితోనే మధ్యాహ్నం భోజనం చేశాడు. భోజనమయిన తరువాత సోమసుందరంగారు చంద్రశేఖరాన్ని తాను విశ్రాంతి తీసుకునే ఆశ్రమానికి తీసుకుపోయారు.

ఇంటి వెనుక భాగంలో, మామిడిచెట్లనీడల్లో అడ్వకేటుగారి ఆశ్రమముంది. చాలా నిరాడంబరంగా ఉంది. అందులో బల్లమంచం ఒకటి ఉంది, మరో రెండు కుర్చీలున్నాయి. టేబిలు, దానిమీద రాతకు అవసరమయే కాగితాలు, కలాలు మొదలైనవున్నాయి. ఒక అద్దాల బీరువాలో పుస్తకాలున్నాయి.

సోమసుందరంగారు న్యాయశాస్త్రంలో ఎంత పారంగతులో, వ్యాకరణ శాస్త్రంలో కూడా అంత నిష్ణాతులే. పాణినీయం, సిద్ధాంతకౌముది వారికి జిహ్వాగ్రాన ఉంటాయి.

అతను చంద్రశేఖరాన్ని తన పక్కన కూర్చోబెట్టుకున్నారు.

"చంద్రశేఖరం! నువ్వు సంస్కృతం చదువుకున్నావు కదూ?" అతను ప్రశ్నించారు.

"ఏదో కొంచెం కొంచెం" అన్నాడు చిరునవ్వుతో చంద్రశేఖరం.

"సిగ్గుపడడం దేనికోయ్! చెప్పు, చెప్పు!"

"ఇంటర్మీడియేటు పరీక్షలలో నాకు సంస్కృతంలో చాలా మంచి మార్కులు వచ్చాయి. నేను విజయనగరం మహారాజా వారి కళాశాలలో బియ్యే చదువుకున్నాను. మాకు సంస్కృత పండితులుగా విశ్వనాథ





కవి రాజుగారు వచ్చేవారు''

"అతని పేరు విన్నాను. సాహిత్య దర్పణ మన్న అలంకారశాస్త్రాన్ని సంస్కృతంలో రచించిన వాడు విశ్వనాథ కవిరాజు. అందు చేత పరిచయమైన పేరుగా వినిపించింది''

"ఆ విశ్వనాథ కవిరాజు ఏ ప్రాంతం వాడోకాని, ఈయన మాత్రం నూటికి నూరు పాళ్లు తెలుగువారు. సురభి నాట్యమండలివారికి నాటకాలు రాశారు. మనిషి బలంగా ఉండేవారు. మధ్య పాపిడి, గిరజాల జుత్తు, గుండ్రటి ముఖం, ఖద్దరు పంచకట్టుకునేవారు, ఖద్దరు లాల్చీ, దానిపైన చక్కటి అంచులుగల ఖద్దరు కండువా అతనిని చూడగానే నటుడని అందరూ అనుకుంటారు''

"చాలా గొప్ప సంగతి''

"అతను ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతాలలో పండితులు- హాస్య సంభాషణా చతురులు. ఎన్నో హాస్య నాటికలు రాశారు. వారు మాకు సంస్కృతం చెప్పడం పూర్వజన్మ సుకృతమే''

"నిజమే''

"ఆయన మాకు విశాఖదత్తుడి ముద్రారాక్షస నాటకాన్ని పాఠం చెప్పారు. ఎంత మనసుకు హత్తుకునేటట్లు చెప్పారంటే, నాకు బియ్యే సంస్కృతం పరీక్షలో బంగారు పతకం లభించింది''

"మరెప్పుడూ చెప్పలేదేం?"

"దీని గురించి చెప్పుకోడానికేముంది? మరి మీ సంగతి చెప్పండి''

"నేను మద్రాసు విశ్వవిద్యాలయంలో సంస్కృతంలో ఎమ్మే పాసయ్యాను. యూనివర్సిటీకి మొదటివాడుగా వచ్చాను, వ్యాకరణంలో నాకు బంగారు పతకం లభించింది''

"మీకు నా వందనాలు''

"విను మరి. నాకు వ్యాకరణ శాస్త్రం మీద మోజు తగ్గలేదు, వ్యాకరణంలో ధాతు ప్రకరణం, ముఖ్యంగా సంస్కృతంలో చాలా కఠినమైనది. దీనిని విద్యార్థులు సులువుగా నేర్చుకోడానికి ధాతుదీపిక అన్న పుస్తకం రాశాను''

"సంస్కృత క్రియల గురించా?"

"అవును... దానిని రాయడానికి నాకు రెండు సంవత్సరాల ఆరు మాసాలు పట్టింది''

"అంతకాలమా?"

"రెండు సంవత్సరాలు సంస్కృత వ్యాకరణాలన్నింటిలోను ధాతువుల గురించి రాసినది చదివాను. నోట్సు తీసుకున్నాను. సంపూర్ణంగా విషయాన్ని తెలుసుకున్నాను. తరువాత దేశం నాలుగు చెరగులనుంచి, అంటే పూనానుంచి, వారణాసినుంచి, కేరళనుంచి, ఆంధ్రదేశం నుంచి వ్యాకరణంలో మహాపండితులైన వారిని తెప్పించాను. వారితో రెండు నెలలు చర్చించాను. నాకు కలిగిన సందేహాలనన్నీ తొలగించుకున్నాను. అప్పుడేం చేశానో తెలుసా?"

"చెప్పండి''

"పుస్తకాలు, నోట్సు అన్నీ కట్టకట్టి ఒక మూల పడేశాను''

"నిజమేనా?"

'నూరుపాళ్లు నిజమే, నా తలలో ఆలోచించే శక్తిపోయింది. అందుకు ఈ పని చేశాను. ఒక నెల్లాళ్లవరకు దాని గురించే మరచిపోయాను. తరువాత మూడు నెలలలో పుస్తకం పూర్తిచేశాను''

చంద్రశేఖరం నోట మాట లేకుండా వింటున్నాడు.

అతను బీరువాలోంచి చక్కగా బైండు చేసిన ధాతుదీపిక కాపీతీసి, చిరంజీవి చంద్రశేఖరానికి ఆశీస్సులతో అని రాసి, సంతకం పెట్టి యిచ్చారు.

ఆ వేయి పేజీల పుస్తకం, పెద్ద సైజుది, ఇప్పుడు కళ్లబడింది.

•

చంద్రశేఖరం రామభద్రరాజు తెచ్చిన కేసుని, పూర్తిగా కట్టకట్టి బీరువాలో పడేశాడు.



"యువరానర్!

"ఆమె పేరు అమృతవల్లి.

"ఆమె సిరిపురంరాజా వేంకటరంగారావు బహదూర్ వారి పోషణలో ముప్పై సంవత్సరాలయి ఉంటున్నారు. రాజావారు పరమపదించేవరకు అమృతవల్లికి అంతఃపుర మర్యాదలతో జీవితం గడిచింది. ఇంటి నిండా దాసీజనం, ఇల్లు నడిపించడానికి కావలసిన సరుకులు, ఆమె కట్టుకోడానికి విలువైన బట్టలు ఈవిధంగా సర్వ రాజోపచారాలు జరిగాయి.

"రాజావారు దివంగతులైన అయిదు సంవత్సరాలలో అమృతవల్లికి జరిగే మర్యాదలు చాలావరకు తగ్గిపోయాయి. దివాన్‌జీగారికి రాజావారు చేసిన అప్పులు తీర్చడంతో సరిపోయింది. దివాణానికి రాబడి తగ్గిపోయింది. అందుచేత అమృతవల్లికి అందించే సహాయం నాలుగో వంతుకు దిగిపోయింది.

రాజావారు పోయిన అయిదు సంవత్సరాలకు దివాన్‌జీగారు మరణించారు. అంతటితో రాజావారినుండి, వారి దివాన్‌జీగారి నుండి అందుతున్న ఆర్థిక సహాయం పూర్తిగా ఆగిపోయింది. పరిస్థితులు మారుతుంటే వాటికి అనుగుణంగా అమృతవల్లి తమ ఖర్చులు తగ్గించుకున్నారు. తమకు రాజావారు అప్పుడప్పుడు బహూకరించిన జవహరీ తాకట్టుపెట్టారు. పనివాళ్లను తగ్గించుకున్నారు. చివరకు రోజుకు ఒకపూట తింటూ, రెండు చీరలతో ప్రస్తుతం కాలంగడుపుతున్నారు. ఆనాటి భోగభాగ్యాలకు ఈనాటి లేమికి ఆమె చలించలేదు.

అమృతవల్లి చాలా పౌరుషంగలవారు. వారి తమ్ముడు శ్రీ రామభద్రరాజుగారు వారిని స్వగృహానికి తీసుకుపోతామన్నారు. కానీ దానికి ఆమె అంగీకరించలేదు. అతను అంతటితో ఊరుకోక ఆమెకు కావలసిన ధనాన్ని యిస్తామన్నారు. పరిస్థితులు దినదినానికి క్షీణించడంచేత, ఆమె తమ్ముడుగారిచ్చే ధనాన్ని ఋణంగా స్వీకరించడానికి అంగీకరించారు.

ఇదీ పరిస్థితి.

రాజావారి ఆస్తులను ప్రభుత్వం విక్రయించింది.

దానినుండి కొంత నెలవారీగా తమ పోషణకు యివ్వడంకాని, లేక ఒకసారే ఆ తొంభై లక్షల ధనంనుండి, పదవవంతు తమ జీవికను గడపడం గురించి యివ్వడం కాని చేయవలసిందని ప్రభుత్వంపై ఆమె దావా వేశారు.

"నేను చంద్రశేఖరాన్ని, అమృతవల్లిగారి తరఫున వకాల్తా పుచ్చుకున్నాను. ఈ కేసు రెండు నెలలబట్టి విచారణ జరుగుతున్నది."

పబ్లిక్ ప్రాసిక్యూటరు తమ ఆక్షేపణలను ఈవిధంగా కోర్టు వారి ముందు ఉంచారు.

"1. అమృతవల్లిగారు రాజావారి బంధువులు కారు. కాబట్టి, వారసత్వం కింద ప్రభుత్వం, ఆమెకు ఏమీ యివ్వనక్కరలేదు.

2. రాజావారు అమృతవల్లిగారిని వివాహమాడలేదు.

3. అమృతవల్లిని కనీసం తమ ఉంపుడు

కత్తిగానైనా ఈ పదం అమృతవల్లిగారి పట్ల వాడడం సరియైనదికాదు- గుర్తించి తమ పోషణలోకి తీసుకోలేదు.

4. రాజావారు తమకింద పనిచేసేవారికి, వాళ్లు చేసిన సేవలకు గుర్తింపుగా నెలనెల జీతాలిచ్చారు. అమృతవల్లిని వారు తమ పరివారం కింద పరిగణించారే అనుకోండి. నెలనెల ఆమె పోషణ కోసం రాజావారు పదివేల రూపాయలు చెల్లించి తమ బాధ్యతను నెరవేర్చుకున్నారు. పదిహేను సంవత్సరాలు ఈవిధంగా రాజావారు ఆమెకు ధన సహాయం చేసి పోషించారు. దీవాన్‌జీగారు తదనంతరం, మరో అయిదు సంవత్సరాలు, నెలకు రెండువేల అయిదువందల చొప్పున ధన సహాయం చేస్తూ వచ్చారు. ఈవిధంగా రాజావారికి అమృతవల్లిగారు అందించిన సేవలకు (అవి ఎటువంటివో ఎవరికీ తెలియవు) చాలా ధనం దివాణం నిధుల నుండి వెచ్చించడమయింది.

5. రాజావారి కింద చాలాకాలం పనిచేసి రిటైరయిన వారికి ఫించనులిస్తున్నారు. వాటికోసం రాజావారు నిధులను సమకూర్చారు. కాని, అటువంటి పనివాళ్ల పేర్లలో అమృతవల్లిగారి పేరులేదు.

6. రాజావారికి అమృతవల్లిగారి మీద అంత దయ ఉన్నప్పుడు వారు కొన్ని భూములను కాని, తోటలనుకాని ఆమెకు బహుమతిగా యిచ్చినట్లు లిఖితపూర్వకంగా తెలియజేసి ఉండవలసింది. అటువంటి ఏర్పాట్లు కూడా రాజావారు చెయ్యలేదు.

7. రాజావారు అమృతవల్లికి దగ్గిర స్నేహితులని అంటున్నారు. రాజా వేంకట రంగారావుగారు తమ సన్నిహితులందరికీ ఉపాధులు కల్పించారు. వీరి విషయంలో అటువంటి ప్రయత్నమేమీ జరగలేదు.

8. రాజావారు వీలునామా ఏదీ రాయలేదు.

9. కోటలో సరస్వతీ మందిరానికి పడమటి భాగంలో ఒక ఎకరం స్థలంలో, అన్ని ఆధునికమైన సౌకర్యాలతోను కట్టించిన బంగళాను రాజావారు అమృతవల్లిగారికి వసతిగా కల్పించారు. రాజావారు మరణించిన తరువాత ఆస్తులు ప్రభుత్వపరమైనప్పుడు ఆ యింటిని మాత్రం ఆమె ఖాళీ చేయలేదు. ఎవరూ వారిని తొలగించడానికి సాహసించలేదు. రాజావారి కోట మునిసిపాలిటీ వారి అధీనంలోకి వచ్చి పధ్నాలుగు సంవత్సరాలయింది. అమృతవల్లి ఉంటున్న బంగళాకి యింటి పన్ను మాత్రం కట్టడం జరిగింది. ఆ సొమ్ము దివాణంవారి తరఫున దివాన్‌జీగారు చెల్లించలేదు. ఆ బంగళా చిన్నరాణీ వారిదిగా పన్ను ముట్టిన రసీదులలో పేర్కొనడం జరిగింది. అమృతవల్లి రాజావారిని వివాహమాడలేదు. కాని కోటలో రాజమర్యాదలతో బతుకుతున్న అమృతవల్లి గారిని, చిన్న రాణీగారని పనివాళ్లు పిలవడంలో ఆశ్చర్యంలేదు. అంతమాత్రాన ఆమెకు ఆ టైటిలు సిద్ధించదు.

10. బంగళాను ఖాళీ చేయించి, ప్రభుత్వం వారు ఎందుకు వేలం వేయలేదని ప్రశ్న వస్తుంది. పన్నెండు సంవత్సరాలకు పైగా ఆమె బంగళాలో ఉంటూ, చిన్న రాణీగారి పేర పరిజనులు పన్నులు చెల్లిస్తూ ఉండడంచేత, ఆమెకు ఆ నివాసం మీద హక్కు సంక్రమించిందని ప్రభుత్వం వారు భావించి, ఆ విషయం నిర్ధారణ అయేవరకు ఏ చర్య తీసుకోలేదు. ఈ కారణంగా, అమృతవల్లి గారికి రాజావారి ఆస్తులను అమ్మగా వచ్చిన ధనంలో వాటా ఉందని అనడానికి ఆధారంలేదు.

"ఈ ముఖ్యమైన పాయింట్లను గుర్తుంచుకొని, న్యాయమూర్తి సరియైన విచారణ జరిపి, ప్రభుత్వ ఆస్తులకు నష్టం వాటిల్లకుండా చూడగలరని విశ్వసిస్తున్నాను''

అలా పబ్లిక్ ప్రాసిక్యూటరు తమ అభిప్రాయాన్ని సహేతుకంగా కోర్టు వారి ముందు



ఉంచారు. చంద్రశేఖరం తన వాదన మొదలుపెట్టాడు.

"పైన ఉదహరించిన పది పాయింట్లను నేను గౌరవిస్తున్నాను. పబ్లిక్ ప్రాసిక్యూటరు గారి అభిప్రాయాన్ని సమర్థిస్తున్నాను- నేను కాని, పబ్లిక్ ప్రాసిక్యూటరుగా ఉంటే, ఇదేవిధమైన వాదనను న్యాయమూర్తుల ముందు ఉంచేవాడిని.

కాని, ప్రభుత్వ పక్షపు లాయరుగారు పూర్వాపరాలు విచారించకుండా, ఈ నిర్ణయం కోర్టువారికి సమర్పించారు.

ఇక నేను వాది పక్షంగా కోర్టులో వివరాలు సమర్పిస్తున్నాను. వివరాలు అన్నీ విన్న తరువాత, సాక్షులను పరీక్షించిన తరువాత, మీరు తీర్పు వినిపించవచ్చు.

యువరానర్!

అమృతవల్లి గారి గురించి మరికొన్ని వివరాలు కోర్టువారి ముందు ఉంచుతున్నాను.

అమృతవల్లిగారు నలభై ఆరు సంవత్సరాల కింద సిరిపురం పట్టణంలో తమ మాతామహుల యింట జన్మించారు. నారాయణరాజుగారికి, లక్ష్మీదేవిగారికి ఆమె తొలి బిడ్డ. ఆమెకు ఒక చెల్లెలు, ఒక తమ్ముడు. అమృతవల్లి తమ పన్నెండవ ఏడు వరకు సిరిపురం హైస్కూలులో చదువుకున్నారు. తరువాత ఆమెను స్కూలుకు పంపలేదు. ఇంటిలో పనిపాటలు చేస్తూ తల్లిగారికి ఆమె సహాయంగా ఉండేవారు. ఆమెకు, చెల్లెలికి రెండేళ్లు తేడా, తమ్ముడు రామభద్రరాజు ఆమెకంటే ఆరేళ్లు చిన్న. పక్క ఊరిలోనే తాతగారు ఉండడంచేత, వారి యింట్లో చిన్న పిల్లలు లేకపోడంచేత, రామభద్రరాజు వారి యింట ఉండి చదువుకున్నారు.

అమృతవల్లి బాల్యంలో చెప్పుకోదగిన సంఘటనలు ఏవీ జరగలేదు. ఆమె తను చదివిన పుస్తకాలనుండి చక్కని కథలు తమ్ముడికి, చెల్లెలికి చెప్పేవారు. చదువుకున్నప్పుడు పరీక్షలలో ఆమెకు మంచి మార్కులే వచ్చాయి. పరీక్ష పత్రాలలో ఆమె రాసిన జవాబులు చాలా బాగా ఉండడం చేత, ఉపాధ్యాయులు వాటిని మిగిలిన పిల్లలకు చదివి వినిపించేవారు.

ఆమెకు పదహారవ యేడు రాగానే తల్లిదండ్రులు సంబంధాలు వెదకడం మొదలు పెట్టారు. అట్టే శ్రమ పడకుండా ఒక మంచి సంబంధం కుదిరింది. వరుడి పేరు వెంకట్రాయుడు. అతను మద్రాసు గిండీ కాలేజిలో బియీ పరీక్ష పాసయి, చెంగల్పట్టులో అసిస్టెంటు యింజనీరుగా ఉద్యోగం చేస్తూ ఉండేవారు. వరుడితల్లి, చెల్లెలు విజయనగరం నుండి వచ్చి అమృతవల్లిని చూసుకున్నారు. చాలా నచ్చుకున్నారు. పిల్ల వినయ విధేయతలను మెచ్చుకున్నారు. ఆమె చక్కదనానికి భ్రమసిపోయారు. తల్లిగారు పెళ్లికూతురు గుణగణాల గురించి కొడుక్కి రాశారు. చెల్లెలు, కాబోయే వదినగారి సౌందర్యాన్ని వర్ణిస్తూ పేజీలు నింపింది. వెంకటరాయుడుగారు తనకా సంబంధం నచ్చిందని, తొందరలోనే ముహూర్తాలు పెట్టించమంటూ ఉత్తరం రాశారు.

ఒక దగ్గిర బంధువుల అమ్మాయికి అమృతవల్లి యింటనే వివాహం జరపటం తటస్థించింది. అందుకు వారు సంతోషించారు. ఆ అనుభవంతో, తమ పెద్దమ్మాయి వివాహం అంతకంటే ఘనంగా జరిపించాలని వారు సకల ప్రయత్నాలు చేశారు.

సిరిపురంలో నారాయణరాజుగారి బంధువులు చాలామంది ఉన్నారు. వియ్యమందవలసిన వారు కూడా చాలా సంపన్నులు, వారికి కూడా చాలా మంది బంధువులున్నారు. వారి ఆచార ప్రకారం పెళ్లికొడుకుతో రావలసిన వారు అయిదు వందలమంది ఉంటారని, వారికి అన్నివిధాల సౌకర్యాలు కల్పించి, గౌరవంగా పెళ్లి చేయాలని తెలియజేశారు.




నారాయణరాజుగారు మంచి ఆస్తిపరులు. భూములు, తోటలు కాక మాంగనీసు గనులు కూడా ఉన్నాయి. వాటినుండి మంచి ఆదాయమే వచ్చేది.

పెళ్లివారికి కావలసిన బట్టలు నాలుగు గ్రామాలలో నేయించారు. పది గ్రామాల నుండి నేయి డబ్బాలు వచ్చాయి. పంచదార బస్తాలు, బెల్లపు కుండలు, వంట చెరకు ముందుగానే వచ్చాయి.

నారాయణరాజుగారి యిల్లు రాజవీధిలో మధ్యనుంది. పక్కనున్న బంధువుల యింటిలో సరుకులు నిలువ చేశారు. ఆబాల గోపాలం నారాయణరాజుగారి యింటి పెళ్లికి చాలా ఉత్సాహంతో ఎదురు చూసింది.

అయిదు రోజుల పెళ్లి అందుచేత అతిథులకు విందు భోజనాలే కాక, హరికథలు, నాటకాలు, కోడి పందాలు, గుర్రపు పందాలు మొదలైనవాటికి అన్ని ప్రయత్నాలు జరిగాయి''

...ఇంతవరకు చంద్రశేఖరం చెప్పాడు.

కోర్టు కిటకిటలాడుతున్నది.

పబ్లిక్ ప్రాసిక్యూటరు చాలా చికాకు పడ్డాడు. లేచి తన అభ్యంతరం తెలియజేశాడు.

"యువరానర్! వాది తరపు లాయరుగారు కోర్టు వారిని తప్పుతోవ పట్టిస్తున్నారు. కేసుకి వీరు చెప్తున్న విచారణకు ఏమాత్రం సంబంధలేదు''

"యువరానర్! పబ్లిక్ ప్రాసిక్యూటరుగారు చాలా తెలివైన వారు. వారికి నేను చెప్తున్న వివరాలు నచ్చడంలేదు. కాని నేను చెప్పిన ప్రతి విషయం కేసుకి సంబంధించినదే! అభ్యంతరం చెప్పవలసిన వేవీ నేను పేర్కొనడంలేదు. మూల భూతమైన సంగతి చెప్పనిదే ముఖ్య విషయాలు రాణించవు. వాదన ఈ ధోరణిలోనే సాగించడానికి అనుమతి వేడుకుంటున్నాను'' అన్నాడు చంద్రశేఖరం.

జడ్జీగారు కొంచెంసేపు ఆలోచించి అన్నారు...

"ముందు చెప్పబోయే వివరాలకి, యిప్పుడు చెప్పినవాటికి దగ్గిర సంబంధముందని మీకనిపిస్తే తప్పకుండా చెప్పండి. వివరాలను వినడం వలన కేసును బాగా అర్థం చేసుకోడానికి వీలవుతుంది''

ఇంతలో మధ్యాహ్న విరామ సమయం ఆసన్నమయింది. గంట వినడంతోనే ప్రేక్షకులు, కోర్టువారు, సాక్షులు, అందరూ బయటికి వెళ్ళిపోయారు.

జనవరి నెలలో చంద్రశేఖరం అమృతవల్లిగారి కేసును స్వీకరించాడు. అది అక్టోబరు నెలలో విచారణకు వచ్చింది. పబ్లిక్ ప్రాసిక్యూటరు ఆర్గ్యుమెంట్లు మూడు వారాలు తీసుకున్నాయి. ఒక వారం ఏ విచారణ జరగలేదు. నవంబరు మూడో తారీకునుండీ మళ్ళీ విచారణ మొదలయింది.

విశాఖపట్నానికి తొమ్మిది నెలలు ఎండాకాలం, ఒక నెల చలికాలం, ఒక నెల వర్షాకాలం, మిగిలిన రుతువులన్నీ మరో నెల.

ఈశాన్య రుతుపవనాలు నాలుగు రోజులై యిబ్బంది పెడుతున్నాయి. ఇవాళ ఉదయం కొంచెం తెరిపిచ్చినా, కోర్టు విరామ సమయానికి వర్షం హెచ్చింది. గాలులు బలంగా వీవసాగాయి. పైకి వెళ్ళిన వారందరూ తడిసిపోయారు. విచారణ మరునాటికి వాయిదా వేస్తారని అందరూ అనుకున్నారు. కాని, జడ్జీగారు మాత్రం చంద్రశేఖరం చేప్పేది శ్రద్ధగా వినదలచుకున్నారు.

అందరూ సకాలంలో లోపలికి వచ్చారు.

చంద్రశేఖరం చెప్పడం మొదలుపెట్టాడు.

"యువరానర్!"

"వివాహ ముహూర్తం సమీపిస్తున్నది. వివాహం అయిన తరువాత, భర్తతో కలిసి వధువు దూరప్రాంతాలకు పోతుంది. అందుచేత, అమృతవల్లి తన బంధువుల యిళ్ళకు స్నేహితురాండ్ర యిళ్లకు వెళ్ళి వచ్చింది.

ఆమెకు ఒక్క కోరిక మాత్రం మిగిలింది. పట్టణంలో రాజావారున్నారు. రాణీగారున్నారు. వాళ్ళిద్దరూ చాలా మంచివాళ్లని అందరూ చెప్పుకుంటారు. రాజావారు పరపురుషులు. పెండ్లికి ముందు, వారిని చూడడం సరియైన పని కాదు. రాణీగారిని, వారి అంతఃపురాన్ని ఒకసారి చూసి రావాలని అమృతవల్లి కోరింది. ఈ సంగతి తల్లిదండ్రులు, దగ్గిర బంధువులలో పెద్దవారు, చాలాసేపు చర్చించారు. రాణీగారిని చూసిరావడంలో తప్పు లేదని, పెద్దవారిని తోడుతీసుకొని, కాబోయే పెళ్ళికూతురు చూసిరావచ్చునని వాళ్ళు తీర్మానించారు."

ఇంతవరకు చంద్రశేఖరం చెప్పాడు.

పైన ఉరుములు, మెరుపులు, పిడుగులు, అశనిపాతంలాంటి వర్షంలో కోర్టులోని ఎలక్ట్రిక్ దీపాలన్నీ ఆరిపోయాయి.

లోపల వెచ్చగా ఉంది.

పైన గాలి ఈలపెడుతున్నది.

కొవ్వొత్తులు వెలిగించి, జడ్జీగారి టేబిలు మీద, మరో నాలుగు చోట్ల ఉంచారు.

చంద్రశేఖరం తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు.

"యువరానర్!"

వివాహం యింకా ఎనిమిది దినాలుంది. ఆరోజు శుక్రవారం. అమృతవల్లి ఉదయమే తలంటిపోసుకుంది. ముందుగా పెద్దవాళ్ళు రాణీగారి అనుమతి తీసుకున్నారు.

రాణీగారు తొమ్మిది గంటలకు పల్లకీ పంపించారు. పెళ్ళి కావలసిన పదహారేళ్ళ అమ్మాయి నడిచి కోటకురావడం ఆమెకు నచ్చలేదు. అందరి కళ్లూ పడి అమ్మాయికి దృష్టి దోషం తగులుతుందని వారు భావించారు. పల్లకీలో కూర్చున్న వాళ్ళు పైవాళ్లకి కనిపించకుండా తెరలు వేశారు. పది గంటల వేళకు పల్లకీ కోటకు బయలుదేరింది. పల్లకీతో నారాయణరాజుగారి సోదరి ఒకరు తోడు వెళ్ళారు. కోట రెండు ఫర్లాంగుల దూరమే ఉంది. అమృతవల్లికి మాత్రమే మేనా పంపించి, తనకు అమర్యాద చేశారని ఆమె మేనత్త గునుస్తూ పల్లకీ వెంట నడిచారు.

ఆ మేనత్తగారు చాలా వింతైన మనిషి. ఆమెకు తమ్ముడి మీద అక్కసు ఉంది.

ఆమెకో పుత్రరత్నం ఉన్నాడు. అతనికి చదువు సంధ్యలు అబ్బలేదు. అన్ని వ్యసనాలూ అతనికున్నాయి. బంధుత్వం పాటించి, తన కొడుకుకిచ్చి అమృతవల్లి వివాహం జరిపించమని ఆమె అన్నగారిని నోరువిడిచి అడిగింది. కాని, నారాయణరాజుగారు అందుకు అంగీకరించలేదు. ఈరోజు అమృతవల్లితో రాణీగారి అంతఃపురానికి వెళ్ళడానికి మరెవరూ ముత్తైదువులు అందుబాటులో లేకపోవడంచేత, ఆ మేనత్తను పంపవలసి వచ్చింది.

ఆ మేనత్త ఆనాడు అమృతవల్లితో కోటకు వెళ్ళకపోతే, ఈనాడు కేసు కోర్టుకు వచ్చి ఉండేది కాదు.

అమృతవల్లి, ఆమె మేనత్త అంతఃపురం చేరుకునేసరికి పది గంటలయింది.

రాణీగారు విశాలమైనహాలులో, దంతపు పని చేసిన బల్లమీద కూర్చున్నారు. ఒక పరిచారిక వారి జుత్తుకు చిక్కులు తీసి, సాంబ్రాణి ధూపం వేస్తున్నది. అమృతవల్లి, ఆమె మేనత్త వచ్చిన సంగతి మరొక ఆమె రాణీగారితో చెప్పింది."

బయట, దగ్గిరలోనే, చాలా పెద్ద పిడుగు పడింది.

అందరి గుండెలు జోరుగా కొట్టుకున్నాయి.

ఒక్కక్షణం చెప్పడం ఆపి, చంద్రశేఖరం తిరిగి ప్రారంభించాడు.

"అమృతవల్లిని చూసి రాణీగారు అయిదు నిమిషాలు మాటలు లేకుండా ఉండిపోయారు. తరువాత ఆమెను తన ఎదురుగానున్న




రత్నకంబళీమీద కూర్చుండమని సంజ్ఞ చేశారు. వచ్చిన మేనత్త విషయం రాణీగారు పట్టించుకోలేదు.

రాణీగారు అమృతవల్లి ముఖంలోకి చాలా సేపు మళ్ళీ చూశారు.

పరిచారికలు ఆమెకు శుక్రవారం ధరించవలసిన ఆభరణాలు, చందనపు పెట్టెలలో పెట్టి తెచ్చారు.

పరిచారికలలో ఒకామె అలంకరణ చేస్తోంది. ఆమె పేరు చంద్రమ్మ.

"చంద్రమ్మా! అమ్మాయిగారిని చూడు! నేను పదహారేళ్ళ వయసులో, సుముహూర్తానికి సిద్ధమవుతున్నప్పుడు, నువ్వు నాకు అభ్యంగనం చేయించావు. జుత్తు చిక్కుదీసి, నుదుటన కళ్యాణ తిలకం దిద్దావు. నా చేతికి అద్దమిచ్చి చూసుకోమన్నావు. అమృతవల్లి, అచ్చంగా ఆనాటి నావలె లేదా?

చంద్రమ్మ నిదానంగా చూసి అంది.

"అమ్మగారు చెప్పింది ముమ్మాటికీ నిజం!"

రాణీగారు మరో పది నిమిషాలు అమృతవల్లిని చూశారు. తరువాత నవ్వుతూ అన్నారు.

"చంద్రమ్మా! అమ్మాయిగారికి నెమిలి కంఠం కంచిపట్టుచీర, మొన్ననే బరంపురంనుండి వచ్చినది, కొత్తది, కట్టించు. ఆ బట్టతోనే కుట్టించిన రవిక తొడుగు. ఈ శుక్రవారం నగలన్నీ ఆమెకు పెట్టు, పాపిడి బిందియలు మరచిపోకు. తీసుకెళ్ళు లోపలికి''

ఆమెను అలంకరించడానికి దగ్గిర దగ్గిర అరగంట పట్టింది.

బంగారు కుచ్చుల వాల్జడ, వజ్రాల చేమంతి పూవు, మెడలో కట్ల కాసులపేరు, నడుముకి మువ్వల వడ్డాణం, చేతులకు ముత్యాలు పొదిగిన గాజులు, ఇంకా ఇంకా అన్ని ఆభరణాలు అమృతవల్లికి చాలా చక్కగా అమరాయి.

"అమ్మాయీ! ఈ తూగుటుయ్యాలలో కూర్చొని మెల్లిగా ఊగు'' అన్నారు రాణీగారు. అమృతవల్లి దేనినీ కాదనలేదు."

కోర్టుబయట తీవ్రమైన తుఫాను. దగ్గిరగా వేసిన తలుపులను తోసుకొని గాలి చాలా వేగంగా లోపలికి వచ్చింది. అన్ని కొవ్వొత్తి దీపాలు ఆరిపోయాయి.

అంతటా అంధకారం

మెరుపులు సానపట్టిన కత్తుల్లా ఆకాశాన్ని చీలుస్తున్నాయి.

పైన చెట్ల కొమ్మలను విరిచి, గాలి రొదపెడుతున్నది.

విచారణ మరునాటికి వాయిదాపడింది. కాని, మరునాడు ఆ తరువాతనాడు జరగలేదు.

జడ్జిగారికి అస్వస్థత చేసింది.

ఆదివారం వెళ్ళిన తరువాత తెరిపిచ్చింది.

సోమవారంనాడు తిరిగి విచారణ, చంద్రశేఖరం కథనం ప్రారంభమయింది.

"యువరానర్!"

రాణీగారు తాము శుక్రవారం ధరించే ఆభరణాలనన్నిటినీ అమృతవల్లికి తొడిగించారు, నెమలికంఠంరంగు బరంపురం పట్టుచీరలో, సంపెంగవంటి శరీరచ్ఛాయగల...

పబ్లిక్ ప్రాసిక్యూటరు లేచి అభ్యంతరం తెలిపాడు.

అతను ఒక ప్రశ్నవేశాడు.

"మీరు అమృతవల్లిని ఆ స్థితిలో చూశారా?"

"లేదు''

"మరెలా మీరు చూడని విషయాలు చెప్తున్నారు?"

"అంతఃపురంలో పనిచేసిన చంద్రమ్మ నుండి ఈ వివరాలు సేకరించాను''

"ఆమె కోర్టులో హాజరయిందా?"

"చంద్రమ్మ కోర్టులో ఉంది. చాలామంది, ఆమెవంటి సాక్షులు, ఆ పక్కన కూర్చును న్నారు''

ఆమెచేత ప్రమాణంచేయించి పబ్లిక్ ప్రాసిక్యూటరు ప్రశ్నించాడు

"అమృతవల్లిగురించి లాయరుగారు చెప్తున్న సంగతి నిజమేనా?"

"నేనే వారికా సంగతి చెప్పాను. వారు చెప్పిన దానిలో కొంచెమైనా అసత్యంలేదు'' అంది చంద్రమ్మ.

జడ్జీగారు చంద్రశేఖరాన్ని తిరిగి చెప్పమన్నారు.

"యువరానర్!"

నెమిలికంఠం రంగుపట్టుచీరలో, సంపెంగ పువ్వువంటి శరీరచ్ఛాయగల అమృతవల్లి, వెండిగొలుసులు కట్టిన తూగుటుయ్యాలలో కూర్చొని ఊగుతుంటే, రాణీగారు చూస్తూ మైమరచిపోయారు.

సాధారణంగా, రాజులు అంతఃపురానికి విచ్చేస్తే ముందు కబురుపంపి, ఆటు తరువాత వస్తారు. కాని, ఈ నియమాన్ని రాజావారు ఆరోజు భంగంచేశారు.

ఎవరూ అనుకోకుండా వారు హాలులోకి ప్రవేశించారు. ఊయలలో కూర్చొని విలాసంగా ఊగుతున్న అమృతవల్లిని చూశారు.

రాజా వేంకటరంగారావు బహదూర్‌వారు, ఊయలలో కూర్చొని ఊగుతున్న అమృతవల్లిని చూస్తూ స్థాణువువలె నిలబడిపోయారు. ఆమె సౌందర్యాన్ని, ఆమె అలంకారాలను చూస్తూ ముగ్ధులయారు.

అమృతవల్లి రాజావారిని చూసి ఊయల నుండి దిగిపోయింది.

స్త్రీ సహజమైన లజ్జతో ఆమె ముఖందించుకోవాలి. కాని, రాజావారి ముఖంలోకి చూస్తూ ఆమె చేష్టలుడిగి నిలిచింది.

వాళ్ళ చూపులు కలుసుకున్నాయి. పదిహేను నిమిషాలవరకు అలాగే ఉండిపోయాయి.

తరువాత అమృతవల్లి ముఖం దించుకుంది.

రాజావారన్నారు.

"ఈ గంధర్వకన్య ఎవరు? ఒకనాటి రాణీగారు కాదుకదా?"

రాణీగారు ఫకాలున నవ్వారు.

"ఈమె నా ప్రతికృతి. పేరు అమృతవల్లి. నారాయణరాజుగారి సుపుత్రి. అమ్మాయికి వివాహం నిశ్చయమయింది. ముహూర్తమొక వారం రోజులే ఉంది. కాబోయే భర్త యింజనీరు, మద్రాసు ప్రాంతాలలో పని చేస్తున్నారు. దూరానికి వెళ్ళేముందు మన అంతఃపురం చూడాలని అమ్మాయి కోరింది. నేను పల్లకీ పంపించాను. ఈ నవవధువును చూడగానే నాకు అమితమైన ఆనందం కలిగింది. రాణిగా ఈమెను అలంకరించి చూడాలని సరదా వేసింది. తూగుటుయ్యాలలో ఇంకా విలాసంగా కనిపించింది ఈమె. నిజంగా అమృతవల్లి దివినుండి దిగివచ్చిన దేవకన్య''

రంగారావు బహదూర్ వారికి అప్పటికి నలభై సంవత్సరాలు. రాజ లక్షణశోభితులు. కాని వారు నిరాడంబరంగా, పాటి నూలి పంచకట్టుకొని, నిండుచేతులచొక్కా వేసుకొని వచ్చారు. వారు అమృతవల్లిని చూసి ఎంత భ్రమసిపోయారో, ఆమె కూడా వారిని చూస్తూ అంత పరవశించింది. ఆమె పెదవులు కంపించాయి. కపోలాలపై ఎరుపులుతోచాయి, ఏదో చెప్పరాని అనుభూతి, ఆమెలో స్త్రీత్వం ఒక్కసారి మేలుకున్నట్లనిపించింది."

పబ్లిక్ ప్రాసిక్యూటరు గద్దించాడు.

"యువరానర్! వాది తరపు లాయరుగారు హద్దులు మీరుతున్నారు. నిజమైన సంగతులు సంక్షిప్తంగా చెప్పడానికి బదులు, కవిత్వం చెప్తున్నారు. ఇటువంటి తేనెపూసిన పలుకులు నా ప్రతిపాదనలను బలహీనం




చేస్తాయి''

జడ్జిగారు నవ్వి, అన్నారు.

"ఇది సాహిత్య సభగా భావించకుండా, కోర్టు అన్నసంగతి గుర్తుంచుకుని మరీ మాట్లాడండి''

జడ్జీగారి మందలింపులకు చంద్రశేఖరం కొంచెమైనా కించపడలేదు.

"యువరానర్!

రమ్యమైన వాటిని చూడడం, మధురమైనట్టి వానిని వినడం రసజ్ఞులకు సహజమైన గుణం. ఈ విధంగా ఆనందించగలిగే సామర్థ్యంఅందరికీ ఉండదని ఈనాడు రుజువవుతున్నది. నా కథనానికి ఇటువంటి భాష అవసరం. శ్రవణానికి కటువుగా ఉండే పదాలను నేను ఉపయోగించలేదు. ఇక ప్రస్తుతానికి వద్దాం.

అమృతవల్లి మేనత్త హాలులో నిలబడే ఉంది. ఎవరూ ఆమెను కూర్చోమని కూడా చెప్పలేదు. అందరూ అమృతవల్లిని చూస్తూ అన్నీ మరచిపోయారు. అటువంటప్పుడు ఆమె మేనత్తను మరచిపోడంలో ఆశ్చర్యమేముంది!

ఆమె రాణీగారి మాటలు వింది, రాజావారి మాటలు వింది, ఈర్ష్యాగ్నిలో ఆమె దగ్ధమయింది.

తనకు కావలసిన కోడలు చేయిదాటినట్లనిపించింది.

కాని, సమయం కాదని, ఆమె కోపాన్ని అదుపులో ఉంచుకుంది.

రాణీగారు అమృతవల్లికి పెట్టిన తన ఆభరణాలను తీసివేయమన్నారు. కొత్త పట్టు చీరను, రవికను ఉంచుకోమన్నారు. అంతే కాక పెళ్ళికూతురిని చేసినప్పుడు కట్టించమని మరొక పట్టుచీర, రవికల గుడ్డ పళ్లెంలో పెట్టియిచ్చారు. ఇవన్నీ జరుగుతున్నప్పుడు, రాజావారు కూడా రాణీగారి పక్కనే నిలబడి ఉన్నారు. చివరకు రాజ దంపతులు, కాబోయే నూతన వధువును ఆశీర్వదించి పల్లకీలో ఇంటికి పంపించారు.

అమృతవల్లి మేనత్త రొప్పుకుంటూ తమ్ముడింటికి పరుగులు తీసింది.

పల్లకీ యిల్లు చేరుకునే ముందే, ఆమె యిల్లు చేరుకుంది.

రాజవీధిలో చాలా పెద్ద పెళ్ళి పందిరి వేస్తున్నారు.

నారాయణరాజుగారు, పట్టణంలో పేరున్న వారి బంధువులు వీధి అరుగుమీద కూర్చున్నారు.

జుత్తు పీక్కొని, గుండె బాదుకుంటూ వస్తున్న అక్కగారిని అతను చూశారు. కీడు శంకించారు.

అనుకున్నంత పని అయింది.

ఆమె బొబ్బలుపెడుతున్నది.

ఇంతలో పల్లకీ వచ్చి వీధిలో ఆగింది. బోయీలు దానిని కిందికి దింపారు. తెరలు తొలగించి మేఘాలనుండి పైకి వస్తున్న శరత్పూర్ణిమనాటి చంద్రుడివలె అమృతవల్లి పైకి వచ్చింది. ఆమె కట్టిన పట్టుచీరను, అంతకన్న శతవిధాల అందంగానున్న కాబోయే పెళ్ళికూతురిని చూసి వాళ్ళు మాటలు లేకుండా ఉండిపోయారు.

అమృతవల్లి యింటివేపు అడుగువేసింది.

"ఆగు!" మేనత్త పెద్దకేక వేసింది.

అమృతవల్లి నడివీధిలో నిలబడిపోయింది.

"తమ్ముడూ! ఈ చెడిపెను గుమ్మం తొక్కనియ్యడానికి వీలులేదు. మంచీ మర్యాదా విడిచిపెట్టి, సిగ్గూ లజ్జా విసర్జించి, రాజును చూస్తూ ఒళ్ళు మరచిపోయి, చూపులతో అతని చక్కదనాన్ని తాగుతూ, చుట్టూ పెద్దవాళ్ళున్నారనే జ్ఞానం లేకుండా, ఈ కులట వ్యవహరించింది. ఏనాడయితే పెళ్ళి సంబంధం నిశ్చయమయిందో, ఆనాటి నుండి అమ్మాయి పర పురుషుడిని కన్నెత్తి చూడడానికి వీలులేదు. ముహూర్తం పెట్టిన

దగ్గిర నుంచీ యిల్లు కదలడానికి వీలులేదు. ఈమె తగుదునమ్మా అని కోట చూడడానికి పోయింది. రాణిని చూసి వినయంగా తిరిగి వచ్చిందా? ఉహూ! రాణి పట్టుచీర కట్టుకొని రాణి ఆభరణాలన్నీ ధరించి, వెండిగొలుసుల తూగుటూయలలో ఊగుతూ, రాజు రాక కోసం ఎదురుచూసింది. రాజెక్కడ, తానెక్కడ! అతనిని చూసిన వెంటనే ఉయ్యాల దిగాలా? అతను తన వంటి వంపులు చూసేదాకా, తక్కీతారీ, అప్పటికి కూడా పక్కకి తప్పుకోకుండా, పావుగంటవరకు రెప్పవాల్చకుండా అతనిని చూస్తూ తన్మయత్వంతో ఉండిపోయింది. ఈ పిల్ల అత్తవారింటికి పోయినా, రాజు మీద ప్రేమ విడిచిపెట్టదు. పుట్టింటివారికి ఇంతకన్నా అపకీర్తి ఉంధా? నారాయణరాజు అంటే పట్నంలో ఎంత పేరు? తమ్ముడూ! ఈ క్షణంనుంచి నువ్వు, నలుగురిలో తలెత్తకుండా చేసింది. కాబోయే మీ వియ్యంకుడు, అవుతాడో లేదో నాకనుమానమే, అతను హైకోర్టు జడ్జిగా పనిచేశారు. కాబోయే మీ అల్లుడు- అతడెలా ఈ దౌర్భాగ్యురాలిని పెళ్ళిచేసుకుంటాడో తెలీదు. అతను ఒక జిల్లాకు అధికారి. ఈ నీతిలేని దానిని వాళ్ళు చేసుకుంటారా? ఈమె, పరువు మర్యాదలుగల వాళ్ళు కాపురమున్న ఈ యింటి గుమ్మం ఎక్కడానికి అర్హురాలు కాదు. ఇంతమంది పెద్దమనుషులు వీధిలో వీరాంగం వేశారు. నేను చెప్పినది నిజమోకాదో దీనినడగండి''

అందరూ మ్రాన్పడిపోయారు.

అక్కడ కూర్చున్నవారిలో, ఒక పెద్దాయన, వరుసకు నారాయణరాజుగారికి బావ అవుతాడు, అతను కిందికి దిగి వచ్చాడు.

"అమ్మాయ్! మీ మేనత్త చెప్పిన సంగతులు నిజమేనా?"

అమృతవల్లి తలవంచుకుంది.

రాజవీధి, పల్లకీ నడివీధిలో ఉంది, బోయీలు ఈ తగువులాటను చూస్తూ చలనంలేకుండా ఉండిపోయారు. వీధిని పోతున్న మనుషులందరూ చుట్టూ మూగుతున్నారు. చాలా కోలాహలంగా ఉంది.

"చెప్పు!" పెద్దాయన గద్దించారు.

ఇంతలో నారాయణరాజుగారు కూడా అరుగు దిగి కిందికి వచ్చారు.

"నిజమే!" అమృతవల్లి, ముఖం నేలకు తిప్పి చెప్పింది.

"అది తప్పు పని కాదా?"

"నాకు తెలియదు''

"నా వంశగౌరవం నాశనం చేశావు. నువ్వు గడప తొక్కడానికి అర్హురాలివి కాదు'' అన్నారు నారాయణరాజుగారు.

"దీని సంగతి విడిచిపెట్టురా, తమ్ముడూ, దీని మూలంగా దీని చెల్లెలికి పెళ్ళవుతుందా?"

నారాయణరాజుగారు కోపాన్ని అదుపులో పెట్టుకోలేక పోయారు. చేయిచాచి, అతను అమృతవల్లి చెంపమీద కొట్టారు. పడిపోబోయి ఆమె నిభాయించుకుంది.

"నువ్విక్కడనుండి వెళ్ళిపో! గోతిలో పడతావో, నూతిలో పడతావో! మేమందరం, సచేలస్నానం చేస్తాం" గొంతు చించుకొని మేనత్త అరుస్తున్నది.

నారాయణరాజుగారు నిలువున నడివీధిలో కూలబడ్డారు.

"పెళ్ళి కావలసిన అమ్మాయి ఎక్కడికి పోతుంది?" బంధువులలో ఒకరు అడిగారు.

"రంకు మొగుడిదగ్గిరికి'' మేనత్త తన అక్కసునంతా కక్కింది. ఇంట్లో ఆడవాళ్ళు మొరలు పెడుతున్నారు.

వీధిలో నిలబడ్డవాళ్ళు ఏమీ అనలేక నిలబడిపోయారు.

తనవలన ఇంత అనర్థం వాటిల్లినందుకు అమృతవల్లి విచారించింది.

ఎక్కడికి పోవాలి?

ఒక్కటే గమ్యం. అది కోట.




అక్కడ వాళ్ళు కూడా తగిలేస్తే.

ఆడదాని బ్రతుకు అంతమొందించుకోడా నికి అసంఖ్యాకమైన పద్ధతులున్నాయి.

వాళ్ళందరి మధ్యనుంచి అమృతవల్లి కోటవేపు నడిచింది.

పల్లకీ ఆమె వెనుక వెళ్ళింది."

చంద్రశేఖరం తన కథనం ఆపివేశాడు.

"యువరానర్! నేనేవిధంగా ఉద్రిక్తుడనుకాకూడదు చాలా నిదానంగా చెప్పాలి. ఒకసారి అమృతవల్లిగారిని గౌరవంగా సంబోధిస్తున్నాను. మరొకసారి మామూలు మనిషిగా చెప్తున్నాను. ఈ పొరపాటుకు కోర్టువారి క్షమాపణ వేడుకుంటున్నాను''

జవాబుగా జడ్జీగారు నవ్వారు.

ఇంతలో మధ్యాహ్న విరామాన్ని సూచిస్తూ గంట మోగింది.

తిరిగి మూడు గంటలకు విచారణ ప్రారంభమవుతుందని డఫేదారు ఘోషించాడు.

అందరూ బయటికి వెళ్ళిపోయారు.

"యువరానర్!

నారాయణరాజుగారు ఉత్తరం వ్రాసి వియ్యంకులవారికి పంపించారు.

తమ పుత్రిక అన్యపురుషుని మీద మనసు నిలిపిందని, ఈ సంగతి రుజువయిందని, అందుచేత వివాహం రద్దుచేస్తున్నామని వ్రాశారు.

నారాయణరాజుగారి సంసారం కూలిపోయింది.

అప్పటికి పదేళ్ళున్న రామభద్రరాజు అమ్మమ్మగారి ఇంటే ఉండిపోయాడు. అమృతవల్లి చెల్లెలు శ్రీలేఖ. ఆమె కూడా అందమైనదే. తొందరగా ఆమె పెళ్ళికి ఎదిగి తల్లిదండ్రులకు పక్కలో బల్లెమయింది.

వివాహప్రయత్నాలకింద చాలా ధనం మట్టిపాలయింది. రాజవీధి వారంరోజులవరకు భీభత్సంగా కనిపించింది. దారిలో అడ్డంగా సరుగుడు రాటలు, తాటికమ్మలు, రోడ్డుమీద రాటలకోసం తవ్విన గోతులు.

బంధువులందరూ అప్పటికప్పుడే వెళ్ళిపోయారు.

అమృతవల్లి మేనత్త మంధరవలె వ్యవహరించింది. మంచివాళ్లందరూ ఆమె చేసిన పనికి అసహ్యించుకున్నారు. పెళ్లిని ఆమె సులువుగా చెడగొట్టింది. కాని, మేనగోడలిని తనవేపు తిప్పుకోలేకపోయింది. ఆమె కొడుక్కి మరో సంబంధం రాలేదు. తల్లి ప్రవర్తన తెలుసుకున్నవాళ్లు, ఆ యింట్లో తమ పిల్ల బతకలేదనుకున్నారు.

జరగవలసిన హాని జరిగింది.

ఒక్కొక్కప్పుడు జననాశనానికి, ప్రకృతి నాశనానికి కారణాలైన తుఫానులు కొన్ని మంచి పనులు కూడా చేస్తాయి. పొలాలలో వరదలకు కొత్తమట్టి చేరుతుంది. వేలకొలది ప్రజలు కడగలేని పృథ్విని ఇవి పరిశుభ్రం చేస్తాయి. పోయినవారుపోగా మిగిలినవారు కొత్తజీవితాలవేపు ఆసక్తి కనపరుస్తారు.

అమృతవల్లి మిట్టమధ్యాహ్నం, ఎండలో కాళ్లు కాలుతుంటే, కోటలోకి నడిచింది. అంతఃపురం ప్రవేశించింది. తనను చూసి ఆశ్చర్యపోయిన రాణీగారికి జరిగిన సంగతంతా చెప్పింది. చివరకు అమృతవల్లి అంది.

"నేనిక్కడికి ఎందుకు వచ్చానో నాకు తెలియదు. నిజం తెలిసినవారు మీ దంపతులు. హృదయమున్నవారు మీరు. నా బాధను చెప్పుకోడానికి తల్లిదండ్రులు నాకు దూరమయ్యారు. నన్ను విసర్జించారు. మీకు జరిగినది చెప్పాను. నాకు సెలవియ్యండి''

"ఎక్కడికి పోతావు?"

"నావంటిదానికి మృత్యువే శరణ్యం. నిష్కలంకులైన రాజదంపతులకు లేనిపోని అపనిందలు నావలన కలిగాయి. ఈ అపచారానికి ఆత్మహత్యే నిష్కృతి''

రాణిగారి కళ్లంట ధారలుగా నీళ్లు కారుతు





న్నాయి.

"కళ్యాణీ! నువ్వే పాపం ఎరుగవు. రాజుగారిని చూసి పరవశం చెందడంలో నీ తప్పు లేదు. ప్రభువులు పరమసుందరమైనవారు. ఏ యువతి వారిని చూసినా ఇటువంటి భ్రమకే లోనవుతుంది. నువ్వు తొందరపడి ఎటువంటి ఆత్మహత్యా ప్రయత్నం చేయకు. భగవంతుడు అనుగ్రహించిన ఈ జీవితాన్ని త్రుంచివేయడానికి నీకు అధికారం లేదు. కేవలం పిరికివాళ్లు మాత్రమే ఆత్మహత్యకు పాల్పడతారు''

రాణీగారు అమృతవల్లిని సమీపించారు. షోడశవర్షప్రాయం గల పరిత్యక్తను హృదయానికి వాత్సల్యంతో హత్తుకున్నారు.

"నువ్వు నా ప్రతికృతివి. నా కోసం నువ్వు జీవించాలి. ప్రభువు వారికోసం జీవించాలి''

రాణీగారు చంద్రమ్మను రాజావారి దగ్గరికి పంపించారు.

రాజావారు చాలా జరూరైన మీటింగులో పురప్రముఖులతో చర్చిస్తున్నారు. చంద్రమ్మ రాజావారి చెవిలో చెప్పింది, రాణీగారు ఉన్నపళంగా రమ్మంటున్నారని, సభ్యులను అలాగే విడిచిపెట్టి రాజావారు అంతఃపురానికి వెళ్లిపోయారు.

అమృతవల్లికి జరిగిన అన్యాయం గురించి తెలుసుకొని ఆయన చాలా బాధపడ్డారు.

"కళ్యాణీ! ఏనాడైతే నీకు సంబంధం నిశ్చయమయిందో, మనసా నువ్వు వారికి ఉద్వాహమైనట్లే. అందుకే నిన్ను కళ్యాణీ అని సంబోధిస్తున్నాము. లోకమంతా నిన్ను పరిత్యజించినా, మా దంపతులం నీకు రక్షకులుగా నిలుస్తాం. నీకు ఏవిధమైన లోటూ కలుగదు. కోటలో సరస్వతీ భవనముంది. దానిని ఆనుకొని మేము ఏకాంతంగా విహరించే ప్రమదావనం, దాని మధ్యనో బంగళా ఉన్నాయి. ఆ బంగళా, పూలతోటతోసహా, నీ నివాసానికి ప్రత్యేకిస్తున్నాను. ఈ సాయంకాలానికి పరుపులు, పందిరిమంచాలు, తివాసీలు, కుర్చీలు మొదలైనవి తీసుకొస్తారు. వంటకత్తెలు, పనిపాటలు చేసే పరిచారికలు, అలంకారం చేసే దాసీలు, అందరూ నీకు సేవచేస్తారు. రాణీగారికి జరిగిన మర్యాదలన్నీ నీకూ జరుగుతాయి. తీరికవేళల్లో నువ్వు రాణీగారిని దర్శించి, వారితో కాలం గడపవచ్చు. వారు కూడా నీ దగ్గిరికి వస్తారు. ఇది మా దంపతుల సమ్మతితో నీకు చేసిన ఏర్పాటు. ఈ కష్టంనుంచి నువ్వు కోలుకోడానికి కొంతకాలం పడుతుంది. నూతనమైన వాతావరణానికి నువ్వు అలవాటు పడతావు'' అన్నారు రాజావారు.

వారు మళ్లా మీటింగుకు వెళ్లిపోయారు.

మధ్యాహ్నం ఎవరూ భోజనాలు చెయ్యలేదు.

మీటింగు అయిన తరువాత, దివాన్‌జీగారితో జరిగిన సంగతంతా చెప్పి, ప్రతినెల పదివేల రూపాయలు అమృతవల్లి పోషణకు వినియోగించమన్నారు.

ఆవిధంగా అమృతవల్లి రాజావారి బంగళాలో ప్రవేశించారు.

మిగిలిన ప్రపంచానికంతకూ దూరమయ్యారు.

రాజావారు, రాణీగారు పగలంతా ఏమీ తినలేదు.

అమృతవల్లి రాత్రివరకు ఏడుస్తూనే ఉంది.

తన కోసం ఆమె విచారించలేదు. తనవలన ఎంతమంది అవమానం పాలయ్యారని దుఃఖించింది. అంతవరకు ఆమె జీవితంలో ఎదుటివారిని పరుషమైన మాటలతో నిందించలేదు. ఇతరులకు కష్టం కలిగించే పని చేయలేదు. మనసులోనైనా మరొకరి గురించి చెడ్డ తలంచలేదు.

రాజావారు సాయంకాలం స్నానాదులు ముగించి సంధ్యవార్చారు. హాలులో

కూర్చొని, కొంచెం సేపు రాణీగారితో మాట్లాడి, అమృతవల్లిని పిలిపించారు.

"కళ్యాణీ! ఎవరెన్ని చెప్పినా, విధి అన్న దానిని ఎవరం తప్పించలేము. ఈరోజు అనుకోకుండా, ఇంతటి విపరీతం సంభవించింది. నువ్వు ఉత్తమవంశంలో పుట్టినదానివి. గతం గురించి క్రమంగా మరచిపోవడం మంచిది. నువ్వు జీవితాన్ని కొత్తదారికి మళ్లించు. మా దంపతులం, నీకు బంధువులు దూరమైన లోటును తీర్చగలము. నీకు కలిగిన కష్టం తెలుసుకొని, అంతఃపురంలోని జనమంతా, మాతోపాటు భోజనం చేయకుండా ఉండిపోయారు. నువ్వు మాతోపాటు భోజనం చేస్తే, మేము నీకోసం ప్రత్యేకించిన బంగళాలో నిన్ను దిగబెడతాము'' అన్నారాయన.

అమృతవల్లి పేరుకే భోజనం చేసింది. తరువాత రాజదంపతులు ఆమెను బంగళాకు తీసుకుపోయారు.

సక్రమంగా, వైభవంగా వివాహం జరిగి, భర్తతో దూరదేశాలకు వెళ్లవలసి ఉంటుందని ఆమె అనుకుంది. కాని విధి వక్రించింది. తనవాళ్లు ఆత్మబంధువులు కూడా తనను క్షమించలేకపోయారు. సమాజంనుండి వెలివేసినట్లు, ముఖమేనా తిరిగి చూడకుండా తప్పుకున్నారు. లోకజ్ఞానం కూడా సరిగాలేని తనను, కుటుంబంనుంచి బహిష్కరించారు.

ఆ రాత్రి ఆమె మెత్తటి పరుపుమీద పడుకున్నా, ఏవో ఆలోచిస్తూ నిద్రకు దూరమయింది.

తనవలన, రాజదంపతులలో, ఒకరిపై ఒకరికి అపార్థం కలుగకూడదని ఆమె కోరింది.

ఈ విషయం రాణీగారు స్పష్టంగా చెప్పారు. రాజావారు చాలా ఉన్నతమైన ఆశయాలు కలవారు. ధర్మాత్ములు. ఏకపత్నీ





వ్రతస్థులు.

కాని అతను తనను చూసినతీరును, ఆమె ఎప్పటికీ మరచిపోలేదు. ఆ చూపులు ఆమె హృదయపులోతులవరకు పోయాయి. రాజావారు చాలా చక్కనివారు. విశాలమైన కనులు. గాలికెగిరే ముంగురులు. మాటలలో సౌమ్యత. వారు రాణీగారిని ప్రాణ సమానంగా ప్రేమించినవారు. ఆ దంపతుల మధ్య కలతలు లేపకుండా, తను జీవికను సాగించాలి.

ఒక నెలరోజులు రాజదంపతులు ప్రతిదినం వచ్చి అమృతవల్లిని చూసి వెళ్లేవారు. కాని, ఆమె దుఃఖంనుండి బయటపడలేకపోయింది.

రాజదంపతులు చాలా రాత్రులు అమృతవల్లి గురించి ఆలోచించారు.

ఒకరాత్రి రాణీగారొక సలహా ఇచ్చారు.

"ప్రభువులకు సంగీత సాహిత్యాలంటే ప్రాణం. నాకు ఈ రెండింటిమీద అభిమానముంది కాని, వాటి గురించి అంతగా తెలియదు. రాజకార్యాలలో మీకు నేను సహాయం చేయగలను. అమృతవల్లికి సంగీత సాహిత్యాలమీద ఆసక్తి ఉందో లేదో తెలియదు. ఆమెకు పని లేకపోవడంనుంచి తనకు జరిగిన అన్యాయాన్ని మరచిపోలేకపోతున్నది. ఎడతెగకుండా విచారిస్తున్నది''

రాజావారు మధ్యలో అన్నారు.

"పూలతోట ఇప్పుడు నేత్రపర్వంగా ఉంది. బహుశా..."

"నిజమే. అమృతవల్లి పనివాళ్లతో కలిసి మొక్కలకు సంరక్షణ చేస్తున్నది. రోజుకి రెండు గంటలు పరిశ్రమ చేసినా, మిగిలిన కాలంలో తన పాతజ్ఞాపకాలకు మళ్లిపోతున్నది. సంగీత సాహిత్యాలలో ఆమెకు ప్రవేశం కలిగించడానికి ఏర్పాటు చేయండి. అప్పుడామె ఒకదారికి రావచ్చు''

రాజావారు కొంచెంసేపు ఆలోచించి అన్నారు.

"మనం చెంగల్పట్టు వెళ్లి, వెంకట్రాయు

డిని కలిసి జరిగిన సంగతి చెప్తే..."

"అతను అంగీకరించవచ్చు. కానీ నలుగురి నోటిలోపడిన అమ్మాయిని కోడలిగా చేసుకోడానికి అతని తల్లిదండ్రులు ఇష్టపడరు''

"అమృతవల్లి అభిప్రాయం?"

"ఆమెకే అభిప్రాయమూ లేదు. ఆ ఇంజనీరు సంగతా? అతనికేం, మహారాజు. మరొక అమ్మాయిని పెళ్లాడతాడు''

చాలా సేపు వాళ్లిద్దరూ ఎన్నో పద్ధతుల గురించి ఆలోచించారు. చివరకు రాణీగారి సలహాకే కట్టుబడ్డారు

ఆనాటినుంచి అమృతవల్లి జీవితమే మారిపోయింది.

జీవితంమీద ఆమె దృక్పథమే మారిపోయింది.

ప్రపంచంలో తాను దిక్కులేనిదానినన్న భావం విడిచిపెట్టింది.

జీవితం, ఒకరికి పనికి వచ్చినా లేకపోయినా, తనకు మాత్రం పనికొచ్చేటట్టు దిద్దుకోడానికి ఆమె ఒక నిశ్చయానికి వచ్చింది''

ఆరోజుకు అంతటితో విచారణ వాయిదా పడింది.



చంద్రశేఖరం మరో రెండువారాలు అమృతవల్లి కేసు గురించి తన వాదన కోర్టులో సాగించాడు. అది వాదనకాదు. అమృతవల్లి జీవితంలో మరికొన్ని ఘట్టాలు కోర్టువారికి వివరించాడు. ఆమె జీవితంలోని మరి ఒకటో రెండో విశేషాలు చెప్పి వాదన ముగించదలచాడు.

ఆరోజు ఆదివారం. వచ్చేవారంతో కేసు పరిష్కారమవుతుంది.

చంద్రశేఖరం కొంచెం ఆలస్యంగా లేచాడు. దంతధావనాదులు ముగిసిన తరువాత బద్ధకంగా కూర్చున్నాడు. కాఫీ తాగుతూ పేపరు చూస్తుంటే, ఒకాయన వచ్చి వీధితలుపు తట్టాడు.

"మీరేనా చంద్రశేఖరంగారు?" ఆ వచ్చిన అతను ప్రశ్నించాడు.

"అవును, నేనే''

"నా పేరు శంకరరావు, నేను సిరిపురం దివాను, రామలింగస్వామిగారి కుమారుడిని. మా తండ్రిగారు ఒక వీలునామా వ్రాశారు. సిరిపురం రాజావారి గురించి తెలుసుకున్న ఆంతరంగికమైన సంగతులు అప్పుడూ అప్పుడూ డైరీలలో వ్రాసి, రహస్యంగా ఒక పెట్టెలో పెట్టి, సీలు వేశారు. తన మరణానంతరం పది సంవత్సరాలు గడిచిన తరువాత, పెట్టె సీలుతీసి, డైరీలో వ్రాసిన సంగతులు చదవవచ్చునని వీలునామాలో ఉంది. మొన్నటికి మా తండ్రిగారు పోయి పది సంవత్సరాలయింది. వారి వకీలుగారు, తమ వద్దనున్న పెట్టె సీలు, మా అందరి ఎదుట తెరచి, డైరీలు నాకిచ్చారు. ఇవి పది డైరీలు. ఒకటి రెండుచోట్ల చదివితే అమృతవల్లిగారి గురించి, రాజా వేంకట రంగారావు బహదూర్‌వారి గురించి వివరంగా వ్రాశారు. మీరు కోర్టులో చెప్తున్న వివరాలు క్రమంగా పలుచబడుతున్నాయని పేపర్లలో వస్తున్న వార్తలు స్పష్టం చేస్తున్నాయి. మీకీ డైరీలు సహాయపడతాయని రాత్రికి రాత్రి బయలుదేరివచ్చాను''

చంద్రశేఖరం సావధానంగా కూర్చున్నాడు. దివాన్‌జీగారి అబ్బాయికి లోపలినుంచి కాఫీ తెప్పించాడు. తరువాత ఒక డైరీలో

రెండు పేజీలు తిప్పాడు. పేజీ తరువాత పేజీ తిప్పుతున్నాడు. అన్నీ కొత్త సంగతులే. రాజా వారు చాలా ఆంతరంగిక విషయాలు దివాన్ గారితో చర్చించారు. దివాన్‌జీగారు, అన్ని పనులలోను తీరిక కల్పించుకొని, శ్రద్ధగా వాటిని డైరీలలో వ్రాసుకున్నారు. ఏదోరోజు ఆ సంగతుల అవసరం వస్తుందని వారికి తెలుసు. ఆయన రాజావారికి చేసిన వాగ్దానం ప్రకారం, తాను జీవించి ఉన్నంతకాలం ఈ రహస్యాలు ఎవరికీ తెలియనియ్యనన్నారు.

ఇంతవరకూ చంద్రశేఖరం సేకరించిన విషయాలు చాలచోట్ల అతకలేదు. అమృతవల్లి రాజావారి కోట చేరేవరకు చెప్పినవి అందరికీ తెలిసినవే. వాటిలో రహస్యమేదీ లేదు. తరువాత కోటలో జరిగిన సంగతులు, ఒకటీ అర, ఒకరిద్దరికి మాత్రమే తెలుసు. అది కూడా చాలా పరిమితంగానే. అందు చేత అమృతవల్లి అంతఃపురజీవితం దుర్భేద్యంగా ఉండిపోయింది. ఎన్ని ప్రయత్నాలు చేసినా సరిగా తెలియదు. కాలాతీతమవుతున్నదని, అతను రంగంలోకి దిగవలసివచ్చింది. ఆసక్తికరమైన విషయాలను, కోర్టువారిని ప్రేక్షకులను ఆకర్షించేటందుకు అతను ముందే వినియోగించుకున్నాడు. ఇప్పుడు చెప్తున్న సంగతులలో కొత్తదనంపోయి, శ్రోతలలో ఏమీ స్పందన కలగడంలేదు.

ఇది విషయ దారిద్ర్యంవలన కలిగిన పరిణామం.

ఇప్పుడు అనుకోకుండా నిధి ఒకటి తానుగా వచ్చి, తలుపు తట్టింది.

అది సామాన్యమైనది కాదు. ఎవరికీ లభ్యం కావలసినది కాదు. ఈ రహస్య సమాచారం ఎంతవరకూ అందరికీ వినిపించవచ్చు?

రాజావారు, రాణీగారు, ధివాన్‌జీగారు పోయినా, అమృతవల్లి ఇంకా జీవించేఉన్నారు. వారి ప్రైవేటు బతుకును బట్టబయలుచేయడానికి తనకు అధికారం లేదు.

చాలా ఆలోచించి చేయవలసిన పని ఇది.

"శంకరరావుగారూ, నా ధన్యవాదాలు ఏవిధంగా మీకు తెలుపుకోవాలో తెలియడంలేదు. నేను, కిందా మీదా పడి, ఏదోవిధంగా కేసు గెలవవచ్చు. కాని నేను కోరేది దిగ్విజయం. ఇది నేను స్వతంత్రంగా వాదిస్తున్న మొదటి కేసు. మీరు సరియైన వేళకు ఈ ముఖ్యమైన డైరీలు తీసుకొనివచ్చారు. వీటిని చాలా భద్రంగా ఉంచుతాను. అవసరమైనమేరకే సంగతులను బైటపెడతాను. మీరు నాయందు పరిపూర్ణమైన విశ్వాసముంచవచ్చు''

శంకరరావు సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

చంద్రశేఖరం తొందరగా స్నానంచేసి, డైరీలు పట్టుకొని, మేడమీదనున్న తన స్టడీ రూమ్‌కి వెళ్లిపోయాడు. క్లయింట్లెవరినీ ఆరోజు చూడడానికి వీలుపడదని, తనను ఎవరూ కదపరాదని ఆజ్ఞలు జారీచేశాడు.

డైరీలలోని విషయాలను అతను ఒక క్రమంలో వ్రాసుకున్నాడు.

ఆ కథనం ఈవిధంగా దివాన్‌జీగారి మాటల్లోనే సాగింది.

రాజావేంకటరంగారావు బహదూర్‌వారు చాలా విశిష్టమైన వ్యక్తి.

వారికన్న నేను అయిదేళ్లు పెద్ద. నేను కొంతకాలం విజయనగరం, శ్రీకాకుళాలలో డిప్యూటీ కలెక్టరుగా పనిచేశాను. నా నలభయ్యోయేట డిప్యుటేషన్‌మీద సిరిపురం రాజావారి దివానుగా చేరాను. కోటకు సమీపంలో ఒక పెద్ద ఇంటిని రాజావారు నా కోసం కొన్నారు. పది సంవత్సరాలు వారి దగ్గిర నమ్మకంగా పనిచేసినందుకు నాకా ఇంటిని గిఫ్ట్‌గా ఇచ్చారు.

రాజ కార్యాలలో మునిగి ఏ రాత్రికో ఇల్లు చేరుకోవడం అలవాటయింది. పనిలో బాగా అలిసిపోయి, భోజనమైనదే తడవు, మంచంమీద పడుకునేవాడిని. సంసార




బాధ్యత అంతా నా భార్యకు విడిచిపెట్టాను. రాజావారి కొలువే నాకు రామస్మరణ. అతను నా గురించి చాలామందిని వాకబు చేశారు. నిజాయితీకి, రామలింగస్వామి మరొక పేరని అందరూ చెప్పిన తరువాత ఆయన నన్ను ఉద్యోగంలోకి తీసుకున్నారు. నన్నొక ఆరునెలలు అన్నిరకాల పరీక్షలకు గురిచేశారు. అన్నీ అయిన తరువాత నన్ను ఆత్మబంధువుగా స్వీకరించారు.

ఇంతకాలం, అంటే నేను ఉద్యోగంలో చేరిన అయిదు సంవత్సరాలవరకు, ఇటువంటి డైరీ వ్రాయవలసిన అవసరం కలుగలేదు. ఇప్పుడు తప్పనిసరిగా వ్రాయవలసివచ్చింది. ఇంతవరకు రాజావారి జీవితంలో రాణీగారు తప్ప మరొక స్త్రీ ప్రవేశించలేదు. దాసీజనంలో అందమైన స్త్రీలున్నా రాజావారు చలించలేదు. రాణీగారు అందరికన్న అందమైనవారు కావడమే దీనికి ముఖ్యకారణం.

అమృతవల్లి కోటలో అడుగుపెట్టిన దగ్గిర నుంచే ఈ సంచలనం ప్రారంభమయింది.

అమృతవల్లి అంత అందమైనదా?

మిట్టమధ్యాహ్నం, ఆ చిన్నది, తనవారు నిర్దాక్షిణ్యంగా పరాభవిస్తే కోటకు తిరిగి వచ్చింది. అలా వస్తుంటే, నా భార్య ఆమెను చూసింది. అవమానంతో క్రుంగి, ఎండలో కమిలిపోయినా అమృతవల్లి చాలా అందంగా ఉందని ఆమె వ్యాఖ్యానించింది.

ఇవన్నీ బాగానే ఉన్నాయి. వీర్యవంతులైన పురుషుల వంక స్త్రీలు, సౌందర్యవతులైన స్త్రీల వంక పురుషులు ఆకర్షితులవుతూనే ఉంటారు. ఇందులో చెప్పుకోదగ్గ విశేషమేముంది?

రాజావారు తనంతటతానే నాతో అన్నారు.

"స్వామిగారు! నేను ధర్మాన్ని రక్షించేవాడినని, ఏకపత్నీవ్రతుడనని, ఇంతకాలం గర్వంగా చెప్పుకున్నాను. కాని, నిన్నను నా గర్వానికి తగిన ప్రాయశ్చిత్తం జరిగింది. అందరు సామాన్యులకువలెనే నేను కూడా అమృతవల్లిని చూసి చలించిపోయాను. ఇది నావంటివాడికి తగనిపని. అందరికీ ఆదర్శప్రాయుడిగా ఉండవలసిన నేను, పదహారేళ్ల అమ్మాయిని, పెళ్లి కావలసినదానిని, చూసి మనసు నిలుపుకోలేకపోయాను. హాలులో రాణీగారు, దాసీజనం, అమ్మాయి మేనత్త ఉన్న సంగతి నేను మరచిపోయాను. ఆ అమ్మాయి తిరిగి కోటకు వస్తే, ఏ ఆలోచన లేకుండా ఆమెకు ఆశ్రయమిచ్చాను. అంతేకాకుండా కోటలోనే ఆమెకు స్థిరనివాసం ఏర్పాటుచేశాను. ఆమె పోషణకు ఎంత ధనమైనా మిమ్మల్ని దివాణం నిధులలోంచి యిమ్మన్నాను. నేను నా కర్తవ్యాన్ని సరిగా నెరవేర్చేనా? లోకం నన్నేమంటుంది?"

"ఏదేనా మంచిపని చేయవలసివచ్చినప్పుడు చాలా ఆటంకాలు కలుగుతాయి. అపవాదులు ఎదురవుతాయి. వాటికి మీవంటివారు భయపడకూడదు" అని ఆవిధంగా నేను సలహా ఇచ్చాను.

కాని వారి మనసులో అవ్యక్తమైన బాధ కొట్టుమిట్టాడుతునే ఉంది.

వారు ఈవిధంగా ఒక నెలదినాలు చాలా బాధపడ్డారు.

తరువాత ఒక ఉదయం నాతో అన్నారు.

"ఇంతవరకూ మేము అమృతవల్లి బాహ్యసౌందర్యానికి మురిసిపోయాము. గడచిన రాత్రి మేము చాలా ఆలోచించాము. అన్నిటికన్న అంతఃసౌందర్యం చాలా ముఖ్యమైనది. దానికి మెరుగులు పెట్టే ఏర్పాటులు చేయాలని మేమొక నిశ్చయానికి వచ్చాము. మన ఆస్థాన విద్వాంసులు లక్ష్మీనారాయణశాస్త్రిగారిని, ఆమెకు సంస్కృతాంధ్రాలు చెప్పమని నియోగించండి. వారికి ప్రతినెల అదనంగా పారితోషికం ముట్టజెప్పండి. ఆ ప్రకారమే వైణిక సార్వభౌములు గోపాలశర్మగారిని కూడా

జాగుసేయకుండా బొబ్బిలినుండి ఉత్తమమైన వీణనొకటి తెప్పించండి''

రాజావారు చాలా సులువుగా చెప్తారు. పాఠాలు చెప్పడానికి గోపాలశర్మగారిని నియోగించగలనుగాని, వీణ నెక్కడనుండి తేగలను. బొబ్బిలిలో వీణలు తయారుచేసే వారికి ఆరు నెలలు ముందుగా ఆర్డరు పెట్టాలి. అందులోకి, మంచి రకం వీణకు మరో మూడునెలలు- అంతవరకు రాజావారు ఓర్చుకోలేరు. తాము చెప్పినది సక్రమంగా జరగడమే వారికి కావాలి. మిగిలిన సాధక బాధకాలు నావి. నేను మరునాడు ఉదయమే కారులో బొబ్బిలికి బయలుదేరాను. బొబ్బిలిలో రామశేషయ్య చాలా పేరు గాంచిన వీణలను తయారుచేశాడు. అతని దగ్గిరికి తిన్నగా పోయాను. అతను ఒక వీణకు తుదిమెరుగులు పెడుతున్నాడు. ఆ వీణ ఎవరికని అడిగాను. పిఠాపురం మహారాజుగారికని అతను చెప్పాడు. దానిమీద అతను రెండు సంవత్సరాలయి పనిచేస్తున్నాడు. దాని ధర ఎనిమిది వేల రూపాయలు, మహారాజుగారు ఆ సొమ్మంతా ముందే యిచ్చివేశారు. తమ కుమార్తె కోసం దానిని బెత్తాయించారు. ప్రతి రోజు ఆమె కొత్త వీణకోసం మారాం చేస్తున్నది. రామశేషయ్యను చాలా బ్రతిమాలాను. కాళ్ళా వేళ్ళా పడ్డాను. అతను ఎంతకు అంగీకరించలేదు. చివరకు పదిహేను వేల రూపాయలిచ్చి దానిని కారులో పెట్టించాను.

రాజావారికి డబ్బుతో సంబంధంలేదు. తన పని నెరవేరడమే కావలసినది.

అమృతవల్లిని రాణివాసపు పద్ధతులన్నీ ఆచరించమన్నారు. రాజ కుటుంబంలోని స్త్రీలు పరపురుషుల ఎదుట కూర్చోరు. ఒకవేళ కూర్చోవలసివస్తే మధ్యనొక దట్టమైన తెర వేయించాలి. ఆమె పక్కన మరొక స్త్రీ ఉండాలి. రెండు రోజులు సంస్కృతాంధ్రాలలోను, రెండు రోజులు వీణా వాదనంలోను పాఠాలు చెప్పడానికి ఆచార్యులను నియోగించడమైనది.

అక్కడితో నా బాధ్యత తీరిపోలేదు.

విద్యార్థినికి గ్రహణశక్తి ఉందో లేదో తెలుసుకుంటూ ఉండాలి. ఆమెకు చెప్పించిన విద్య అంటకపోతే, కారణాలు కనుక్కోవాలి. ఇవన్నీ చాలా జాగ్రత్తగా చేయవలసినపనులు.

చాలాకాలమై ఈ డైరీ వ్రాయలేదు.

కరువులు, కాటకాలువస్తే ఇటువంటివి వ్రాయడానికి ఎక్కడ తీరుబాటు దొరుకుతుంది? రెండు సంవత్సరాలు పంటలు సరిగా లేవు. ఆదాయం తగ్గిపోయింది. అమృతవల్లి రాకతో అదనపు ఖర్చు దివాణం మీద పడింది. నేను చాలా యిబ్బందిలో పడ్డాను. కాని రాజావారు కొంచెం కూడా పట్టించుకోలేదు. మనసంతా అమృతవల్లి మీదే ఉంది.

"స్వామిగారు! నేను అమృతవల్లికి సంగీత సాహిత్యాలు అబ్బుతాయా అని సందేహించాను. కాని, ఆమె సరస్వతి యొక్క అపరావతారం. ఆమె కంఠం ఎంత మధురమో నేను చెప్పలేను. పద్యంకాని, శ్లోకంకాని ఎంత చక్కగా చదువుతుందో! ఆమెకు 'కాళిదాసుడి మేఘసందేశం పాఠం చెప్తున్నానని శాస్త్రిగారన్నారు. నిన్నను అమృతవల్లి, మందాక్రాంత వృత్తాలు, ఒకటి తరువాత ఒకటి చదువుతుంటే విన్నాను. నా మనసు ఆనంద సాగరంలో తేలియాడింది'' అన్నారు వారు.

నాకు నవ్వు వచ్చింది.

"ప్రభువులు చాలాకాలమై అమృతవల్లి బంగళావేపే వెళ్ళలేదన్నారు. మరి, ఈ శ్లోకాలు ఎప్పుడు విన్నట్లు?"

"మీతో చెప్పడం మరిచిపోయాను. ఈమధ్య, నేను, రాత్రి చాలావరకు, సరస్వతీ మందిరంలోనే గడుపుతున్నాను''

"రాణీగారు మీతోలేరా?"

"లేరు... ఏదో పుస్తకం చదువుతూ ఉండి




పోయారు''

"అమృతవల్లి చదివిన శ్లోకాలు వినే భాగ్యం వారికి కలగలేదన్న మాట!" రాజావారు నవ్వేశారు.

కాని, నాకు దుఃఖమే కలిగింది. అమృతవల్లి మూలంగా దంపతులు ఒకరికొకరు దూరమవుతున్నారని నాకు అనుమానం కలిగింది. అమృతవల్లి కోటలోకి ప్రవేశించక ముందు, రాత్రివేళల్లో రాణీగారిని ఒంటరిగా విడిచిపెట్టలేదు. రాజావారు చెప్పిన మాటల బట్టి, వారు రాత్రి ఒంటిగంటవరకు అమృతవల్లి చదివిన శ్లోకాలు వింటూనో లేక ఆమె వీణా వాదనవింటూనో మైమరచిపోతున్నారు. సరస్వతీమందిరంలో, ఆరుబయట, వాలు కుర్చీవేసుకొని, ఏకాంతంగా అన్నీ వింటూ ఆనందిస్తున్నారు. ఇంతవరకు రాణీగారితో పాల్గొంటున్న ఈ సాహిత్య సంగీత విలాసాలలో, రాజావారు నేడు ఒంటరిగా... ఇవాళ, రాణీగారు ఎంత గొప్పవారో నాకు తెలిసివచ్చింది.

రాజావారు రోజూ ఆలస్యంగా శయన మందిరం చేరుతున్నారని ఆమె విచారించలేదు. ఆమె గతరాత్రి అన్న మాటలను రాజావారే చెప్పారు.

"మీకు సంగీత సాహిత్యాలయందు అపరిమితమైన ఆసక్తి అని నాకు తెలుసు. ఇంతవరకు వీటిలో ఎవరూ మిమ్మల్ని మెప్పించలేకపోయారు. చాలా పొద్దుపోయేవరకు మిమ్మల్ని మంత్రం వేసినట్లు కూర్చోబెట్టిన అమ్మాయి సామాన్యురాలు కాదు''

సాధారణంగా తన భర్త జీవితంలో మరే స్త్రీ ప్రవేశించినా, ఆ భార్య సహించలేదు. కానీ, రాణీగారు ఎంత ఉదారమైన బుద్ధి కలవారు!

రాజావారిని కూడా నేను అనలేకపోతున్నాను. వారు సరస్వతీ మందిరంలో అంత రాత్రివరకు ఉంటున్నట్లు ఎవరికీ తెలియదు. అమృతవల్లికి కూడా తెలియదు. తెలిస్తే అటువంటి పని ఆమె చేయదు. రాణీగారంటే ఆమెకు విపరీతమైన భక్తి.

రెండు సంవత్సరాలయి అమృతవల్లి చాలా శ్రద్ధగా సంస్కృతాంధ్రాలు, వీణ, గురువుల వద్ద నేర్చుకుంటున్నది. ఆ రత్నాన్ని సానపడుతున్న కొద్దీ ప్రకాశిస్తున్నది. ఈ రెండు సంవత్సరాలు రాజావారు ఆమెను చూడలేదు. ఆమె కూడా, రాజావారి కంటపడకుండా, రాణీగారిని దర్శించి వెళ్తున్నది.

కాని ఆమె రాజావారు, సరస్వతీమందిరంలో ఉన్నారని తెలిసి, వారి కోసమే అంత మధురంగా వీణ వాయిస్తున్నదా? గొంతెత్తి పాడుతున్నదా?

ఏది ఏదైనా, రాజావారు ధన్యులు. వారి కోరిక ఈడేరుతున్నది.

రోజులు ఇలా గడిచిపోతే బాగుండును.

ఇవాళ ఒక కొత్త సమస్య తలెత్తింది.

నెలకొకసారి లాంఛనప్రాయంగా సభ జరుగుతుంది. ఆ సభలో పుర ప్రముఖులుంటారు. రాణివాసపు స్త్రీలు తెర వెనుక కూర్చుంటారు. దర్బారు హాలులో ఈ సభ జరుగుతుంది. ఆ రోజు కవులు తమ కావ్యాలు వినిపిస్తారు. సంగీత విద్వాంసులు తమ ప్రతిభను ప్రదర్శిస్తారు. వారిని గౌరవించడానికి అన్ని ఏర్పాటులు జరుగుతాయి. వాటిలో రాజనర్తకి హేమాంగి నాట్యమొకటి.

హేమాంగి భరతుడి నాట్యశాస్త్రం క్షుణ్ణంగా అభ్యసించింది. ఆమె తల్లి కూడా రాజనర్తకిగా పేరుగాంచింది. ఆమె దగ్గిర హేమాంగి మార్గ, దేశీపద్ధతులలో నాట్యం నేర్చుకుంది. రాజావారికి జాయపసేనాని రచించిన నృత్తరత్నాకరం అభిమానగ్రంథం. ఆరోజు నాట్యం ముగిసిన తరువాత, హేమాంగికి కూడా బహుమతులిచ్చిన తరువాత, రాజావారు రాణీగారితో కూడి, ఆమెకొక పని అప్పగించారు.

అమృతవల్లికి జాయపసేనాని గ్రంథం



ప్రకారం, హేమాంగినిని నాట్యం నేర్పమన్నారు.

రాణీగారు ఆ కోరికను ఆమోదించారు.

ఏదో సందర్భంలో రాజావారు ఒక విషయం నాకు చెప్పారు.

తాము అమృతవల్లి విద్యకు ప్రాధాన్యమిస్తున్నట్లు, ఆమె సౌందర్యం గురించి ఎటువంటి ఆలోచనలు పెట్టుకోనట్లు చెప్పారు.

ఇది నిజం కూడాను.

సంగీత సాహిత్యాలను గోడ వెనుకనుండి విని ఆనందించవచ్చు. మరి, నాట్యం విషయంలో గోడవెనుక భాగోతం ఫలమీయదే. నాట్యమాడుతున్నప్పుడు లయబద్ధంగా మువ్వలచప్పుడు వినిపిస్తే తాము నర్తకి యొక్క వివిధ భంగిమలను ఊహించగలమనివారన్నారు.

ఎవరియందు, అమృతవల్లిని చూడడానికి ఆయన ప్రయత్నిస్తున్నారు?

నేనీ సలహాయివ్వాలని చాలాసార్లు అనుకున్నాను. కాని, వారి ధర్మనిరతి నాకా అవకాశం కలిగించలేదు. వారు రాజులు, ఎందరు స్త్రీలనైనా వారు వివాహమాడవచ్చు. ఎందుకీ ముసుగులో గుద్దులాట?

అమృతవల్లి మీద కోరిక, వారి మనసు యొక్క అడుగు పొరలలో నిద్రాణంగా ఉండి ఉంటుంది. కాని రాజావారు ధర్మాత్ములు, సత్యసంధులు, రాణీగారు సీతామహాదేవి వంటివారు... కాబట్టి వారు తమ కోరికను కేవలం రసానందానికే పరిమితం చేసుకున్నట్లు నాకనిపించింది.

అమృతవల్లిని నేను అంతహెచ్చుగా పరిగణించలేదు. ఇప్పటికి కూడా, ఆమె నారాయణరాజుగారి కుమార్తె... సంపన్నుడైన ఒక పౌరుడి కూతురు... అని నా మనసులో ఉంది. కాని, రాజావారిమీద ఆమె ప్రభావం ఎంత ఉందో మొన్ననే తెలిసి వచ్చింది.





నారాయణరాజుగారి రెండవ అమ్మాయి శ్రీలేఖ, పెళ్ళికి ఎదిగింది. ఆమెకు పెళ్ళికాదన్న బెంగతో ఆయన అమృతవల్లిని ఇంటి నుంచి తరిమివేశారు. ఒకసారి జీడిమరక అంటుకుంటే, సాధారణంగా విడిచిపెట్టదు. చుట్టుపట్ల గ్రామాలలోనే కాదు, జిల్లాలలో కూడా అమృతవల్లి గురించి వార్తలు వ్యాపించాయి. నారాయణరాజుగారి రెండవ పిల్లను చేసుకోడానికి సంపన్నులు ఎవరూ ముందుకు రాలేదు. సామాన్యుల అబ్బాయిలకు ఆమెను యిద్దామంటే వాళ్ళు కూడా మొగ్గలేదు. నారాయణరాజు దంపతులకు భయం పట్టుకుంది. మహాప్రయత్నం చేస్తే అమెరికానుండి ఒక పెళ్ళికొడుకు వచ్చాడు. అతను ఆధునికుడు. అక్కడే అతను చాలా పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. అతను పెళ్ళికూతుర్ని స్వయంగా చూడాలని పట్టుబట్టాడు. ఆచారాన్ని పెద్దవాళ్ళందరూ ఉల్లంఘించారు. పెళ్ళి కూతురిని పెళ్ళికొడుక్కి చూపించారు. అతను వేసిన ప్రశ్నలకు పిల్లచేత జవాబులు యిప్పించారు. అతనితోపాటు అతని తల్లిదండ్రులు కూడా వచ్చారు. పొద్దున్న పిల్లను చూసుకున్నారు. ముఖ్యంగా పెళ్ళి కొడుకు మెచ్చుకున్నాడు. జాతకాలు కుదిరాయి. దగ్గిరలో ముహూర్తాలు పెట్టించమని వాళ్ళు చెప్పారు. కాని, మధ్యాహ్నం పన్నెండు గంటలు కాకుండా, వారికి అమృతవల్లి గురించి తెలిసింది. నలుగురయిదుగురు పెద్ద మనుషులను కనుక్కుంటే వాళ్ళు కూడా ధృవీకరించారు. పన్నెండు కాకముందే సంబంధం తేలిపోయింది.

నారాయణరాజుగారు రక్తపు పోటుతో మంచంమీద పడిపోయారు. వారి భార్యకు అమృతవల్లిమీద అమితమైన ప్రేమ. పెద్ద కూతురుకి జరిగినది అన్యాయమని ఆమెకు తెలుసు. ఆమె ముందు వెనుకలాలోచించకుండా, ఇంట్లో పనిచేస్తున్న పిల్లచేత కోటలో నున్న కూతురికి కబురు పంపించింది. రాజావారు తప్ప మరొకరు సాయం చేయలేరని

ఆమె నొక్కినొక్కి చెప్పినట్లు పనిపిల్లను చెప్పమన్నారు. ఆ సమయానికి అమృతవల్లికి గోపాలశర్మగారు కొత్త కీర్తన నేర్పుతున్నారు. అయినా పనిపిల్ల అమృతవల్లికి వార్త నందజేసింది. అమృతవల్లి, తొందరగా ఒక కాగితంమీద సంగతి వ్రాసి, రాణీగారి దగ్గరికి పరిచారిక ద్వారా పంపింది. రాణీగారు వెంటనే ఆ కాగితాన్ని రాజావారికి పంపించారు. రాజావారు చాలా ముఖ్యమైన మీటింగుని వాయిదావేసి, వెంటనే రాణీగారిని తీసుకొని కారులో పెళ్ళి చూపులకు వచ్చిన వారి దగ్గిరకి వెళ్ళారు. వాళ్ళు తిరుగుప్రయాణానికి తయారవుతుంటే ఆపి, వాళ్ళందరికీ జరిగిన సంగతులన్నీ తెలియజేశారు. పెళ్ళికొడుకు నిజం తెలుసుకుని, రాజదంపతులకు ధన్యవాదాలు చెప్పాడు. అతని తల్లిదండ్రులు రాజావారి సరళస్వభావాన్ని మెచ్చుకున్నారు. సిరిపురంలో పెళ్ళి జరిపించడం కన్న ఏదేవుడి సమక్షంలోనో చేయించమని రాజ దంపతులు సలహా యిచ్చారు. మరో పదిరోజుల తరువాత ముహూర్తం పెట్టించుకొని మగపెళ్ళివారు వెళ్ళిపోయారు.

పెళ్ళి అయిన తరువాత రాజావారు నాతో అన్నారు.

"స్వామిగారు! ఒక మంచి పని చేయడానికి నా రాచరికం పనికివచ్చింది''

రాజా వారు ఎటువంటి మనిషి?

ఆ రాత్రి, అమృతవల్లి, తన దేవుడి గదిలోనున్న వేణుగోపాలస్వామి విగ్రహం ఎదుట కృష్ణకర్ణామృతం నుండి అయిదు శ్లోకాలు చదివింది. అయిదు భిన్న రాగాలలో వాటిని చదివింది. అదేమి రాగమో? సరస్వతీ మందిరంలో, వెన్నెలలో కూర్చున్న రాజావారు వింటూవివశులయారు. వారి తాతగారు కట్టించిన దేవాలయంలోని, రుక్మిణీ సత్యభామలతో కూడిన వేణుగోపాలుడు వారి యెదుట సాక్షాత్కరించి నట్లయింది.

"స్వామిగారూ ఇంతకన్న కృతజ్ఞతలు వేరే రూపంలో చెప్పుకోవాలా?"

ఈమధ్య రాణీగారి ప్రవర్తనలో మార్పులు కనిపిస్తున్నాయి. నా అనుమానం నిజమా. భార్యాభర్తలమధ్య మాట పట్టింపులు వచ్చాయా? రాణీగారు ప్రతివారం శ్రద్ధగా ఆలయానికి పోయి వస్తున్నారు. ఆలయంలో ఎవరో రామాయణం పురాణ పఠనం చేస్తే ప్రతి సాయంకాలం వెళ్ళి, రాత్రి తొమ్మిదికి తిరిగివస్తున్నారు. అప్పుడప్పుడు వారు చేసే దానధర్మాలు పరిమితి దాటిపోతున్నాయి. ఈ సంగతి రాజావారికి తెలుసా? తెలిసినా ప్రయోజనం లేదు. అయినా ఉండబట్టలేక ఒకసారి వారి చెవినివేశాను.

ఆయన నవ్వుతూ అన్నారు.

"మా తరువాత ఈ ఆస్తిని అనుభవించే వారెవరూ లేరుకదా?"

"ప్రభువులు అలా అంటే ఎలా? మంచి కుటుంబంనుంచి ఒక పిల్లాడిని తెచ్చి దత్తత చేసుకోమని మీతో చాలాసార్లు మనవి చేసుకున్నాను. మన ఆస్తులు ప్రభుత్వానికి కలిసిపోకూడదు''

"స్వామిగారు! ప్రభుత్వమంటే ఎవరు? వారు మనప్రజలే. మన ఆస్తి ప్రజలనుండే వచ్చింది. వారికే తిరిగి వెళ్ళిపోతుంది''

అంత ఉదాత్తమైన అభిప్రాయాలు కల వారాయన.

రాణీగారి అభిప్రాయం అంతకన్న భిన్నమయినది కాదు.

చాలాకాలమయి రాజావారు సిరిపురం వదిలి పై వూళ్ళకు పోలేదు. రాణీగారు తీర్థయాత్రలకు పోయివద్దామన్నారు. రాజ దంపతులతో మరో పదిమంది ఆప్తులు బయలుదేరారు. దాసదాసీజనం మరో ఆరుగురు. వంటమనిషి, పురోహితుడు. వెరసి యిరవైమంది. వారందరికోసం ఒక మొదటితరగతి టూరిస్టుకోచ్ ఏర్పాటుచేశాను. దిగిన చోట్ల సదుపాయాలు చేయడానికి మరో అయిదు మందిని పంపించాను. మనుషులను

పంపించడం బాగానే ఉంది. కాని, వారికింద అయే ఖర్చులను భరించడం చాలా కష్టమని పించింది. అది దివాణం సొమ్మే కావచ్చు. ఒక రెండు నెలలు రాజదంపతులు ఉత్తర భారతయాత్రలు చేసి వచ్చేసరికి అయిదు లక్షల రూపాయలు ఖర్చయింది.

నిధులు తక్కువగా ఉన్నాయని రాజావారితో మొరపెట్టుకున్నా ప్రయోజనం లేకపోయింది.

రాజావారు తమతోపాటు అమృతవల్లిని కూడా యాత్రలకు రమ్మన్నారు. కాని, ఆమె వినయంగా రాలేనని చెప్పింది. ఈ సరికి అమృతవల్లి చాలా ప్రాజ్ఞురాలైంది. ఆమె కింద ఖర్చుచేయవలసిన పైకం అయిదు వేలు దాటకుండా నేను జాగ్రత్తపడ్డాను. రాజుల సొమ్ము సేవకులపాలు. అమృతవల్లి తిన్నదెంత, కట్టినదెంత! ఆమె సేవలకై నలుగురు దాసీలు, ఒక వంటమనిషి, వాళ్లందరూ ఆమె యింటే భోజనంచేస్తారు. ఆ యింటనే రాత్రిపూట కూడా పడుకుంటారు. ఆమెకయే ఖర్చుకన్న వీళ్ళ జీతాలే హెచ్చు. రాజావారు తీర్థయాత్రలకు పోయినప్పుడు, నేను వీరికింద పొదుపుగా వ్యయం అయేటట్లు చూశాను. దానికి అమృతవల్లి ఆక్షేపణ తెలుపుతుందని అనుకున్నాను. కాని, అటువంటిదేమీ జరగలేదు.

రాజావారు లేనికాలంలో, చదువు విషయంలో అమృతవల్లి కొంచెం స్వతంత్రం వహించి, మరికొన్ని కొత్త ప్రబంధాలతో పాఠాలు చెప్పించుకుంది. ఆముక్తమాల్యద తోపాటు అమరుశతకం, బిల్హణీయం వంటి కావ్యాలు కూడా తెప్పించుకుంది. సంగీతంలో కూడా హిందుస్తానీ రాగాలు అభ్యాసంచేసింది. అన్నిటికన్న నాట్యంలో క్షేత్రయ్య పదాలను అభినయించడం నేర్చుకుంది.

రాజారావు మార్చి మూడోవారంలో యాత్రలకు బయలుదేరి మే నెల నాలుగోవారంలో సిరిపురం తిరిగి వచ్చారు. అప్పటికి ఎండలు బాగా ముదిరాయి. కందకంలో నీళ్ళు ఎండిపోయాయి. పట్టణంలో పార్కులు కళావిహీనంగా తయారయాయి. స్టేషను నుండి కారులో కోటకు తిరిగి వస్తున్న రాణీగారు ఈ అశ్రద్ధను గమనించారు.

ఒక వారంరోజులు రాజదంపతులు విశ్రాంతి తీసుకున్నారు. రాజావారు ఏ మీటింగులలోను పాల్గొనలేదు. ఒకనాడు ఉదయం పదిగంటలకు నేను ఆఫీసుకు చేరుకోగానే నన్ను తీసుకొని కారుమీద బయలుదేరారు. కందకంలో తామరపూలు నాశనమయాయి. కందకంలోతు పదహారడుగులు. దాని అడుగుభాగంలో నీటి చెమ్మ కూడాలేదు. కోట చుట్టూ రాజావారు కారు నడిపించారు. పట్టణం వీధులలో చెత్తపేరుకుంది. పార్కులలో చాలా మొక్కలు చచ్చిపోయాయి. ఒక పార్కులో చాలారకాల గులాబులున్నాయి. అవి ఎండాకాలంలో పూస్తాయి. అవి పోషణలేక నామమాత్రావశిష్టంగా మిగిలాయి. మేము కోటకు తిరిగి వచ్చేసరికి పన్నెండయింది. ఎండ తీవ్రంగా ఉంది. గాడ్పు వీస్తున్నది.

రాజావారి ముఖం ఎర్రబడింది. వారు తిన్నగా మీటింగు హాలుకు నడిచారు. పట్టణంలో పారిశుధ్యం చూసే ఇనస్పెక్టరును, టౌన్ ప్లానింగ్ ఆఫీసరును పిలిపించారు. వాళ్ళు, మరికొందరు అధికారులు రాజావారు లోపలికి రాగానే లేచి నిలుచున్నారు.

రాజావారు చాలా నెమ్మదిగా మాట్లాడారు.

"రెండు నెలల క్రితం మేము తీర్థయాత్రలకు పోయేముందు, పట్టణంలో ప్రతివీధి, ప్రతిపార్కు చూశాము. వీధులు అద్దాలవలె కనిపించాయి. పార్కులు నందన వనాలుగా దర్శనమిచ్చాయి. కందకంలో పద్మ పత్రాలు, తామరపూలు నయన మనోహరంగా మా మనసులను దోచుకున్నాయి. యాత్రలు ముగించి వచ్చిన తరువాత, ఈరోజు మళ్ళీ




వీటినన్నిటిని చూసి వచ్చాము. ఊహించలేనంత ఘోరంగా పార్కులు మాడిపోయాయి. కందకం పూర్తిగా ఎండిపోయి, తామర తంపర నామరూపాలు లేకుండా నాశనమయింది. మేము సిరిపురంలో లేని ఈ రెండు నెలలూ, మీరెవరూ యిళ్లు విడిచి వీధులలో తిరిగినట్లు లేదు. మీరు మీ పనులు సక్రమంగా చేస్తే, పరిస్థితి యింత అధ్వానంగా పరిణమించదు. వీటినన్నిటినీ పూర్వ పుస్థితికి మరో రెండు నెలల్లో తీసుకురావాలి. మీరు చాలా కారణాలు చెప్పడానికి సమర్థులు. కాని, నేను వినదగిన స్థితిలో లేను. కందకంలో నీరు నింపే పంపులు చెడిపోయాయని, పార్కులలో పనిచేసే తోట మాలీలు జబ్బుపడ్డారని మాకు తెలుసు. కొత్త పంపులు ఎప్పుడూ మీకు అందుబాటులో ఉండేటట్లు మేము ఏర్పాటులు చేశాం. ఆ విధంగానే పార్కుకి ఇద్దరు తోటమాలీలు సరిపోని చోట, మరో ముగ్గురిని అదనంగా ఉద్యోగాలలో చేర్చుకున్నాం. మేమిచ్చిన గడువులో ఈ పనులన్నీ పూర్తికావాలి. అంతకుమించి అధికంగా నేను చెప్పదలచుకోలేదు. మీరందరూ వెళ్ళిపోవచ్చు, దివాన్‌జీగారితోసహా''

రాజావారు కోపాన్ని అదుపులోకి తెచ్చుకున్నారు. వారికి పూవులంటే ప్రాణం. తామరపూవులంటే చెప్పలేని యిష్టం. పట్టణంలో అంటువ్యాధులు వ్యాపించకుండా చాలా ముందు జాగ్రత్తలు తీసుకునే వారు ఆయన. బహిరంగంగా ప్రజలను ప్రేమిస్తున్నారని చెప్పరు. కాని, ప్రజాక్షేమమే వారి ధ్యేయం.

రాజావారి కోపతాపాలు ఎంతసేపుంటాయి?

వారు అంతఃపురానికి భోజనానికి వెళ్ళారు. కాళ్ళూ చేతులూ కడుక్కొని, కొంతసేపు రాణీగారితో మాట్లాడి, ఉభయులు భోజనశాలలోకి ప్రవేశించారు.

రాజావారి భోజనశాల చాలా ప్రత్యేకమైనది. రాజదంపతులు టేబిలు మీదే భోజనాలు చేస్తారు. వెండి పళ్ళాలు, గ్లాసులు, గిన్నెలు ఉండనే ఉన్నాయి. విశాలమైన గదిలో, టేకు కర్రతో నగిషీలు చెక్కిన టేబిలు, పనివాడితనం ఉట్టిపడే కుర్చీలు అక్కడ ఉంటాయి. దంపతులు సావకాశంగా, ఏ ఉద్రిక్తలు లేకుండా, భోజనం చేస్తారు.

రాజావారు కుర్చీలో కూర్చున్నారు. వారికి ఎదురుగా టేబిలు మీద, గుల్‌దస్తాలో గులాబీ పూవులు గుత్తికట్టి ఉన్నాయి. కొన్ని సహజమైన గులాబి రంగులోను, కొన్ని లేత పసుపులోను, కొన్ని గాఢమైన ఎరుపులోను, చాలా తాజాగా కనిపించాయి.

"అమృతవల్లి ఇప్పుడే వచ్చి వెళ్ళింది. బంగళా తోటలో గులాబీలను కోసి, గుత్తిగా కట్టి, గుల్‌దస్తాలో అమర్చి వెళ్ళింది. ఆమెకు పువ్వులంటే ప్రాణం, గులాబీ మొక్కలను పెంచడం ఆమెకే తెలుసు'' అన్నారు రాణీగారు.

రాజావారి కన్నులు చెమ్మగిల్లాయి. ఎండ పడి వచ్చినవారు శ్రమ అంతా మరచిపోయారు.

"ఆమె అమృతవల్లి కాదు, అమృతాత్మ! మన అధికారులు ఆమెవలె పువ్వులను ప్రేమిస్తే, పార్కులలోని మొక్కలు, కందకంలోని తామర పువ్వులు మనకు స్వాగతం చెప్పేవి''

ఈ సంగతి జరిగిన రెండు రోజుల తరువాత రాజావారు యథాప్రకారం సరస్వతీ మందిరానికి వెళ్లారు. బయట లానులో సోఫా వేయించుకున్నారు. కొంచెం మగత పట్టినట్లయి కన్నులు మూసుకున్నారు.

తరువాత ఒక్కసారిగా వారికి తెలివి వచ్చింది. వారి శరీరం చెమటతో తడిసిపోయింది. పైన వేసుకున్న కండువాతో ముఖం తుడుచుకున్నారు. వీణతీగలు సవరించిన ధ్వని వినవచ్చింది. పిమ్మట అమృతవర్షిణి రాగాలాపన వీణ మీద వాయిస్తున్నది అమృతవల్లి. క్రమక్రమంగా దీక్షితుల వారి కృతి

తారాస్థాయికి చేరుకుంటున్నది. చివరకు 'వ ర్షయ, వర్షయ' అన్న ఆఖరి చరణం ఆమె వాయిస్తున్నది. సకలేంద్రియాలు శ్రవణాలై రాజావారు వీణావాదన వింటున్నారు. వారు కాలం మరచిపోయారు. తానెక్కడనున్నది మరచిపోయారు. తానెవరయినది మరచిపో యారు. ఊహించలేని దివ్యలోకాలలో అమృత ధారలలో స్నానం చేస్తున్నారు. ఆ శరీరానికి తాపంలేదు. అంతా ఆనందమే. అంతా అమృతమే. వారికి తెలివి వచ్చేనరికి, ఆకాశం మీద తోచిన మేఘం ఆనందాశ్రువు లను వర్షిస్తోంది.

ఈ మహదానందాన్ని ఎవరు నిర్వచించ గలరు.

ఈ విషయం రాజా వారు నాతో చెప్పిన ప్పుడు నమ్మలేకపోయాను. వీణ వాయిస్తే వర్షం పడుతుందా?

నిజానికి, అమృతవల్లి వీణా వా యించింది, వర్షమూ పడింది.

అమృతవల్లి కోటలో ప్రవేశించి ఎనిమిది సంవత్సరాలయింది. ఆమె స్థిరపడిన కొద్ది నెలలలోనే సాహిత్యానికి ఒక గురువు, సంగీ తానికి మరొకరిని నియమించవలసి వచ్చింది. ఒకొక్క గురువుకు నెలకు రెండు వేలు చొప్పున చెల్లిస్తున్నాము. అంతేకా కుండా నాట్యం నేర్పే చిట్టిరాజుకి మరో రెండువేలు. వెరసి ఆరు వేల రూపాయలు. ఆమె కింద పదివేల రూపాయల వరకు రాజా వారు ఖర్చు చేయమన్నారు. అందుచేత అమృతవల్లి యింటి ఖర్చులకు నాలుగు వేలు మాత్రమే వెచ్చించవలసి వచ్చింది.

అమృతవల్లికి డబ్బుతో సంబంధంలేదు. ఆమె ఎప్పుడూ తన వారికోసం తాపత్రయప డలేదు. చెల్లెలి పెళ్లయిన తరువాత ఆమె తల్లిదండ్రులు సిరిపురం నుండి కాపురం ఎత్తివేశారు. ఏడాదికి ఒకసారైనా వాళ్లు కో టకు వచ్చి పెద్దకూతురిని చూసిన పాపాన పోలేదు. అమెరికా నుండి ఆమె చెల్లెలి భర్త రాజావారికి రెండు నెలలకో ఉత్తరం రాస్తాడు. అతనికి తెలుగురాదు. రాజావారు రాణీగారికి దానిని చదివి వినిపిస్తారు. రాణీగారిద్వారా అమృతవల్లి ఆ సంగతులన్నీ తెలుసుకునేది. ఆ చెల్లెలికి యిద్దరు పిల్లలు. వాళ్లు అమెరి కాలో జన్మించడం చేత అక్కడి పౌరసత్వం వారికి లభించింది. ఆ పిల్లల పుట్టిన దినా లకు శుభాకాంక్షలు పంపడం నా పని. అది మరచిపోడానికి వీలులేదు. ఈపాటి చిన్న పని చేసినందుకు నాకు మంచి ప్రతిఫలమే ముట్టేది. అమెరికా అతను ప్రతి సంవ త్సరం చాలా విలువైన డైరీ రాజావారికి పంపించేవాడు. వారు నాకు యిచ్చేవారు. ఈ డైరీలన్నీ అమెరికానుంచి వచ్చినవే.

తీర్థయాత్రలనుండి తిరిగి వచ్చిన దగ్గిర నుంచీ రాణీగారు భక్తి మార్గంలో పడ్డారు. ఏకాదశులకు, పున్నములకు ఉపవాస ముంటారు. వారి దానధర్మాల ఖర్చు రోజురో జుకి పెరుగుతోంది. రాజావారి ఆస్తికి సరిపడి నంత అప్పు పెరిగితే ఇంకేం మిగులు తుంది? అటువంటి విషయాలు ఆలోచించడా నికే భయంగా ఉంది.

కొంతమంది దాసీలను, అనవసరమైన సేవకులను తీసివేద్దామని రాజావారితో చె ప్పాను. కోటలో గంటలు కొట్టేవాడు, సంధ్యా సమయాలలో నగారా వాయించేవా ళ్లు, తీరికగా ఆస్తిని కబళించే రెండు ఏనుగు లు, ఆశ్రితులు, భట్రాజులు- ఇటువంటి వారి కింద పెట్టే ఖర్చు తగ్గించమని రాజావారికి సలహా యిస్తునే ఉంటాను. వారు అన్నీ వింటారు. కాని ఏం ప్రయోజనం రవంతైనా పట్టించుకోరు.

ఉపవాసాల వలన, స్నానాల వలన రాణీ గారి ఆరోగ్యం కొంచెం దెబ్బతింది. ఆయుర్వేద వైద్యులు, డాక్టర్లు పరీక్ష చేశారు. విశ్రాంతి అవసరమన్నారు. అమృతవల్లి రోజూ వచ్చి ఆమెను చూసి వెళ్తున్నది.

లక్ష్మీనారాయణశాస్త్రిగారు అమృతవల్లికి





అమరు శతకం పాఠం చెప్తున్నారు. పంచ కావ్యాలు అయిపోయాయి. కౌముది అయిపోయింది. ఇప్పుడు అలంకార శాస్త్రం చెప్తున్నారు. విశ్వనాథ కవిరాజు రచించిన సాహిత్య దర్పణం ప్రమాణంగా చేసుకున్నారు. దానితోపాటు అమరు శతకం కూడా చదివిస్తున్నారు.

రాణీగారికి ఒంట్లో బాగుండక పోవడంతో రాజావారు సరస్వతీ మందిరానికి రాకపోకలు తగ్గించారు. ఎప్పుడూ ధర్మపత్నితోనే ఉంటున్నారు. ఒకనాటి రాత్రి రాణీగారు నిద్ర పోతున్నారు. ఆరోగ్యం కొంచెం కుదుటపడింది. సాయంకాలం వేణుగోపాలస్వామి వారి ఆలయంలో పూజలు చేయించి, భోగం పంచి పెట్టారు. అంతఃపురం చేరుకోగానే ఫలహారం చేసి నిద్రపోయారు. రాజావారికి మాత్రం నిద్రరాలేదు. శయనమందిరంలో ఆయన పచారులు చేశారు. గదిలో దీపం మందంగా వెలుగుతోంది. రాణీగారు ప్రశాంతంగా నిద్రపోతున్నారు. సరస్వతీ మందిరం అంతఃపురానికి నూరు గజాల దూరంలో ఉంది. పున్నమి రాత్రి.

రాజావారు ఏదో ఆలోచిస్తూ సరస్వతీ మందిరం వేపు నడిచారు. మందిరం ఆవరణలో ఒక పారిజాతపు చెట్టుంది. అది విరగబూచింది. దానినుండి మధురమైన పరిమళం గాలిలో తేలి వారికి స్వాగతమిచ్చింది.

రాజావారు వరండాలో కుర్చీలో కూర్చున్నారు.

బంగళాలో పూల చెట్లమధ్య ఒక తిన్నె ఉంది. పున్నమి వెన్నెలలో అమృతవల్లి తిన్నె మీద కూర్చుంది. అప్పటివరకు పగలు చెప్పిన పాఠం చదువుకుంది. పుస్తకాలు మూసేసి తోటలోకి నడిచి తిన్నె మీద ఆసీనురాలయింది.

అమరు శతకంలో మొదటి శ్లోకం సమాస బంధురమైనది. 'జ్యాకృష్టి బద్ధ కటకాముఖ పాణిపృష్ట...' ఈవిధంగా క్లిష్టమైన పదాలతో నడుస్తుంది. అది పార్వతీ దేవి స్తుతి, అమృతవల్లి ముఖంనుంచి ఆ ప్రార్థనా శ్లోకం అర్థవంతంగా, నాద మధురంగా, రమ్యాతిరమ్యంగా వెలువడింది. ఆ శ్లోకమంటే ఆమెకు యిష్టమేమో! రెండోసారి ఆ శ్లోకమే ఆమె చదివింది.

పిమ్మట శ్లోకం తరువాత శ్లోకం... అన్నీ పంచదార గుళికలే. రాజావారు మేను మరచి వింటున్నారు.

"గాఢాలింగన వామనీ కృతకుచ..."

ఆ శ్లోకం వింటూ వారు పరవశులయారు. ఆ శ్లోకమే, మరోసారి, మెల్లగా ఆమె చదివింది.

గాఢంగా తనను కావలించుకున్న ప్రియురాలు తనలో ఐక్యమయిందా అని ప్రియుడు భావిస్తాడు.

మరి కొద్దిసేపటిలో ఆమె శ్లోకాలు చదవడం ఆపి లోనికి వెళ్లిపోయింది. బహుశా అంతవరకే పాఠం అయింది కాబోలు!

రాజావారు శయన మందిరం చేరేసరికి తమ వశంలోలేరు. అమృతవల్లి చదివిన శ్లోకాలు వారి చెవులలో అంత మధురంగాను మోగుతున్నాయి.

రాజావారు తమ మంచం మీద పడుకున్నారు. వారి ఆలోచనలనిండా అమృతవల్లి.

తొలిసారి రాజావారు అమృతవల్లి ముఖంలోకి చూస్తూ, ఆమె చూపులు తమ హృదయపు లోతులకు పోయినప్పుడు వారు పొందిన అనుభూతి కొంతకాలం మరుగున పడ్డా, ఈ పూర్ణిమానిశను పునరుజ్జీవనం పొందింది. గవాక్షం నుండి మెత్తటి చంద్రకిరణాలు వారి శరీరాన్ని తాకినప్పుడు పులకలు లేచాయి.

అమృతవల్లి కోటలో చేరి ఎనిమిది సంవత్సరాలయింది. మొట్టమొదటి రోజు ఆమెను సాకాంక్షగా చూశారు. కొద్దికాలం ఆమెను చూసినా వారు అంతగా చలించలేదు. తరు

వాత ఆమె అతని కంటపడలేదు. ఆనాటి అమృతవల్లి యొక్క దీనవదనం కాదుకాదు... లజ్జావనతమైె కాదుకాదు... హృదయ కవాటాలు తెరచుకుని శాశ్వతంగా పీఠం వేసుకున్న ఆమె రూపాన్ని అతను ఎలా మరచిపోగలరు?

ఈనాటికి ఆమెకు ఇరవై నాలుగు సంవత్సరాలు వస్తాయి. అమృతవల్లి శరీరసౌందర్యం ఎటువంటి పోకడలు పోయిందో వారికి అంతుపట్టలేదు. ఆమె కంఠం, ఆమె కాలికి కట్టిన గజ్జలు చేసే మ్రోత, వీణా తంత్రులపై ఆమె సుకుమారమైన వేళ్ళు చేసే విన్యాసం ఇవే వారికి తెలుసు. ఆటపాటలలో ఆమె రోజురోజుకి పైకివచ్చినట్లే, ఆమె సౌందర్యం కూడా వృద్ధి పొందుతూనే ఉంటుంది. ఇది ఎవరూ దాచలేని నిజం.

ఈ ఆలోచనలలో వారికి నిద్రపట్టింది.

రాజావారు స్వప్నలోకంలో విహరిస్తున్నారు. పూలపందిళ్ళు- విరబూచిన గులాబీలు- వాటిమధ్యనొక షోడశవర్ష ప్రాయంలోని యువతి- ఆమె కాలి గజ్జల మోత లయబద్ధంగా వినిపిస్తోంది. కాళ్ళ గజ్జెలలో వీణా



ధ్వని ఎలా వస్తుంది? ఆ లోకంలో అన్నీ సంభవాలే. ఆ ప్రమదావనంలోని పుష్పాలు ఆ నాదానికి పులకిస్తున్నాయి. పువ్వులు పులకిస్తాయా? వాటి రంగులు ఒక క్షణం కాంతివంతాలై, ఒక క్షణం కదలిక లేక, మరుక్షణమే తలలూపుతుంటే మరేమనాలి? ఆ పూవు లేకాదు, చరాచర ప్రకృతి అంతా పులకిస్తుంది, అడుగడగున డమరు ధ్వని.

రాజావారు స్వర్గలోకంలో విహరిస్తున్నారు. అక్కడ అన్నీ అద్భుతాలే. మేలిముసుగుతో ఒక సుందరి. ఆ పలుచని తెర మందాకినీ తరంగాలను కదిపి వచ్చిన గాలి పిల్లలకు స్వాగతమిస్తుంది.

ఆ తెర తొలగిపోయింది.

తెర వెనుకనుండి బైటపడ్డముఖం మేఘం చాటునుండి వెలువడిన పూర్ణిమా శశి. ఆమె షోడశి. ఆ ముఖం, ఆ విశాలమైన కనులు, ఆ లోతైన చూపులు, ఆ సంపెంగ వంటి ముక్కు, దొండపళ్లవంటి పెదవులు, శ్రీకారం చుట్టిన చెవులు, బుగ్గలలో గులాబులు - ఇవన్నీ తనకు పరిచయమైనవే, ముఖం కూడా వారి హృదయంలో గాఢంగా చెక్కినదే.

రాజావారు అలా చూస్తున్నారు.

ఆమె కట్టిన పలుచని చీరలోంచి సొష్టవమైన శరీరం కనిపిస్తుంది. ఆ శరీరం కూడా తమకు చాలా పరిచయమైనదే, తమ బాహువులలో నలిగినది, పీనవక్షం, గురునితంబాలు, పేరుకే ఉన్న నడుము, రంభోరువులు... ఇవన్నీ అనాచ్ఛాదితాలై, వివృత జఘన అయి తమ ఎదుట ఆమె నిలిచింది.

ఆమె నవ్వుతున్నది, ఆ నవ్వు శరీరానికి సంబంధించినది. ఆ ముఖం నుండి వెలువడుతున్న చూపులు వేయి వలపులను వెల్లడి చేస్తున్నవి.

ఈ షోడశి రెండు గుణాల మిశ్రమం. ఆమె ముఖంలో సాత్విక భావాలకు చోటుందా? ఆ అంగ ప్రత్యంగ సౌష్టవంలో రాజస భావమా? ఈ రెండిటి సమ్మేళనమా ఆ శరీరం? తమను ఆహ్వానిస్తున్నదది. తమ హృదయ దౌర్బల్యాన్ని సవాలు చేస్తున్నదది.

అంతా ఒక్క క్షణంలో జరిగింది. ఆమె తానుగా వారిని కౌగిలించుకుందో, లేక వారే ఆమెను బాహువులలో బంధించారో! ఎన్ని జన్మల అనుబంధమిది? ఎక్కడిదీ అతిలోక సుఖం?

వారికా శ్లోకం వినిపిస్తున్నది.

గాఢాలింగన వామనీకృత కుచ ప్రోద్భి
న్నరోమోద్గమా
సాంద్ర స్నేహరసాతిరేక విగళత్ కాంచీ ప్రదే
శాంబరా
మా! మా! మానద! మాతి మాయలమితి
క్షామాక్ష రోల్లాసినీ
సుప్తాకిం ను? మృతాను కిం? మనసి మే
వీనా విలీనానుకిం?

ఆ సుఖం శాశ్వతంగా...
అంతలో వారికి తెలివి వచ్చింది.
అంతటా చూశారు.

ఆకాశగంగలోని కాంచన పద్మాలులేవు
మెరిసే రత్నపు పొదగల సైకతాలు లేవు
రాజావారు దిగ్భ్రమచెంది చూస్తున్నారు.
రాణీగారు లేచారు.

ఆమె బయటికి వెళ్లివచ్చారు.

"ఎంత చక్కని వెన్నెల? పారిజాతపు పూలవాసన ఎంత సుకుమారంగా వస్తోంది! ప్రభువులు..."

అంతవరకు పలికి ఆమె ఆగిపోయారు.
రాజావారి శరీరం చెమటతో నిండిపోయింది.

వారి మాటలు తడబడుతున్నాయి.

"దేవీ! మీకెంత అపచారం జరిగింది! నేనెంత నిర్లజ్జగా ప్రవర్తించాను!"

రాణీగారు వచ్చి భర్త మంచం మీద కూర్చున్నారు.

నిద్రలో సేదదీరిన రాణీగారి ముఖం,




ఉదయపు వేళ రేకులు విడిన తామరపూవు వలె కనిపిస్తోంది. ఆ మనోజ్ఞమైన వదనాన్ని చేతులలోకి తీసుకొని, మృదువుగా పెదవుల పై చుంబించారు.

మళ్లా రాజావారి కదలికలో మార్పు.

"దేవీ! నేను క్షమించరాని నేరం చేశాను. ఈ ధర్మలోపం సహించ దగినదికాదు''

రాజావారు ఉద్రేకంతో కంపిస్తున్నారు.

'ప్రభువులు ఆవేశపడకండి. నేను మీ సహధర్మచారిణిని. మీ కష్టాలలోను, సుఖాల లోను పాలుపంచుకోవలసిన దానిని. మీకు నా యందు గల ప్రేమకు సమానమైన ప్రేమ మీయందుగలదానిని. మీ స్వభావం, నా స్వభావం ఒకే విధమైనవి. చెప్పండి... మిమ్మల్ని ఇంత కలవరపరచిన విషయ మేది?"

రాణీగారు రాజావారి వక్షంమీద ముఖ ముంచుకున్నారు. కొంచెం తలెత్తి గోముగా భర్త తలపైని ముంగురులలోంచి వేళ్లు పోని చ్చారు.

రాజావారు మెల్లమెల్లగా తాము కలలోక న్న రమణీయమైన సుందరి గురించి చెప్త న్నారు. తాము స్వప్నంలో కనిన దృశ్యాల గురించి చెప్తున్నారు. షోడశ వర్ష సుకుమార మైన ముఖాన్ని, ప్రౌఢమైన శరీర యష్టిని వర్ణిస్తున్నారు. అంత మధురంగాను తమ అనుభూతిని వివరిస్తున్నారు.

రాణీగారు ఆ కథనం వింటూ మేను మరచిపోతున్నారు. రాజా వారిని కౌగిలించు కుంటున్నారు, గాఢంగా చుంబిస్తున్నారు, పీ నవక్షంతో పీడిస్తున్నారు, లాలిస్తున్నారు, చలించిపోతున్నారు.

రాజావారు సంస్కృత శ్లోకం పూర్తి చేసే సరికి ఆమె కళ్లల్లో వింత కాంతి తొణికిసలా డింది. వాంఛ ప్రస్ఫుటమయింది.

రాజావారు అంతకు పదిరెట్లు ఉద్రిక్తుల యారు. వారికి కలలో సాక్షాత్కరించిన సుందరి రాణీగారి యందు కనిపించింది. కోరిక పరవళ్లు తొక్కింది.

ఆ సంగమ సుఖం శాశ్వతంగా ఉండిపో తే బాగుండుననిపించింది.

మధురమైన పద్మగంధం గదిలో తేలియా డింది.

కపోతాల కువకువలు శ్రవణ పేయాల యాయి.

రాణీగారు కలువ కాడవలె నలిగిపోయా రు.

రాజావారు ప్రశాంతంగా నిద్రపోయారు.

రాజ దంపతులు ఉదయం ఆలస్యంగా లేచారు.

రాజావారు, రాణీగారు స్నానాలు ము గించారు. పూజా పునస్కారాలు పూర్తిచేశా రు. వారిద్దరూ హాలులోకి వచ్చారు. సోఫాలో పక్కపక్కల కూర్చున్నారు.

వంటమనిషి అల్పాహారాన్ని టేబిలు మీద వడ్డించడానికి అనుమతి కోరింది.

రాజావారు రాణీగారి ముఖంలోకి చూస్తూ అన్నారు...

"ఈనాడు నేను ఉపవాసముండదలచా ను''

"ప్రభువులు ఉపవాసముంటే నేను భుజి స్తానా? వెంకాయమ్మగారు! నాకు కూడా వద్దు''

"దేవీ! మీరు యిప్పుడే కోలుకుంటున్నా రు. ఉపవాసం మీకు ఇంకా నీరసం కలిగి స్తుంది''

"ఒక రోజుకు మరేం ఫరవాలేదు''

"కనీసం పండ్ల రసమేనా తీసుకోరా?"

"ప్రభువులు తీసుకుంటే నేనూ పుచ్చు కుంటాను''

రాజావారు నవ్వారు. వెంకాయమ్మగారు లోనికి వెళ్లిపోయారు.

"దేవీ! పాపప్రాయశ్చిత్తానికని నేను ఉప వాసముంటున్నాను. మీరు ఏ పాపం చేయలే

దుకదా!"

"మీరు చేసిన పుణ్యంలోను, పాపంలోను నా భాగం నాకుంది. ఇంతకూ మీరు చేసిన పాపమేమిటి?"

"కలలో చేసిన తప్పుకు నిష్కృతిలేదు''

రాణీగారు నవ్వారు.

"దేవీ! నా జ్ఞాపకాల అడుగున ఈ కోరిక ఇప్పటికి కూడా ఉన్నట్లుంది. దానికి అనుకూలమైన కాలం కలిసి రాగానే, నన్ను మోహంలో ముంచెత్తింది''

"ప్రభువులు శారీరకంగా ఈ పాపం చేయలేదు''

"దేవీ! మనసులో కూడా ఇటువంటి మలినమైన ఆలోచన ఉండకూడదు. ఇది వ్యభిచారంతో సమానమే''

"మనం మానవులం. వేటికీ అతీతులం కాము. తప్పులు అందరూ చేస్తారు. కానీ తప్పును తెలుసుకున్న వాళ్లెంతమంది?"

"దేవీ! మీ హృదయం చాలా విశాలమైనది. మరొకరు మీ స్థానంలో ఉంటే నన్ను ద్వేషించి, దూరమవడానికి కూడా ఆలోచించరు''

"శ్రీరాముడి వంటివారు మానవ సహజాలైన తప్పులు చేశారు. తమ తప్పులను గుర్తించి ధర్మపథంవేపు నడిచారు. మీరు నా శ్రీరామచంద్రులు''

రాజావారు సీతారామచంద్రులే.

ధర్మజ్ఞులు, సత్యసంధులు, ఆనాటినుంచీ వారు సరస్వతీ మందిరం గడపలో పాదం మోపలేదు.

ఆ సంగతి అమృతవల్లికి తెలుసా?

ప్రతిరాత్రి తానాడిన ఆటలు, తాను పాడిన పాటలు, తాను చదివిన శ్లోకాలు, తాను వాయించిన వీణ వినడానికి రాజావారు సరస్వతీ మందిరానికి రారని ఆమెకు తెలుసా?

రాజావారు ఏదో సందర్భంలో అమృతవల్లి వైదుష్యాన్ని మెచ్చుకుంటున్నారు.

నేను వారినో ప్రశ్న వేశాను బహుశా ఇది ఎన్నోసారో!

"మీరు వినాలని అమృతవల్లి ఈ పనులన్నీ చేస్తున్నదేమో! అది నిజమా?"

"స్వామిగారు! అమృతవల్లిని అర్థం చేసుకోడం చాలాకష్టం. ఆమెకు ఏకాంతం దొరికితేనే కాని ఇటువంటి పనులేవి చెయ్యదు. పైగా నేను సరస్వతీ మందిరంలో రాత్రిపూట పొంచి అన్నీ వింటున్నానని ఆమెకు తెలియదు. రాణీగారికి, మీకు మాత్రమే తెలుసు. ఒకసారి ఆమెకు నేను చేసిన పని తెలిస్తే ఆమె కోరిన ఏకాంతం భగ్నమయి, స్వేచ్ఛగా సహజంగా గళం విప్పి పాడలేదు. బెదురు తీరి పదం వెయ్యలేదు. వీణావాదనలో లోతులకు పోలేదు. మరెవరో తన సాధనలో దోషాలో సొగసులో తెలుసుకోడానికి వేచి యున్నారంటే ఆమె ముందుకు పోలేదు''

రాజావారు నాతో ఈ రహస్యాలు ఎందుకు చెప్తున్నారని ఒకప్పుడు అనిపిస్తుంది. వారు చెప్పందే నాకే సంగతులు తెలియవు. నాకు తెలియకపోయినందువల్ల వారికి వచ్చిన నష్టమూలేదు. నేను వారి ఉప్పు తిని, పనిచేస్తున్న వాడిని. నన్ను నా స్థానంలో వారు ఉంచవచ్చు.

రాజావారి దృక్పథమేవేరు. నన్ను ఉద్యోగంలోకి తీసుకోడానికి ఆరు నెలలు పట్టింది. ప్రభుత్వం నుండి డిప్యుటేషన్ మీద వచ్చాను. ఏ క్షణాన్న రాజావారితో సరిపడకపోయినా, నా ఉద్యోగం నాకుంది.

వారీ సంగతులన్నీ ఆలోచిస్తారా?

వారు ధర్మమూర్తి వారికి నా మీద అచంచలమైన విశ్వాసం తప్ప వేరే అభిప్రాయం లేదు.

ఇన్ని మాటలు చెప్పడం దేనికి?

వారు నన్ను ఆప్తబంధువువలె, ప్రాణమిత్రుడివలె ఆదరిస్తున్నారు.





అందుచేతనే ఈ రహస్యాలన్నీ నాకు చెప్తున్నారు. కాని, నాకొక్కటే చింత.

రాజావారు, రాణీగారు చేసిన అప్పులన్నీ తీరితేచాలు.

అది సాధ్యమైన పనిగా కనిపించలేదు.

రాణీగారి ఆరోగ్యం క్రమంగా దారితప్పింది. కొంతకాలం రాజదంపతులు ఊటీలో ఉన్నారు.

చాలామంది స్పెషలిస్టులు పరీక్షించారు.

రాణీగారు, తాను చేయవలసిన వ్రతాలు, దానాలు, ధర్మాలు ఏ లోటూ లేకుండా చేసి, ఒకనాటి ఉదయం రాజావారి చేతులలో పుణ్యలోకాలకు వెళ్లిపోయారు.

రాజావారు దుఃఖసాగరంలో మునిగిపోయారు.

మేము ఎంత ఓదార్చినా వారు వినే స్థితిలో లేరు.

అంతవరకు అమృతవల్లి రాణీగారి చాటున బతికింది.

తనను కడుపులో పెట్టుకుని కాపాడిన ఉత్తమ యిల్లాలు పరమపదించగా, అమృతవల్లి చాలా వాపోయింది.

ఆమెకు రాజ దంపతుల పరస్పరానురాగం తెలుసు.

ఇప్పుడు ఆమెకు రాజావారిని దక్కించుకోవలసిన అవసరం కలిగింది. విపత్తుల యందు ధైర్యం వహించడం మహా వ్యక్తుల లక్షణం. భార్య వియోగానికి రాజావారు చాలా బాధపడుతున్నారు.

దాసీజనంతో కలిసి ఆఖరుసారి రాణీగారిని చూసి, అమృతవల్లి తన బంగళాకు మరలిపోయింది.

ఏ విధంగా రాజావారిని దారికి తేవడమో ఆమెకు బోధపడలేదు.

అమృతవల్లి తెర వెనుకనుంటే ప్రయోజనం కలుగదు.

ఆమె మరేవీ ఆలోచనలు పెట్టుకోలేదు.

మరుభూమినుండి రాజావారు తిరిగి వచ్చారు. అప్పటికి సాయంకాలమయింది.

బంధువులు, మిత్రులు వెళ్ళిపోయారు.

రాజావారు మతిచెడిన మనిషివలె, జడునివలె హాలులో కూర్చున్నారు.

రాత్రి ఎనిమిది గంటలయింది.

అమృతవల్లి వచ్చి, వారి యెదుట నిలుచున్న పావుగంట తరువాత వారామెను గుర్తించారు. ఎన్ని సంవత్సరాల తరువాతో ఒక్కసారి చూడడంతో ఆమెను త్వరగా పోల్చుకోలేకపోయారు.

"అమృతవల్లీ! అంతా అయిపోయింది!"

చిన్న పిల్లడివలె రాజావారు ఏడుస్తున్నారు.

ఆమెకు ఏమనాలో, ఏమి చేయాలో తోచలేదు.

రాణీగారి శరీరం గంధపుచెక్కలలో దహనమయిందని దాసీజనం చెప్పుకుంటే ఆమె వింది.

ఒంటరిగా తన ఎదుట సామాన్యుడివలె రోదిస్తున్న రాజావారిని, పొదవి పట్టుకొని, తన వక్షంమీద శిరసునుంచుకొని ఆమె ఓదార్చ దలచిందేమో!

ముందుకు రెండడుగులు వేసి ఆగిపోయింది.

తనకు వారిచ్చిన దూరంలోనే ఉండాలి.

"మీరు ప్రభువులు. మీకు కలిగిన కష్టం ఎవరూ తీర్చలేనిది. నేను పది సంవత్సరాలయి ప్రభువుల దృష్టికి రాకుండా ప్రచ్ఛన్నంగా జీవితం సాగించాను. రాజభవనం చేరిననాటికి నేను మామూలు బాలికను. ఈ పది సంవత్సరాలలో మీ దంపతులు నన్ను కంటికి రెప్పలా కాపాడారు. ఈ ఋణం ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేను. ఈ జన్మలో మీకు ఎటువంటి సేవ చేయాలో చెప్పండి. నా శరీరం, నా హృదయం, నా సర్వమూ మీ పాదాలముందు ఉంచుతున్నాను. మీరు

నన్ను ఆజ్ఞాపించండి. శిరసావహిస్తాను''

రాజావారు కళ్ళు తుడుచుకున్నారు.

ఎవరో దేవత, తన ఎదుట సాక్షాత్కరించి, వరాలను కోరుకోమన్నట్లు వారికి అనిపించింది.

"కళ్యాణి! నా బంధువులు, స్నేహితులు నన్ను ఓదార్చి వెళ్లారు. కొందరు ధర్మం బోధించారు, కొందరు విచారించారు. కొందరు ఏమీ చెప్పలేక కళ్ళ నీరు కార్చుకుంటూ వెళ్ళిపోయారు. నాకు దూరమైన వాళ్ళే యింత బాధపడుతున్నారు. కాని ఎవరికీ, నీవలె ధైర్యం చెప్పే సాహసం లేకపోయింది. నువ్వు మంచి కుటుంబంలో పుట్టావు. జన్మలనుండీ ఈ సంస్కారం నీ వెనుకను ఉంది. ఈ దుఃఖాన్ని నీతో పంచుకుంటే నా హృదయం తేలికవుతుంది. ఇంత వరకు నువ్వు ఎవరి కంటపడకుండా జీవితం గడిపావు. ఇప్పుడు కూడా, అదేప్రకారం, జీవితం సాగించవలసింది. ఒకప్పుడు రాణీగారి చాటున బ్రతికావు. ఇపుడు నా అండన జీవిస్తావు. నువ్వు విదుషీమణివి. హృదయతాపాలు చల్లార్చగల అమృతమయవాక్కులు నీ సొత్తు. రాణీగారు లేనిలోటు తీర్చరానిది. ఇది మానని గాయం. నేను బాధకు అలవాటుపడాలి. దానిని మరిపించగలిగినట్లయితే నేను అదృష్టవంతుడిని''

రాజావారు ఆమెవంక చూశారు.

ఆమె శోకంబు కట్టిన మూర్తి! అతి భూమి భారదుఃఖానతాంగి.

రాజావారిని ఓదార్చి తాను ధైర్యం కోలుపోయింది.

వెక్కివెక్కి యేడ్చింది. చాపమీద కూలబడింది.

రాజావారు ఏమీ అనలేదు.

గుండెలలో కరడుగట్టిన దుఃఖం ఏడ్పుతో కరిగి పారుతోంది.




కొంచెంసేపటి తరువాత ఆమె లేచింది.

రాజావారికి నమస్కారం చేసి వెళ్ళిపోయింది.

వయసువచ్చి అమృతవల్లి చాలా చక్కగా ఉంది.

అంతవరకే రాజావారు ఆమె గురించి అనుకున్నారు.

మిగిలిన ఆలోచనలన్నీ పక్కకు పెట్టారు.

ఒక నెల రోజులు అమృతవల్లి ప్రతి సాయంకాలం ఆరుగంటలకు రాజావారి దగ్గిరికి వచ్చేది. హాలులో వారు సోఫామీద కూర్చునేవారు. ఆమె నేలను చాప పరుచుకుని కూర్చుండేది. రాజావారికి నమస్కరించి, వారి ఆరోగ్యం గురించి అడిగేది. తరువాత ఆరోజు, వార్తాపత్రికలలోని విషయాలు తెలియజేసేది. రాజావారు గతంలో ఈ పని తాము స్వయంగా చేసేవారు. రాణీగారికి వార్తలలో వింతలు చెప్పేవారు. రాజావారు ఇప్పుడీ పని సక్రమంగా చెయ్యడంలేదు. తప్పదని అప్పుడప్పుడు కార్యాలయానికి వెళ్తున్నారు. మిగిలిన కాలం రాణీగారి గురించే ఆలోచిస్తున్నారు. అందుచేత వారిని సరియైన దారికి తీసుకురావడంకోసం అమృతవల్లి చాలా పద్ధతులను ఆలోచించింది. అందులో, వారికి ప్రతి సాయంకాలం వార్తలు చెప్పడం ఒకటి. లోకంలో చాలా ఘోరాలు జరుగుతుంటాయి. చాలామంచి పనులు జరుగుతుంటాయి. ఈ వార్తలు వింటున్న మనిషి మనసు చీకటి వెలుగులకు అలవాటయి తన దుఃఖాన్ని మరచిపోతుంది.

రాణీగారు దివంగతులయేసరికి రాజావారికి ఏభైయేళ్ళు వెళ్ళిపోయాయి. జీవితంలో అనుభవించవలసిన సుఖాలను వారు చాలా వరకు అనుభవించారు. మిగిలిన వయసు మోక్షమార్గంవేపు పయనించవలసి ఉంది. ఈ పనికి పురాణాలకన్న ఉత్తమమైన గ్రంథాలు లేవు. ఇవన్నీ అమృతవల్లికి కరతలామలకాలు.

అమృతవల్లి ప్రణాళికను ఒకటి ఏర్పరచు

కుంది. ఒక సంవత్సరంవరకు చేయవలసిన పనులను నిర్ణయించుకుంది. ప్రతి సాయంకాలం వార్తలను చెప్పిన తరువాత, పోతన భాగవతం రాజావారికి చదివి వినిపించేది. దశావతార ఘట్టం, వామనచరిత్ర, గజేంద్రమోక్షం వంటివి చదివి వాటిని వివరించి చెప్పడంలో ఆమెకు ఎవరూ సాటిరారు. జడ భరతుడి వృత్తాంతం ఆమె ఎంత దివ్యంగా వ్యాఖ్యానించిందో! ఆమె రోజుకి ఒకే విషయం గురించి చెప్పేది. ఒకరోజు తెలుగు భాగవతం, మరొకరోజు సంస్కృతంలో వాల్మీకి రామాయణం, ఇంకొకరోజు వీణావాదన, ఈ మూడు విషయాలు, ఆ వరుసలోనే ఆమె రాజావారికి వినిపించింది.

రాజావారు బహుముఖప్రజ్ఞాశాలి. రాజతంత్రం ఎంత తెలుసో, మానవ హృదయాన్ని కూడా వారు అంత నిశితంగా అధ్యయనం చేశారు. దర్బారులో శాస్త్రచర్చలు జరిగినప్పుడు, వారికి కలిగిన సందేహాలను కొమ్ములు తిరిగిన పండితులే తీర్చలేకపోయారు. అమృతవల్లి, అటు బహుశాస్త్రాలనుండి ఉదాహరణ లెన్నో చెప్పి అటువంటి సంశయాలనెన్నిటినో తొలగించింది. తెలుగు పద్యం చదవడం ఆమెకు వెన్నతోపెట్టిన విద్య. పోతన భాగవతంలోని పద్యాలు ఆమె నోటంట రాజావారు విని, జన్మతరించిందనుకున్నారు.

సంస్కృతంలో వాల్మీకి రామాయణంకన్న మధురమైన కావ్యంలేదు. శ్రీరామచంద్రుడు మానవజాతికి అలంకారం. సీతారాముల ప్రణయం, దశరథుని ధర్మనిరతి, లక్ష్మణుడి సేవావ్రతం, భరతుడి భ్రాతృభక్తి ఇవన్నీ లోకవిదితాలు. రామాయణంలోని పాత్రలన్నీ జాతిరత్నాలు, కావ్యభాష మకరంద మధురం, ప్రకృతి వాల్మీకి చేతిలో ఎన్ని రంగులలో చిత్రిత మయిందో, అమృతవల్లి శ్లోకాలు చదువుతుంది, అర్థం చెప్తుంది. తెలుగు రామాయణాలలోని పద్యాలు సందర్భానుసారంగా చదివి అన్వయిస్తుంది. అన్నిటికన్న ముఖ్యంగా, దాశరథి హృదయాన్ని రాజావారికి తెలియజేస్తుంది.

వీణావాదన గురించి చెప్పనే అక్కరలేదు. ఆమె చేతిలో బొబ్బిలి వీణ పలికించని పలుకేది? వినిపించని రాగమేది? అమృతవల్లి వీణ వాయించినంతసేపు, రాజావారు మంత్రంతో కట్టివేసిన నాగరాజువలె సోఫా మీద ఉండిపోతారు.

అమృతవల్లి ఎప్పుడూ పదిగంటలకు ముందు, రాత్రివేళ, బంగళాకు తిరిగిరాలేదు. రాజావారు ఆమె చదివిన కావ్యాలన్నీ సరస్వతీ మందిరంలో కూర్చొని విన్నారు. కాని ఈ పురాణ ప్రసంగం అద్వితీయమైనది. వీణా వాదనలో ఆమె హిమాలయ శిఖరోన్నత స్థితికి చేరుకుంది.

ఈ విధంగా రెండు సంవత్సరాలు గడిచాయి. రాజావారు యిప్పుడు కార్యాలయానికి అంతగా రావటంలేదు. ఒకప్పుడు ఖర్చువెచ్చాలు చూచే వారు. అవి కూడా యిప్పుడు మానివేశారు. వారు మంచి సంభాషణా చతురులు. ఇప్పుడు అంతగా మాట్లాడడం కూడాలేదు.

పది సంవత్సరాలు, రాణీగారు బ్రతికున్నంతకాలం, వారు అమృతవల్లి బంగళాకు పోలేదు. ఇప్పుడిప్పుడు వెళ్తున్నారు. అమృతవల్లి పెంచిన గులాబి మొక్కలను చూసి తిరిగి వస్తారు. వచ్చినప్పుడు మర్యాద లేవీ లేవు. వెళ్ళినప్పుడూ అంతే. గౌరవమర్యాదలకు వాళ్ళిద్దరూ అతీతులు.

ఆదివారంనాడు శాస్త్రప్రసంగాలు కాని, వీణా వాదనకాని లేవు. అమృతవల్లి ఆనాడు బంగళాలో తన పనులు చేసుకుంటుంది. తన బట్టలు తానే ఉతుకుకుంటుంది. గదులు శుభ్రంచేయడానికి పరిచారికలకు సహాయపడుతుంది. అన్నిటికన్న చాలా శ్రద్ధగా, ముఖమల్ బట్టతో వీణను తుడిచి మెరుగులు పెడుతుంది. తను చదువుకునే గ్రంథాల

ను ఒక క్రమంలో అద్దాల బీరువాలలో సర్దుతుంది. ఇంతవరకు బంగళాకే పరిమిత మైన ఆమె కార్యక్రమం రాజావారి అభ్యంతర మందిరంవరకు విస్తరించింది.

ఒకరోజు రాజావారు అమృతవల్లితో అన్నారు.

"అమృతవల్లీ! చిట్టిరాజు నీకు నాట్యం నేర్పుతున్నదా?"

"నేర్పుతున్నారు''

"జాయపసేనాని గ్రంథాన్ని అనుసరించి చెప్తున్నదా?"

"ఆ ప్రకారమే చెప్తున్నారు''

"అన్ని ప్రకరణాలు పూర్తయ్యాయా?"

"గ్రంథాన్ని మూడుసార్లు పూర్తిచేశాము''

"దేశీరీతులు నేర్చుకున్నావా?"

"క్షేత్రయ్య పదాలు, ధర్మపురివారి జావళీలు కూడా నేర్చుకున్నాను''

వారు చాలాసేపు ఆలోచించి ప్రశ్నవేశారు.

"ఆహార్యం విషయంలో ఏమి చేస్తున్నారు?"

"మా గురువులు ప్రత్యేకమైన శ్రద్ధతో రాజనర్తకిగా అలంకారాల గురించి, అంగరాగాల గురించి అధ్యయనం చేశారు. నన్ను సంపూర్ణంగా, అన్ని హంగులతోను, నర్తకిగా చూడాలని వారి అభిలాష. కాని, నేను మాత్రం అంగీకరించలేదు. బహుశా ఉత్సవాలలోను, రాజసభలోను నాట్యం చేసేవారికి ఆహార్యం చాలా ముఖ్యమైనది. నేనటువంటి నర్తకిని కాను''

రాజావారు ఆలోచిస్తున్నారు.

"అమృతవల్లీ! అలంకారాలు, అంగరాగాలు నీకు దేనికి? నువ్వు సర్వాంగ సుందరివి. సభలలోను, ఉత్సవాలలోను నాట్యం చేసే దేవదాసివి కావు నువ్వు''

అమృతవల్లి నవ్వి అంది.

"నేను వేణుగోపాలస్వామివారి దాసిని''

"ఎంత అదృష్టవంతుడామహానుభావుడు!"

"మన కులదైవం తరువాత ప్రభువులు నాకు దేవులు''

"అమృతవల్లీ! నువ్వు వివేకం కలిగినదానివి. వినయం కలదానివి.నీ నియమాలు ఏవో నాకు తెలియదు. వాటికి భంగంరాని పక్షంలో..."

"ప్రభువుల ఆజ్ఞను నేను శిరసావహిస్తున్నాను''

ఆ విధంగా రాణీగారు చనిపోయిన రెండు సంవత్సరాల తరువాత, అమృతవల్లి దైనందిన కార్యక్రమంలో మార్పువచ్చింది.

వారంలో రెండు రోజులు సాహిత్యానికి, రెండు రోజులు సంగీతానికి, రెండు రోజులు నాట్యానికి ప్రత్యేకించింది. ఆదివారం పనులలో మాత్రం మార్పులేదు.

అమృతవల్లి నాట్యం రాత్రి ఏడు గంటలకు మొదలయేది. అభినయం స్పష్టంగా కనిపించాలి. అందుచేత, హాలులో ఎన్ని సంవత్సరాలనుండో వెలిగించని కొవ్వొత్తి దీపాలను వాడుకలోకి తెచ్చారు. ఇదొక అదనపు ఖర్చు. రాజావారు తలచుకుంటే కాదన డానికి నేనెవడిని?

రెండు సంవత్సరాలు ఆమె మార్గపద్ధతిలో చేయవలసిన నాట్యాలన్నీ ప్రదర్శించింది. నృత్తరత్నాకరంలో వివరించిన ఆంగికాభినయమంతా ఆమె విశదీకరించింది.

రాజావారికి ఒక్కటే కోరిక మిగిలింది. క్షేత్రయపదాలు, ధర్మపురి సుబ్బారావుగారి జావళీలు- వీటిని ప్రదర్శించడంలో చిట్టిరాజు అందెవేసినచేయి. వాటిని అమృతవల్లి అభినయించి చూపిస్తే ఎలా ఉంటాయో వారు తెలుసుకోదలచారు. కాని వారి వయసు, పెద్ద మనిషి తరహా, అందుకు అడ్డువచ్చాయి.




రాణీగారు పరలోకాలకు పోయి నాలుగు సంవత్సరాలయింది. రాజావారు ఒక దారిలో పడ్డారు. స్నేహితులతోను, బంధువులతోను ముచ్చటిస్తున్నారు. అప్పుడప్పుడు హాస్యోక్తులాడుతున్నారు.

ఉన్నట్లుండి, ఒక రాత్రి అమృతవల్లి, క్షేత్రయ్యగారి పదం 'మంచి దినమునేడే...' అభినయించింది. ఆనందభైరవి రాగంలో రచించిన పదమిది.

అమృతవల్లికి చిట్టిరాజుకి ఒక ముఖ్యమైన భేదముంది.

చిట్టిరాజు గొంతు అంత బాగుండదు. ఒకొక్కప్పుడు జీరవస్తుంది. అపస్వరాలు పలుకుతాయి. మరెవరో పాడితే ఆమె అభినయిస్తుంది. ఆమెవలె అభినయించగలవారు మరొకరుండరని రాజావారు అనుకునేవారు. ఆవిడకూడా అంత గర్వంగా తన గురించి చెప్పుకుంటుంది.

శిష్యురాలి ఎదుట తరచు తన పొగడ్తలే ఆమె వినిపించేది.

ఒకనాడు కూడా అమృతవల్లి గురువులనుకాదనలేదు.

చిట్టిరాజు చెప్పిన మేరకు నాట్యం చేసేది. ఎప్పుడు కూడా తాను, ఆమెకన్న బాగా అభినయిస్తానన్న భావం గురువుల మనసులో కలుగకుండా జాగ్రత్తపడింది.

సుకుమారమైన లాస్యంలోను, ఉద్ధతమైన తాండవంలోను, అమృతవల్లికి సాటి ఎవ్వరూలేరని రాజావారు ఒక అభిప్రాయానికి వచ్చారు.

కాని, పదాల విషయంలోను, జావళీల గురించి వారికి ఒకటే అభిప్రాయముండేది. వీటిని గణికలే ప్రదర్శించడానికి యోగ్యులు. శృంగారం వారు కొంగున కట్టిన బంగారం. పురుషులను రంజింప జేయడం వంశపారంపర్యంగా వారికి వచ్చిన విద్య. అటువంటి విద్యలన్నిటిలోను హేమాంగి చాతుర్యంకలది.

అమృతవల్లి ఇటువంటి శృంగారపరమైన పదాలను అభినయించడం ఎబ్బెట్టుగా ఉంటుందనుకున్నారు రాజావారు. జావళులు ఇంకా పచ్చిగా ఉంటాయి. వీటిని అమృతవల్లి అభినయించగలదా? ఆమె అటువంటి పని చెయ్యకుండా ఉండడం భావ్యం.

కాని వారి అభిప్రాయాలన్నీ అమృతవల్లి గాలిలో ఎగురవేసింది.

ఆమె అంతకు పూర్వం జయదేవుడి అష్టపదులను అభినయించింది. ఆ శృంగారం సంస్కృతంలో ఉండడంచేత రాజావారినంత కలవరపెట్టలేదు.

ఈనాడు ఆనందభైరవిరాగం ఆలపించి, అమృతవల్లి క్షేత్రయ్య పదం పాడుతుంటే వారు తమ చెవులను తామే నమ్మలేకపోయారు. ఆమె అభినయిస్తే తమ కళ్ళుకూడా మోసం చేస్తున్నాయనుకున్నారు.

'అలవాని సామ్మే కదా, ఈ మేను...'

హేమాంగి పదంలోని ఈ భాగాన్ని అభినయిస్తే రాజావారు వెర్రులెత్తేవారు. చాలాసార్లు అమృతవల్లి ఈ పదాన్ని వీణమీద వాయించినప్పుడు పరవశించేవారు. ఇప్పుడామె రాగయుక్తంగా పాడితే వారు దిగ్భ్రమ చెందారు. పాడుతూ ఆమె అభినయిస్తే వారికి మతిపోయింది. ఈ పదాన్ని క్షేత్రయ్య మధురభక్తితో రచించాడు. భువనమోహనుడు గోపాలకృష్ణుడు, భక్తులు గోపికలు వారి ఆధ్యాత్మిక సంబంధమే మధుర భక్తి.

అమృతవల్లి చేసిన నాట్యంలో శృంగారం కనిపించలేదు. హేమాంగి ప్రదర్శించిన ఒంటి విరుపులు లేవు. చవకబారు చూపులు లేవు. క్షేత్రయ్య ఈ పదాన్ని రచించి ఎంత మురిసిపోయాడు, అమృతవల్లి అభినయం చూసి రాజావారు అంత హెచ్చుగా పరవశించారు.

ఈ పదాన్ని వారు ఎన్నోసారులు కోరికోరి అభినయించమన్నారు.



అటువంటిదే, 'మధురానగరిలో చల్లలమ్మబోవ' అన్న జావళీ కూడా. అదీ ఆనంద భైరవిలో రచించినదే.

వేయిమంది చిట్టిరాజులు అమృతవల్లి కాలిగోరుకు సరిపడరు..

ఒక రాత్రి నాట్యం పూర్తి అయిన తరువాత, రాజావారు అమృతవల్లిని కొంచెంసేపు కూర్చోమన్నారు.

"అమృతవల్లీ! సంగీతంలోను, సాహిత్యంలోను, నాట్యంలోను నేను ఆశించిన స్థాయికన్న నువ్వు ఎంతో ఎత్తుకు ఎదిగి, కళావిహాయసంలో ధృవతారగా నిలిచావు. నా బ్రతుకు పరిపూర్ణం చేశావు. ఇటువంటి రసానందం లోకంలో కోటిమందిలో ఒకరికి కూడా లభించదు. నేను చాలా అదృష్టవంతుడిని''

వారి కళ్ళు చెమ్మగిల్లాయి.

"నాకు మరే కోరికలేదు. నిన్ను ప్రశంసించే సామర్థ్యం కూడా నాకు లేదు. నేను చేతులెత్తి భగవంతుడికి మొక్కుతున్నాను. నిన్ను ఆశీర్వదించమని... ఇంకేం చెప్పగలను? ఎన్ని చెప్పగలను?"

ఆమె కళ్ళు తుడుచుకుంటూ, రాజావారికి నమస్కరించి వెళ్ళిపోయింది.

ఆ మరునాడు ఆదివారం. సాధారణంగా రాజావారు ఎవరినీ ఈ సెలవు దినంలో పిలిపించి యిబ్బంది పెట్టరు. వారు నాకు కబురు పంపగా నేను చాలా ఆశ్చర్యపోయాను. ఏదో వారి మనసులో ఉంది. వారు కార్యాలయానికి రాలేదు. అంతఃపురంలో వారు కూర్చుండే హాలులోకే సరాసరి నన్ను రప్పించారు.

"స్వామిగారు! మిమ్మల్ని విశ్రాంతి తీసుకోకుండా పిలిపించినందుకు మరేమీ అనుకోకండి. ఎన్నో సంగతులు మీతో చెప్పవలసినవి ఉన్నాయి. మీరు మన అప్పుల గురించి చాలా బాధపడుతున్నారు. మన ఆస్తులు చాలా ఉన్నాయి. అప్పులు తీరగా ఎన్నో లక్షలు మిగులుతాయి. మీరు నిర్విచారంగా, అప్పులన్నీ తీర్చవచ్చు''

"ప్రభువులు ఇటువంటి విషయాలు ఎందుకు చెప్తున్నారో నాకు బోధపడడంలేదు''

"అదే! నేను అనుకుంటున్నాను. అన్నిటికన్న ఆనందకరమైన విషయం! మన పట్టణం కూడా మునిసిపాలిటీ పారిపాలనలోకి వచ్చే సూచనలున్నాయని విన్నాను. బహుశా కొన్ని సంవత్సరాలు పట్టవచ్చు. మీరు ఛైర్మనుగా వచ్చిన వారికి ఈ పార్కులను జాగ్రత్తగా చూసుకోమనండి. మన తోటమాలీలనందరినీ వారికింద తీసుకోమనండి. అన్నట్టు అమెరికానుంచి ఉత్తరం వచ్చింది. దీనిని ఎవరికి చదివి వినిపించడం? అవునవును. అమృతవల్లి ఉందికదా. చెల్లెలి గురించి, చెల్లెలి పిల్లల గురించి అతను రాశాడు. సావకాశంగా దీనిని చదివి ఆమెకు వినిపించండి''

"అమృతవల్లికి కబురు పంపించేదా?"

"వద్దు! ఇవాళ ఆమె యింటి పని చేసుకుంటుంది''

"ఇంకేమేనా సంగతులు తమ మనసులో ఉన్నాయా?"

"అన్నిటిని చెప్పినందువల్ల ప్రయోజనంలేదు. చాలా ముఖ్యమైన విషయం మీకు చెప్పాలని పిలిపించాను''

"చెప్పండి!"

"అమృతవల్లివంటి వ్యక్తి లోకంలో చాలా అరుదుగా జన్మిస్తుంది. ఆమె సౌందర్యం అడవిగాచిన వెన్నెల అయింది. కాని ఆమె కళాకౌశలం అనితరసాధ్యమైనది. నాకు ఆ ఆనందాన్ని దోసిళ్ళతో తాగించింది ఎన్ని జన్మలకు ఆమె రుణం తీర్చుకోగలను? ఆమెకు ఏ లోటూ రానీయకండి. నా సర్వస్వం ఆమెకు ధారపోసినా, ఆమె విద్వత్తుకు సరియైన విలువ కాబోదు''

అక్కడ టేబిలుమీదనున్న పళ్ళు రెండు




నా చేతిలో పెట్టారు.

"రామలింగస్వామిగారూ! వెళ్ళిరండి! మిమ్మల్ని నేను నా దివాన్‌జీగా పరిగణించ లేదు. నా అన్నగారిగా భావించాను. దేవుడు మీకు ఆరోగ్యం ధర్మదీక్ష ప్రసాదించమని ప్రార్థిస్తున్నాను... సెలవు''

రాజా వేంకటరంగారావు బహదూరువారు చెమ్మగిల్లిన కళ్ళను కండువాతో తుడుచుకున్నారు.

నేను యింటికి తిరిగివచ్చాను. రాజావారి ముఖంలో దైన్యం, నిస్సహాయతా నాకు స్పష్టంగా కనిపించాయి.

మరునాడు సోమవారం.

కార్యాలయానికి వెళ్ళడానికి తయారవుతుంటే కబురు వచ్చింది. నేను వెళ్ళేసరికి పెద్దపెద్ద వైద్యులు పరీక్షచేస్తున్నారు. రాజావారు ఉదయం నిద్రనుండి లేవలేదు.

అనాయాసంగా మరణించారు.

అమృతవల్లి ఎప్పుడు వచ్చి రాజావారి పాదాలకు నమస్కరించిందో!

ఇప్పుడు రోదించడం నా వంతు

ఏమని రోదిస్తాను?



"యువరానర్!

విచారణ మధ్యలో, మూడు వారాల వరకు కేసు వాయిదా వేయమని కోర్టువారిని కోరుకున్నాను. కొత్త సాక్ష్యం లభించింది. నాకు కొత్త సంగతులు చెప్పుకోడానికి అవకాశమిచ్చిన కోర్టువారికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

దివాన్‌జీ రామలింగస్వామిగారి డైరీలు లభించడం అమృతవల్లిగారి అదృష్టం. కేసుకు సంబంధించినమేరకు వాటిలో గల సంగతులు సంగ్రహంగా రాసి కోర్టువారికి సమర్పించుకున్నాను. ఆ వివరాలలో కొన్ని బహిరంగంగా చెప్పవలసినవి కావు. కోర్టువారు రహస్యంగా వాటిని పరిశీలించి ఒక అభిప్రాయానికి వచ్చారని భావిస్తున్నాను.

చివరి దశలో రామలింగస్వామిగారు రాసిన డైరీలలో రహస్యాలేమీ లేవు. వాటిని అందరి ఎదుట చెప్పడానికి అనుమతించవలసింది''

కోర్టువారు లాయర్ చంద్రశేఖరం అభ్యర్థనను స్వీకరించారు.

"యువరానర్!

దివాన్‌జీగారు రాజావారి అంత్యక్రియలకు చాలా ధనం ఖర్చుపెట్టారు. రాజావారి మనసులోని కోరికప్రకారం దానధర్మాలు జరిపించారు. పేదలకు అన్నసంతర్పణే కాకుండా బట్టలు కూడా పంచారు. ఇవన్నీ పూర్తయ్యేదాకా అతను ఆస్తులను, అప్పులను అంచనా వెయ్యలేదు. ఒక నెల రోజులు లెక్కలన్నీ చూసిన తరువాత చూస్తే ఆస్తి కోటి ఏభై లక్షలైతే అప్పులు ఏభై లక్షలు తేలాయి.

రాజావారి కోరిక అప్పులు ముందు తీర్చడం.

అప్పులు తీర్చడంతోనే సమస్య పరిష్కారం కాదు.

చాలా పొదుపుగా ఖర్చులు పెట్టకపోతే అప్పులు పెరుగుతాయి.

ఈ పొదుపు ఉద్యమం దెబ్బ మొట్టమొదట అమృతవల్లిగారిమీద పడింది. వారికి సాహిత్యం చెప్తున్న లక్ష్మీనారాయణశాస్త్రిగారి

కి, వీణ చెప్తున్న గోపాలశర్మగారికి, నాట్యం చెప్తున్న హేమాంగికి దివాన్‌జీగారు దేవిడీమన్నా యిచ్చారు - ఆ గురువులకు మరి చెప్పడానికి ఏమీ లేదు అమృతవల్లిగారికి నేర్చుకోడానికి ఏమీ మిగలలేదు.

తరువాత కోటలో పని చేసే దాసదాసీ జనంలో మూడు వంతులమందిని ఉద్యోగాలనుండి తీసివేశారు. రాజావారి మరణంతో కోట తన శోభను కోల్పోయింది. నగారాలు, గంటలు ఆగిపోయాయి. కందకం పూర్తిగా ఎండిపోయింది. పార్కులు మట్టికొట్టుకుపోయాయి. వీధులలో తొక్కు గుట్టలుగా పేరుకుపోయింది.

రాజావారు చనిపోయిన తరువాత ప్రభుత్వం, వారి చరస్థిరాస్తులమీద కన్నువేసింది. ప్రతి ఆరు నెలలకు జమా ఖర్చులు తెలియజేయమంది. జిల్లా కలెక్టరుగారిని సిరిపురం వ్యవహారాలు చూడడానికి నియోగించింది. అయిదు సంవత్సరాలలో లెక్కలన్నీ సరిచూసి ఆస్తులను ప్రభుత్వానికి అప్పగించమని పైనుండి ఆర్డర్లు వచ్చాయి.

దివాను రామలింగస్వామిగారు అయిదు సంవత్సరాల తరువాత రాజావారి ఆస్తులతో పాటు అప్పులను కూడా ప్రభుత్వానికి బదిలీ చేయవచ్చు. లెక్కలు సరిగా ఉంటే చాలు. కాని, అతను రాజాగారికి ఒక బాస చేశారు. అప్పులు ప్రభుత్వానికి అప్పజెప్పనని.

అందుచేత అతను చాలా ఖర్చులు తగ్గించారు.

బంగళాలోనున్న అమృతవల్లిగారికి యీ మార్పులు తెలిసినట్లు లేదు. కాని వారికి ప్రతి నెల రెండువేల అయిదు వందల రూపాయలు మాత్రం ఖర్చులకు పంపుతే ఆమె కొంచెంసేపు ఆలోచించారు. చాలా ముఖ్యమైన వంటామెను, మరొక పరిచారికను మాత్రం ఉంచుకున్నారు. మిగిలినవారికి తన చీరలలో, నగలలో బహుమతిగా యిచ్చి పంపించారు. ముగ్గురు గురువులు ఒక్కసారి రావడం మానేశారు. ఏదోరోజు ఇది జరగవలసిందే. కొత్త పరిస్థితికి అలవాటుపడడానికి ఆమె ప్రయత్నించారు. ఈవిధంగా లభించిన తీరికను ఆమె మొక్కలను పెంచడంలో గడిపారు. చదువు, వీణ, నాట్యం ఉండనే ఉన్నాయి.

దీవాన్‌జీగారు నిరంతర దీక్షతో అయిదు సంవత్సరాలు శ్రమించి, ప్రభుత్వంవారికి అప్పులు లేకుండా రాజావారి ఆస్తి అప్పజెప్పారు.

ఆఖరిరోజున దివాన్‌జీగారు తమ డైరీలో రాసుకున్న సంగతి అందరిముందు ఉంచుతున్నాను.

"నేను చాలా అలసిపోయాను. విరామం లేకుండా అయిదు సంవత్సరాలు, రేయింబవళ్లు శ్రమపడి, శిస్తులు వసూలు చేసి, ఫలసాయమమ్మి, భూములను, తోటలను విక్రయించి రాజావారి ఋణాలన్నీ తీర్చాను. చాలాకాలంబట్టి రాస్తున్న ఈ డైరీలు చాలా భద్రంగా దాచాలి. ఎవరికంటా కొన్ని సంవత్సరాలవరకు పడకూడదు. అంతవరకు వీటిని లాయరుగారి దగ్గర సీలువేసిన పెట్టెలో ఉంచాలి. ఈ రాత్రి నా వీలునామా, ఈ డైరీలు, లాయరుగారి దగ్గిర జమచేసి హాయిగా నిద్రపోతాను. కాని నా తలమీద మరో పెద్ద బాధ్యత వుంది. అమృతవల్లికి అందించే సహాయాన్ని నాలుగోవంతుకు తగ్గించాను. ఒకనాడు కూడా ఆమె తనకు ఈ డబ్బు సరిపోలేదని కబురు పెట్టలేదు. ఆమె ఎలా ఉందో కూడా తెలుసుకోడానికి ప్రయత్నించలేదు. రాజావారు నాతో మరీమరీ చెప్పారు ఆమెకు ఏ లోపం చేయవద్దని. తమ ఆస్తినంతా ఆమెకు యిచ్చివేయడానికి వారు సంసిద్ధులయ్యారు. ఆమెకు ఎంత యివ్వాలి? జీవితకాలం, ఆమెకు ఏవిధంగా నెలసరిగా పింఛనువలె అందజేయాలంటే ఎంత డబ్బు బాంకులో శాశ్వతంగా డిపాజిట్ చేయాలి? ఈ విషయాల గురించి నేను ఆలోచించలేదు. ప్రభుత్వంవారే




ఆమెకు ఆ ఏర్పాటు చేస్తే బాగుంటుంది, నేను తొందరపడి చేతులు దులుపుకున్నాను.

నేను చాలా అలసిపోయాను. ఓ భగవంతుడా! నాకు ప్రశాంతమైన నిద్రను ప్రసాదించు''

ఆ రాత్రి రామలింగస్వామిగారు వీలునామా పూర్తిచేసి, డైరీలను లాయరుగారి దగ్గిర జమచేసి నిద్రపోయేసరికి రాత్రి ఒంటిగంట అయింది. అతను యింటికి తిరిగి వచ్చేసరికి అందరూ గాఢనిద్రలో ఉన్నారు. మంచంమీద పక్కవేసి వుంది. తలగడ దగ్గిర భగవద్గీత వుంది.

రోజూ అతను పడుకోబోయేముందు కొన్ని శ్లోకాలు అందులోంచి చదివేవారు.

ఈరోజుమాత్రం ఆఖరి శ్లోకం, 'యత్రయోగీశ్వరః కృష్ణో, యత్ర పార్థో ధనుర్ధరః', అన్న దానిని చదివారు. తరువాత ప్రశాంతంగా నిద్రించారు.

దివాన్‌జీ రామలింగస్వామిగారు, తమ ఆత్మబంధువైన రాజా వేంకట రంగారావుగారివలెనే నిద్రనుండి లేవలేదు.

దివాన్‌జీగారి మరణంతో రాజుగారి వ్యవహారాలు అస్తవ్యస్తమయ్యాయి. ప్రభుత్వం ప్రత్యేకంగా ఒక అధికారిని నియమించి, రాజావారి ఆస్తులను స్వాధీనం చేసుకొని, వేలం వేయించడానికి అన్ని ప్రయత్నాలు చేయమన్నారు.

అమృతవల్లిగారికి అందరికన్న పెద్ద దెబ్బ తగిలింది.

ఆవిడ గురించి పట్టించుకునే నాధుడెవడూ ముందుకు రాలేదు.

రామభద్ర రాజుగారికి కోటలోని పరిణామాలు తెలిశాయి. అతను వచ్చి అక్కగారి పరిస్థితులు తెలుసుకున్నారు. కాని, ఆమె మాత్రం తమ యిబ్బందులను ఒకటి కూడా తమ్ముడికి తెలియజేయలేదు.

రాణీగారు దానధర్మాలు చేసే రోజుల్లో ప్రతి శుక్రవారం ఒక బంగారు కాసు తాంబూలంలో పెట్టి అమృతవల్లిగారికి యిచ్చేవారు. అటువంటివి ఒక ఏభై కాసులు వారిదగ్గర జమ అయ్యాయి. వాటిని మార్చి రెండు సంవత్సరాలు వారు జీవిక సాగించారు. తరువాత వారి దీనమైన స్థితి తమ్ముడి దృష్టికి వచ్చిననుండీ పరిస్థితులు మెరుగుపడ్డాయి.

ప్రభుత్వం రాజావారి ఆస్తులను వేలంలో విక్రయించడానికి పది సంవత్సరాలు పట్టింది. తొంభై లక్షలకు పైగా రాజావారి ఆస్తులు అమ్మగా వచ్చిన ధనం ప్రభుత్వం ఖజానాలో జమ అయింది.

రామభద్ర రాజుగారికి రాజావారి ఆస్తుల వేలం గురించి వార్తలు అందుతూనేవున్నాయి. కాని అతను వాటిని పట్టించుకోలేదు.

ఒక అర్ధరాత్రి అతనికి తెలివి వచ్చింది. అక్కగారి జీవితంలో చాలాభాగం కోటలోనే గడచిపోయింది. ఆమె నేర్చిన విద్యలు రాజుగారి ప్రైవేటు ఆస్తి అయింది. అటువంటప్పుడు రాజుగారి ఆస్తిలో కొద్దిభాగం యిబ్బందులు లేకుండా ఎందుకు రాబట్టకూడదు? రాజావారు ఏ వీలూ రాయలేదు. దివాన్‌జీగారు కూడా ఏదో కారణంచేత సమస్యను పరిష్కరించలేదు.

రామభద్ర రాజుగారు అక్కగారిని ఒప్పించడానికి ఆరు నెలలు పట్టింది. రాజావారి ధనంమీద ఆమెకు నైతికంగా హక్కుంది. మరి వీలునామాలు దేనికి?

యువరానర్!

అమృతవల్లిగారి గురించి మీకు యింతగా చెప్పవలసి వచ్చింది.

ఆమెవలెనే వారి ప్రభావానికి లోనయి, నేరం చేయకపోయినా శిక్షననుభవిస్తూ దైవోపహతులైన ఇద్దరు వ్యక్తుల గురించి చెప్పి నా ప్రసంగం ముగిస్తాను.

వీరిలో విధికి బలి అయిన మొదటి వ్యక్తి

వెంకట్రాయుడుగారు. వారదుగో లేచి నిలు చున్నారు. చాలా పెద్ద ఉద్యోగం చేస్తున్నారు. వారి చెల్లెలు అమృతవల్లి గురించి రాసిన ఉత్తరంతో వారు ఒక నిశ్చయానికి వచ్చారు. చేసుకుంటే అమృతవల్లిగారినే చేసుకోవాలనే వారు దీక్ష వహించారు. ఇప్పటికీ వారు బ్రహ్మచారిగానే ఉండిపోయారు.

ఇక రెండో వ్యక్తి రామభద్ర రాజుగారు. విశ్వవిద్యాలయంలో ఎమ్మే పాసయ్యారు. అక్కగారికి పెళ్లి కాలేదని తాను పెళ్లి మానిన మహనీయుడు. తల్లిదండ్రులు బతికినన్నాళ్లు సేవచేసి, వారి అనంతరం అక్కగారికి సేవ చేస్తున్న ఉత్తముడు.

అప్పుడు జడ్జీగారొక ప్రశ్న వేశారు.

"వెంకట్రాయుడుగారు అమృతవల్లిగారిని పెండ్లిమాటలప్పుడు చూశారా?"

"లేదు..."

"అటు తరువాత?"

"ఇంతవరకూ చూడలేదు. వారి సంగతి అటుంచి రామభద్రరాజుగారు కూడా ఆమెను ముప్పై సంవత్సరాలయి చూడలేదు"

"మరి తాను అందజేయవలసిన సహాయం ఎలా చేరుస్తున్నారు?"

"తెర వెనుకనుంచి"

జడ్జీగారు నవ్వారు.

"వాది తరపు లాయరుగారైనా ఆమెను చూశారా?"

"లేదు యువరానర్!"

జడ్జీగారు మరేమీ అడగలేదు.

విచారణ పూర్తయింది.

రెండు రోజుల తరువాత జడ్జీగారు తీర్పు వినిపించారు.

'వాదియైన అమృతవల్లిగారు, సిరిపురం రాజావారికి బంధువులూ కారు, వారిస్నే హితులూ కారు. కోటలో రాణీగారిని చూడడానికి వచ్చారు. పర పురుషుడైన రాజావారిని సాకాంక్షగా చూశారన్న తప్పుకు ఇంటినుండి బహిష్కరింపబడ్డారు. తిరిగి కోటకు పోయి అక్కడ బందీ అయిపోయారు. రాణీగారికి పది సంవత్సరాలు ఆప్తులుగా వున్నారు. రాజావారికి సంగీత సాహిత్య నాట్యాలలో తమ అసమాన ప్రతిభను ప్రదర్శించి, వారి జీవితాలకు కొత్త వెలుగులను ప్రసాదించారు. రాజా దంపతుల జీవితాలను సుఖమయం చేయడానికి సర్వవిధాలా ప్రయత్నించినవారు. పరిస్థితులు ఈవిధంగా విషమిస్తాయని వారు ఊహిస్తే రాజావారు తమ యావదాస్తిని అమృతవల్లిగారికి రాసి యిచ్చేవారు. వారు అమృతవల్లిగారికి అన్నివిధాల సహాయం చేయగోరినా ఆ కోరిక రూపుదాల్చకముందే చనిపోయారు.

అమృతవల్లిగారు రాజావారి ధనంలో సగం కోరినా ప్రభుత్వం ఇవ్వవలసి ఉంటుంది. ఆమె కోరిన పదవవంతూ ఎటువంటి షరతులూ లేకుండా ప్రభుత్వం వెంటనే యివ్వవలసి వుందని తీర్పు చెప్పడమయింది.

'వారి తరపు లాయరుగారు అమృతవల్లి గారిని చూడలేదని విచారణలో స్పష్టమయింది. వారికి ధనం అందజేసేటప్పుడు వారిని చూసి యివ్వడానికి ప్రయత్నించవలసింది''

ఈ తీర్పు అన్ని దినపత్రికల్లోనూ వచ్చింది.

కేసు గెలిచినందుకు చంద్రశేఖరాన్ని అందరూ అభినందించారు.

వెంకట్రాయుడుగారు, రామభద్రరాజుగారు చంద్రశేఖరాన్ని కౌగలించుకున్నారు.

అప్పుడు చంద్రశేఖరం దివాన్‌జీగారి అబ్బాయిని వారికి చూపించి అన్నాడు.

"ఈ శంకరంగారు, అంటే దివాన్‌జీగారి కుమారుడు సమయానికి వచ్చి సుదర్శన చక్రం అడ్డువేశారు. లేకపోతే జడ్జీగారి తీర్పుకు కావలసిన సాక్ష్యం లభించేది కాదు.




నేను ఆరు నెలలు తిరిగి తిరిగి సేకరించిన సమాచారం చివరి వరకూ నిలువలేకపో యింది. వీరు అందించిన డైరీలు సిరిపురం రాజావారి సమగ్ర చరిత్రను రచించడానికి సరిపోతాయి. అందరూ రాజావారు చాలా ఉదాత్తులని అనుకుంటారు. కాని నా దృష్టిలో రాణీగారు చాలా గొప్పవారు. మరొక స్త్రీ తన జీవిత భాగస్వామి జీవితంలో ప్రవే శించిందని తెలిసినా ఆమె ఈర్ష్యపడలేదు. భర్తను తప్పుగా అర్థం చేసుకోలేదు. ఆడకూ తురిని తల్లిదండ్రులే నడివీధిని పెట్టినా మా నవ సహజమైన అనుకంపతో ఆమెను చేర దీసి ఆశ్రయమిచ్చిన ఉత్తమురాలు రాణీగా రు''

చంద్రశేఖరానికి ఆనాటి విజయం తను చేపట్టిన మొదటి కేసు గెలవడం, ఇప్పటికీ జ్ఞాపకముంది.

జీవితంలో అరుదుగా వచ్చే యశస్సది.

ఆరోజు చంద్రశేఖరం చాలా సేపటి వరకు నిద్రపోలేదు. తెరమీది బొమ్మలవలె ఒకటి తరువాత ఒకటి సంగతులన్నీ క్రమక్రమంగా అతని మనసులో మెదిలాయి. అందరు వ్యక్తుల స్వరూపాలు స్పష్టంగా జ్ఞాపకము న్నా ఒక్క వ్యక్తిమాత్రం ఛాయామాత్రంగా నిలిచింది.

అమృతవల్లి ఎలా వుంటుంది?

ఆమె చాలా నియమవతి.

రాజావారు చనిపోయి పదిహేను సంవ త్సరాలయినా ఆమెమాత్రం బంగళాలోనే ఉంటూ దినాలు గడుపుతున్నారు. ఒకే కడు పున పుట్టిన రామభద్రరాజుగారినే ఆమె తెర తొలగించి చూడలేదు.

మరి తనను చూస్తుందని నమ్మకమే మిటి?

డబ్బు యివ్వడం, ఆమె సంతకం తీసుకో వడం తెరవెనుకనుంచే జరగాలా?

చంద్రశేఖరం చాలా సేపు ఆలోచించాడు.

లోకంలో మంచివాళ్లున్నారు.

అమృతవల్లివంటి మంచివాళ్లు లేరు.

అతను మరే ఆలోచన లేకుండా నిద్రపో యాడు.

★ ★ ★

కోర్టునుంచి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగి, డబ్బు తీసుకోడానికని విశాఖపట్నం ట్రెజరీ కి ఆర్డర్లు వచ్చేసరికి రెండునెలలు పట్టింది. అప్పుడు చంద్రశేఖరం రామభద్ర రాజుగారికి ఉత్తరం రాశాడు.

"చాలాకాలం తరువాత మనం పడిన శ్రమలు ఫలించాయి. కోర్టువారు తొమ్మిది లక్షల రూపాయలు అమృతవల్లిగారికి యిస్తు న్నారు. ట్రెజరీనుండి ఈ సొమ్ము నేను పదో తారీఖున తీసుకుంటాను. మీరు ఆనాటికి విశాఖపట్నం రావలసింది. పెద్ద సూటుకేసొ కటి మీతో తేవలసింది. నోట్లకట్టలు దానిలో పెట్టి యింటికి తెచ్చుకోవాలి. ఇంత డబ్బూ నేను స్వయంగా అమృతవల్లిగారికి చెల్లించి, సొమ్ము ముట్టినట్లు కాగితం తీసుకోవాలి. విశాఖపట్నంనుండి సిరిపురంవరకు ఇంత ధనాన్ని బస్సులో తీసుకుపోవడం మంచిదికా దు. విశ్వాసపాత్రుడైన టాక్సీడ్రైవరును చూసి తేవలసింది. అప్పుడు డబ్బు భద్రంగా గమ్యంచేరుతుంది. పదో తారీఖు ఉదయం మీకోసం ఎదురుచూస్తాను''

అనుకున్న వేళకే రామభద్ర రాజుగారు వచ్చారు.

ట్రెజరీ పని అయ్యేసరికి సాయంకాలమ యింది.

రామభద్ర రాజుగారు ఆ రాత్రి చంద్రశేఖరా నికి అతిథిగా ఉన్నారు. విజయం పొందిన తరువాత తొలి విందు లాయరుగారి యింట ఆరగించారు.

వాళ్లిద్దరూ మరునాటి ఉదయం కారులో సిరిపురం బయలుదేరారు. విశాఖప ట్నంనుండి సిరిపురానికి బస్సుప్రయాణం మూడు గంటలు పడుతుంది. కారులో వెళ్తే రెండు గంటలే పట్టింది.



రామభద్ర రాజుగారు, చంద్రశేఖరం ఉదయం తొమ్మిదిన్నరకు సిరిపురం చేరుకున్నారు. కారు తిన్నగా బంగళాకే పోనిచ్చారు. అమృతవల్లిగారు ఆసరికే స్నానం ముగించి పూజలో కూర్చున్నారు. ఆమె పూజ నుంచి లేచేసరికి పధకొండు అవుతుందని పరిచారిక చెప్పింది. సూటుకేసు బంగళా లోపల పెట్టించి యిద్దరూ తిరిగి రావడానికి బయలుదేరారు.

ఇంతకుముందు చంద్రశేఖరం చాలాసార్లు సిరిపురం వచ్చినా తీరికగా పట్టణమంతా చూడలేదు.

రామభద్ర రాజుగారు ముందు కోట చూపించారు.

కోట కోటగా అక్కడ లేదు. కోట చుట్టూ ఉండే ప్రహరీగోడ లేదు. గోడచుట్టూ కందకం లేదు. తామరపూలు కూడా లేవు.

సరస్వతీ మందిరమున్నచోట యిప్పుడు హైస్కూలు ఉంది. చంద్రశేఖరం సరస్వతీ మందిరమంటే చిన్న లైబ్రరీ అని, రెండో మూడో గదులుంటాయని అనుకున్నాడు. దానిలో పదహారు గదులున్నాయి. అవన్నీ పెద్ద గదులు, విశాలమైన వరండాలు, చు

ట్టూ చాలా ఖాళీస్థలం ఉంది. అందులో కొత్తకొత్త షెడ్లు కడుతున్నారు.

"సరస్వతీ మందిరం గోడలు మూడడుగులు మందం ఉన్నాయి. అవి రాతితో కట్టిన గోడలు. వీటిమీద సులువుగా మరో రెండంతస్తులు లేపవచ్చు. ఈ స్కూలు మునిసిపాలిటీదనుకుంటాను. మరెందుకా ప్రయత్నం చేయలేదు'' చంద్రశేఖరం ప్రశ్నించాడు.

"మునిసిపాలిటీవారు ఆవిధంగానే ఆలోచించారు. కాని ఊరిలో కొంతమంది పెద్దలు అందుకు ఒప్పుకోలేదు. పైన గదులు కడితే, చిన్న రాణీగారి పూలతోట బట్టబయలవుతుంది. వారికి తోటలో తిరగడానికి మరుగు ఉండదని వాళ్లు అన్నారు. అందుచేత ఆ ప్రయత్నాలు అంతటితో ఆగిపోయాయి'' అన్నారు రామభద్రరాజుగారు.

ఇప్పుడు పట్టణం మునిసిపాలిటీవారి అధీనమయింది. కొత్త కొత్త యిళ్లు రాజావారి కోటకు సమీపంలో లేస్తున్నాయి. బజారు కూడా విస్తరించింది. అన్నిటికన్న ముందు చెప్పవలసిన విశేషమేమిటంటే మంచి కాఫీ హోటళ్లు ఓ రెండు తెరిచారు. మూడు నక్షత్రాల హోటలు ఒకటి కట్టించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

రామభద్రరాజుగారు రాజవీధిలోనున్న తమ యింటిని చూపించడానికి చంద్రశేఖరాన్ని తీసుకుపోయారు.

నారాయణరాజుగారి కాలంలో ఆ యిల్లు బంధుమిత్రులతో నిండి, కళకళలాడుతూ వుండేది. నిత్యకళ్యాణం పచ్చతోరణమా యిల్లు. ఈనాడది చాలా పాతదయిపోయింది. రాజవీధిలో ఉందేమో చాలామందికి ఆ యింటి గురించి బాగా తెలుసు. వీధిలో చాలా పెద్ద వరండా ఉంది. ఇల్లు పెంకునేసినది. వరండాలో కర్రస్తంభాలమీద చూరు దింపారు. ముందు ద్వారం దాటగానే చాలా పెద్ద హాలు. హాలు తరువాత మళ్లీ పెద్ద వసారా. మండువా, మండువాకు యిటుపక్క అటుపక్క పడక గదులు, వెనుకను సామాను గదులు, భోజనశాల, పెరటివేపు పెద్ద వంటిల్లు, దూలాలు, ఎత్తుగానున్న ద్వారాలు, పెద్ద కిటికీలు, తలుపులు అన్నీ టేకుతో చేసినవంటే ఆశ్చర్యం వేస్తుంది. ఈనాడు వాటి ధర కొన్ని వేల రూపాయల్లో ఉంటుంది. పెరడు కూడా చాలా పెద్దది. అంతా అర ఎకరం స్థలం పెరటిలో పెద్ద నుయ్యి. పనివాళ్లు పెరటిలోకి వెళ్లడానికి, ఇటుపక్క అటుపక్క అయిదడుగులు వెడల్పుగల సందులు.

ప్రస్తుతం ఆ యింట్లో ఎవరూ ఉండడంలేదు, రెండు నెలలకింద బాంకివాళ్లు ఖాళీ చేశారు. తరువాత మరెవరూ దిగలేదు. కొంతమంది ఆ యింటిని కొనుక్కోడానికి ప్రయత్నిస్తున్నారు. రామభద్రరాజుగారు మరమ్మతులు చేయించి ఇంటికి సున్నాలు వేయించాలని అనుకుంటున్నారు.

ఆ ఇల్లు, తోటలు, భూములు నారాయణరాజుగారి పిల్లలందరికి చెందుతాయి. అమెరికాలోనున్న చిన్నమ్మాయి కూడా ఆ యింటి మీద మమకారం విడిచిపెట్టలేదు. చిన్ననాటి సంగతులకు ఆ యిల్లు సాక్ష్యమని ఆమె తమ్ముడికి రాసింది. పెరటిలో మామిడిచెట్లు, సపోటా చెట్లు, జానుచెట్లు గాలికి, ధూళికి లొంగి పెరుగుతున్నాయి.

ఆ యింటిని చంద్రశేఖరానికి చూపిస్తుంటే రామభద్రరాజుగారి కళ్ళవెంబడి నీళ్ళు కారాయి. తమ బాల్యం వైభవోపేతంగా గడిచిన ఆ యింట్లో యిప్పుడు కాలు కూడా పెట్టలేకుండా అయింది. లోపల ఏ పాములున్నాయో! అక్కడ కొంచెంసేపు గడిపి యిద్దరూ కోటవేపు నడిచారు.

అక్కడో పెద్ద బాంకుంది. దాని దగ్గిర కొత్త కారొకటి ఆగింది. దాని నుండి వెంకట్రాయుడుగారు దిగారు. అమృతవల్లి కేసుమూలంగా రామభద్రరాజుగారు, అతను చాలాసార్లు కలుసుకున్నారు. ఒకరిమీద ఒకరికి




మంచి గౌరవమేర్పడింది. అనుకోకుండా వెంకట్రాయుడుగారు సిరిపురం రావడం రామభద్రరాజుగారికి ఆశ్చర్యకారణమైంది.

"అయ్యా రాజుగారు! మీరేం కంగారుపడకండి. నేనే వీరిని ఈ సమయానికి రమ్మన్నాను. నేను డబ్బు చెల్లించినప్పుడు వీరు సాక్షిగా వ్యవహరిస్తారు'' అన్నాడు చంద్రశేఖరం.

"లాయరుగారు! మీరు కొంచెం తొందరపడ్డారేమో! మా అక్కగారు వీరి రాకను అంగీకరిస్తారోలేదో?" అన్నారు రాజుగారు.

"వీరు వెంకట్రాయుడుగారని అమృతవల్లిగారికి తెలుసా? ఇంతకు పూర్వం ఏ సందర్భంలో నేనా వీరిని చూశారా?" అడిగాడు చంద్రశేఖరం.

"ఆమెకు తెలియదు. వీరినామె ఎప్పుడూ చూడలేదు'' అన్నారు రాజుగారు.

"డబ్బు సాక్షులముందు చెల్లించాలని అనుకున్నాను. మీరు అమృతవల్లిగారికి రక్తబంధువులు. మీ సాక్ష్యం పనికిరాదు. అందుచేత వెంకట్రాయుడుగారిని, దివాన్‌జీ రామలింగస్వామి కుమారుడు శంకరాన్ని నేను ఈ పనికి ఆహ్వానించాను. అదుగో అతను కూడా మన దగ్గిరికే వస్తున్నాడు'' అన్నాడు చంద్రశేఖరం.

అందరూ బాంకుముందు నిలబడ్డారు.

రాజవీధిలో ముంగిళ్ళు రంగవల్లులతోను, గొబ్బిళ్ళతోను చూడముచ్చటగా ఉన్నాయి.

"చంద్రశేఖరంగారు! మీరొక్క వాగ్దానం చేయాలి. వీరు వెంకట్రాయుడుగారని ముందుగా అక్కగారితో చెప్పకండి. పని ముగిసిన తరువాత చెప్పవచ్చు. నాకు మాత్రం ధైర్యం చాలదు'' అన్నారు రాజుగారు.

"మీ అక్కగారి దగ్గిర మీకింత భయమని నాకు తెలియదు'' అన్నాడు చంద్రశేఖరం.

"భయంలేదు... వారి మనస్తత్వం మీకు తెలియదు. వారు అట్టే మాట్లాడరు. సంభాషణవారికి నచ్చకపోతే, మెల్లగా లోపలికి వెళ్ళిపోతారు. వారికి ఈ డబ్బుమీద ఎటువంటి ఆసక్తిలేదు. ఒకవేళ ఆమెకీవ్యవహారం నచ్చకపోతే ఈ పెద్దమొత్తాన్ని తిరిగి ప్రభుత్వానికి యిచ్చివేయమంటారు. కాబట్టి ఆమెతో చాలా జాగ్రత్తగా మాట్లాడాలి'' అన్నారు రాజుగారు.

అప్పటికి పదకొండు కావస్తున్నది.

"ఈ సరికి ఆమె పూజ ముగించి ఉంటారు. మనం బంగళాకు బయలుదేరుదాం" అన్నాడు చంద్రశేఖరం.

అందరూ బంగళావేపు నడిచారు. అది ఎడారిలో ఒయాసిస్సువలె ఉంది. నేత్రపర్వంగానే కాక మనోహరంగా ఉంది. గేటు తీసుకొని లోపలికి అడుగుపెట్టగానే వరుసలు తీర్చి విరబూచిన చేమంతులు, స్వాగతమిచ్చాయి.

రంగురంగుల గులాబులు తలలాడించాయి.

లోపలికి అడుగుపెడుతుంటే ఏదో ప్రశాంతమైన ముని వాటికలోకి ప్రవేశించినట్లయింది.

అమృతవల్లి తన తమ్ముడిని కూడా చూడలేదు. అంతవరకు తెరవెనుకనుంచే మాట్లాడారు. ఒక్క రాజాగారియెదుట మాత్రమే ఆమె ఘోషా విడిచిపెట్టారు. రాజావారి మనసులో ఏముందో? ఈ అపురూప సౌందర్యవతి, ఈ మహా విదుషి అందరి ఎదుటపడకూడదని వారనుకున్నట్లున్నారు. దానికి కారణం ఏమయిఉంటుంది? జీవితంలో ఆవిడ చాలా పెద్ద దెబ్బతింది. ఈ లోకం సరియైనది కాదు. ఆమెను అర్థంచేసుకోదు. ఏ పనికిమాలిన మనిషయినా, ముందూ వెనుకలు ఆలోచించకుండా ఆమె శీలం గురించి మాట్లాడితే, ఆమె అమృతవల్లిని అంతఃపురం ఆవరణలో, చాటుగా, మరే పురుషుల కంటబడకుండా కాపాడుకుంటూ వచ్చారు.

తనదన్న ఈ అమూల్య రత్నాన్ని ఎవరైనా అపహరించుకుపోతారని వారు భయపడ్డారా!

అమృతవల్లి సౌందర్యం అనన్య సామాన్యమైనది.

పురుషులను నమ్మడానికి వీలులేదు.

విశ్వామిత్రుడంతటివాడు మేనకపై మరులుగొన్నాడు.

బహుశా రాజావారి అనుమానం మరో విధంగా కూడా ఉండవచ్చు.

అమృతవల్లి కూడా మానవ స్త్రీయే. ఆమెకు కూడా పురుషులను చూస్తే మనసు చలించవచ్చు. ఇది ప్రకృతి లక్షణం.

అమృతవల్లి అసలు పురుషులను చూడకుండా ఉంటే ఈ పురుషులలో ఆకర్షణీయంగా ఉన్నవాళ్ళు చాలా మంది. వాళ్ళు ఆమె కళ్ళబడకుండా ఉంటే ఈ చికాకులేమీ ఉండవు.

అమృతవల్లి, ఇప్పటికి కూడా, అంటే రాజావారు పోయిన పదిహేను సంవత్సరాల తరువాత కూడా, వారి ఆజ్ఞను జవదాటలేదంటే ఏమనుకోవాలి!

ఈ సమస్యలన్నీ చంద్రశేఖరానికే.

కేసు గెలిచిన సంతోషం అతనిలో క్రమంగా తగ్గిపోతున్నది.

మళ్ళీ అతనికి జ్ఞాపకం వచ్చింది. ఆమె అన్ని శాస్త్రాలలోను పారంగతురాలు. జ్ఞానసముపార్జనే ఆమె ఏకైక లక్ష్యం. ఆమె హృదయవైశాల్యం అనంతమైనది. ఆమెవలె వివేకం కలిగిన వారు లక్షలలో ఒకరు కూడా లభించరు.

కాని ఆమెను ఒకదారికి తేవాలి. ఆ బాధ్యత అంతా తనమీదనే పడింది.

ఇంతలో పరిచారిక వచ్చి, మొక్కలమధ్య తిరుగుతున్న వారి నలుగురినీ చిన్నరాణీగారు లోపలికి రమ్మంటున్నారని పిలిచింది.

చంద్రశేఖరం గుండెలు కొట్టుకుంటున్నవి.

సంవత్సరంబట్టి ఏ దేవత కోసం అతను తపస్సు చేస్తున్నాడో, ఆ దైవం ఇపుడు సాక్షాత్కరిస్తున్నప్పుడు ఈ శంకలు దేనికి?

వాళ్ళు ఎంత మందోలేరు.

కేవలం నలుగురే.

లోపలికి ప్రవేశించగానే పెద్దహాలుంది.

ఆ హాలులో ఈ చివరనుండి ఆ చివరివరకు పెద్ద కాశ్మీరపు తివాసీ పరిచి ఉంది. గోడలకు నిలువెత్తు చిత్రాలున్నాయి. ఒకవైపు మూడు అద్దాల బీరువాలున్నాయి. వాటి నిండా వరుసలు తీర్చి పుస్తకాలున్నాయి. ఒక పక్కన ఆరు కుర్చీలున్నాయి.

ముందరో చిన్నబల్ల ఉంది.

దానిమీద గుల్‌దస్తాలో, గుత్తిగా కట్టిన గులాబీలున్నాయి.

హాలుకురెండోవేపు అమృతవల్లి కూర్చున్నారు కాబోలు.

దళసరి తెర అడ్డుగా గోడనుండి గోడవరకు విస్తరించి ఉంది.

కుర్చీలు సర్దుకుని నలుగురూ కూర్చున్నారు.

విశాలమైన కిటికీలలోంచి లోపలికి మంచి వెలుతురు వస్తున్నది.

లోపల ప్రశాంతి నెలకొంది.

"మీ అందరూ వచ్చి మాయింటిని పావనంచేశారు. అతిథులకు నా నమస్కారాలు. మా తమ్ముడు రామభద్రరాజు మిగిలినవారిని పరిచయం చేస్తే చాలాసంతోషిస్తాను'' అన్నారు తెరలోపలనుంచి అమృతవల్లి.

చంద్రశేఖరం చాలా శ్రద్ధతో ఆమె మాటలు విన్నాడు. చాలా సరళంగా, సూటిగా ఉన్నాయి. ఆ గొంతులో మృదుత్వం తప్ప ఏకోశానా కర్కశత్వంలేదు.

రామభద్రరాజుగారికి గట్టి చిక్కే వచ్చిపడింది. మాట్లాడడమంతా చంద్రశేఖరం చేస్తాడని అతను అనుకున్నారు.





దివాన్‌జీగారి కుమారుడిని పరిచయం చేయాలి. ఏదో బాధపడి ఆ పని చేయవచ్చు. వెంకట్రాయుడు విషయంలో ఏం చె య్యడం?

లాయరుగారు వెంకట్రాయుడును, తన ను అడగకుండా, పిలిపించినందుకు అతను మరీ బాధపడ్డారు.

"తమ్ముడూ! ఏమేనా యిబ్బందిగా ఉందా?"

ఆ మాటలు చాలా మధురంగా విని పించాయి వెంకట్రాయుడుగారికి

చాలా గంభీరంగా తోచాయి, చంద్రశేఖరా నికి.

"ఇబ్బంది ఏమీ లేదు. మొదటి కుర్చీలో కూర్చున్నవారు మన లాయరుగారు, చంద్ర శేఖరంగారు''

చంద్రశేఖరం కుర్చీలోంచి లేచి అన్నాడు.

"నమస్కారం అమృతవల్లిగారు. నేను చంద్రశేఖరాన్ని''

ఆమె ఆ కంఠంస్వరం జ్ఞాపకముంచుకో డానికి ప్రయత్నించి అన్నారు. "నమస్కార మండీ!"

"లాయరుగారి పక్కను కూర్చున్న వాళ్ళి ద్దరూ, మీకు డబ్బు చెల్లించడానికి సాక్ష్యంగా ఉండవలసినవారు''

ఆమె ఒక క్షణం ఆలోచించారు.

"వారి పేరులేవో తెలుసుకోవచ్చా?"

"ఒకరి పేరు నాకు తెలుసు. అతను శంకరరావు. వారు కూడా లాయరే. అంతే కాకుండా మన దివాన్‌జీగారి పెద్దకుమారు లు''

శంకరం కూడా లేచి నమస్కారాలు చె ప్పాడు.

"చాలా సంతోషం. మీ నాన్నగారు నాకు చాలా సహాయం చేశారు. నేను ఎప్పటికీ మరచిపోలేను''

అది అవహేళన కాదు గదా!

చంద్రశేఖరానికి ఒక్క సంగతి తెలుసు.

అమృతవల్లి ఎవరినీ నిందించరు. చులక నగా మాట్లాడరు.

ఆవిడ హృదయంలోంచి వచ్చిన కృతజ్ఞ తలవి.

"తరువాత వారు?" అమృతవల్లి మళ్ళీ అడిగారు.

"వారిని చంద్రశేఖరంగారు రప్పించారు'' అన్నారు రాజుగారు.

"సావకాశంగా వారి గురించి మీకు మనవి చేస్తాను. అంతవరకు వారిని రెండవ సాక్షిగానే పరిగణించండి'' అన్నాడు చంద్రశే ఖరం.

"మీ అందరినీ మరోసారి అభినందిస్తు న్నాను. మీరు కాఫీ, ఫలహారాలు చేశారా?"

"రామభద్రరాజుగారు అన్నింటిపట్ల శ్రద్ధ వహించారు'' అన్నాడు చంద్రశేఖరం.

తరువాత అమృతవల్లి మాట్లాడారు.

"చంద్రశేఖరంగారు! మన కేసు గురించి మా తమ్ముడు అప్పుడప్పుడూ చెప్పేవాడు. నేనంత శ్రద్ధగా వినలేదు. మీకు అభ్యంతరం లేకపోతే అంతా వివరంగా చెప్పండి. చెప్పే ముందు, మావాళ్ళు అందించే పాలు అంద రూ తీసుకోండి. ఇది మీయిల్లు. మీరిక్కడ స్వేచ్ఛగా వ్యవహరించవచ్చు''

"శరీరానికా, మనస్సుకా?" చంద్రశేఖర మే అడిగాడు.

"అన్నివిధాల స్వేచ్ఛ''

"మీరు చాలా చదువుకున్న వాళ్ళు. కాని, మీకూ మాకూ మధ్య నొక తెర. నేను చెప్పవలసినవి చాలా ముఖ్యమైన విషయా లు. మీరు నా మాటలకు ఎలా స్పందిస్తు న్నారో తెలిస్తే నా సంభాషణను మీకు అంగీకారంగా ఉండేటట్లు దిద్దుకుంటాను. వీటి వేటికి నాకు జడుపులేదు. కోర్టులో విచారణ చివరిదశకు చేరుకున్నప్పుడు జడ్జీ గారు నన్నొక ప్రశ్న వేశారు. నేను మిమ్మల్ని



చూశానా అని వారు అడిగారు. వారికి నేనేం సమాధానం చెప్పగలను?"

ఆమె నవ్వినట్లున్నారు.

"నిజమే! మీరు నన్ను చూడలేదు''

"మీ గురించి, మీకు తెలియని విషయాలు చాలా సేకరించి కోర్టు వారి పరిశీలనకు సమర్పించాను. అభమూ శుభమూ ఎరుగని వయసులో, అంతఃపురం చూసిరావాలని వెళ్ళిన మీరు, రాణీగారి ఔదార్యంతో సర్వాలంకార భూషితులయారు. రాణీగారు 'ఏమి ఆశించారో తెలియదు. కాని, రాజావారిని చూసి మీరు చలించారు. రాజావారు రాణీగారిని చూడవలసిన తూగుటుయ్యాలలో మిమ్మల్ని చూశారు. రాణీగారిని ప్రభువులు ఎంత ప్రేమతో చూస్తారో, మిమ్మల్ని కూడా అలాగే చూసి వారు తనువు మరచిపోయారు. అది మీ తప్పుకాదు. మీకు కట్టించిన కొత్త పట్టుచీర, రాణీగారి పుట్టిన దినానికని రాజావారు ప్రత్యేకంగా బరంపురంలో పురమాయించి తెప్పించారు. రాణీగారి శరీరచ్ఛాయను దృష్టిలో ఉంచుకొని, నెమలి కంఠంరంగును వారు ఎంపికచేశారు''

చంద్రశేఖరం మాట్లాడడం ఒక క్షణం ఆపాడు.

లోపలి నుంచి ఎటువంటి ఆదేశమురాలేదు.

పక్కన కూర్చున్నవాళ్ళు కూడా అంత ఆసక్తితోనూ వింటున్నారు. వారికి తెలియని విషయం, ఇతడేదో చెప్తాడని వాళ్ళు ఎదురు చూశారు.

చంద్రశేఖరం తిరిగి మాట్లాడాడు.

"రాజావారు సర్వాలంకారాలలో, కొత్త పట్టుచీర కట్టుకున్న సుందరిని చూసి ఒక క్షణం తాను పొరపాటు చేశానేమోనని బాధపడ్డారు. తాము రాణీగారి పుట్టినదినం మరచిపోయినందుకు చాలా నొచ్చుకున్నారు. వారు ప్రత్యేకంగా రంగును నిర్దేశించి తయారు చేయించిన నెమలి కంఠంరంగు చీరలో, రాణీగారు ఎంత దివ్యంగా ఉన్నారో అని అబ్బురపడ్డారు. మనసులో కలిగిన ఈ మార్పులన్నీ వారి చూపులలో ద్యోతకమయాయి. వారు నిజం గ్రహించేసరికి పదిహేను నిమిషాల కాలం ముందుకురికింది. దీనికి రాజావారు ఎంతవరకూ బాధ్యులు? ఈ ప్రశ్న ఇప్పటికీ కూడా నన్ను విడిచిపెట్టడం లేదు''

చంద్రశేఖరం కొంచెం ఆవేశంతోనే మాట్లాడుతున్నాడు.

అమృతవల్లి నవ్వినట్లు కూడాలేదు.

అంతటా నిశ్శబ్దం.

తరువాత అమృతవల్లి మాట్లాడారు...

"చంద్రశేఖరంగారు! మీరు లాయరుగారు కారు. మీరు కవులు. మీ సంభాషణ ఎంత మధురంగా ఉంది! మీరు చెప్పిన సంగతులు నేను యిప్పటికి కూడా ఆ విధంగా ఊహించలేదు. ఇంతకాలం వారు అనురక్తులై, నా సౌందర్యానికి మోహితులై అనిమేషులై నన్ను చూశారని అనుకున్నాను''

"మీకీసంగతి తెలుసు. అయినా మరోసారి చెప్పడంలో దోషంలేదు. శ్రీరామచంద్రమూర్తి ధర్మాన్ని తెలిసినవాడు. సత్యసంధుడు. మానవులు చేసే పొరపాట్లకు తాను అతీతుడుకాడు. ఒకొక్కసారి అతను తను చేసిన తప్పిదం తెలుసుకొని, మనసును నిగ్రహించి, ధర్మపథంవేపు మళ్ళుతాడు. రాజావారిని ప్రజలందరూ శ్రీరామచంద్రుడని కొనియాడడంలో పొరపాటులేదు. రాజావారు నూటికి నూరుపాళ్ళు ఆ పురాణ పురుషుడి అవతారమే. తాము చూస్తున్నది పదహారేళ్ళ బాలికనని, తమ ధర్మపత్ని కాదని తెలుసుకున్న క్షణంలోనే వారు చూపులు మరల్చుకున్నారు''

చంద్రశేఖరం కొంచెంసేపు మౌనంగా ఉన్నాడు... తరువాత అన్నాడు...




"రాజావారు ఏకపత్నీవ్రతులు. కలలో కూడా అన్యకాంతను చూడడానికి ఇష్టపడని వారు. తాము చేసిన పొరపాటును వారు గ్రహించారు. ఏదో ధర్మలోపం జరిగింది''

ఎవరూ ఏమీ అనలేదు.

"అమృతవల్లిగారు! ఈ సందర్భంలో మిమ్మల్ని ఒక ప్రశ్న వేస్తాను''

"తప్పకుండా వేయండి''

"మీరు పగలు నేర్చుకున్న పాఠమో, సంగీతమో, నాట్యమో, తీరికగా రాత్రివేళ సాధన చేసేవారు. మీ బంగళాకు పక్కనే సరస్వతీ మందిరముంది. ఆ మందిరం ఆవరణలో, ఒక సాహిత్య సర్వజ్ఞుడు, సంగీత ప్రేమికుడు, ఒక నాట్యవిద్వాంసుడు, కళాభిమాని, లానులో కుర్చీవేసుకొని, బంగళానుంచి వచ్చిన ప్రతి శబ్దాన్ని దీక్షగా విన్న సంగతి మీకు తెలుసా?"

ఆమె ఆలోచిస్తున్నది. వెంటనే జవాబు చెప్పలేదు.

"మీ బంగళానుంచి వచ్చే మధుర సంగీతంకోసం పగలు ఒక మహానుభావుడు గంటలు లెక్కబెట్టుకున్న సంగతి మీకు తెలుసా?"

"నాకు తెలియదు''

"అదెంతకాలం జరిగిందో తెలుసా?"

"అది కూడా తెలియదు''

"ఎప్పుడది ఆగిపోయిందో..."

"ఇవేవి నాకు తెలియవు''

"ఈ విషయాలన్నీ మీకు వివరంగా చెప్తాను. మీతోపాటు నాపక్కనే కూర్చున్న వ్యక్తులు వింటారు. ఇవి చాలా రహస్యమైన విషయాలు. కోర్టులో కూడా వీటిని చెప్పలేదు. న్యాయమూర్తులకు నిజానిజాలు తెలియాలి. వారి పరిశీలనకుమాత్రమే ఈ వివరాలను రాసి వారికిచ్చాను. మీకు అభ్యంతరముంటే చెప్పండి. ప్రసంగం ముగిస్తాను''

"మీరు సర్వం చెప్పవచ్చు. మీతోనున్న ముగ్గురూ మన ఆప్తులు. మనమందరం చిన్నపిల్లలం కాము. ఎటువంటి సంకోచం లేకుండా మీరు చెప్పవచ్చు''

అపుడు చంద్రశేఖరం తాను దివాన్‌జీగారి డైరీలనుండి తెలుసుకున్న విషయాలు వివరంగా చెప్పాడు.

అందరూ మంత్రబద్ధులై వింటున్నారు.

స్వప్న వృత్తాంతాన్ని అతను అంత మధురంగాను చెప్పాడు.

అమరు శతకంలో ఆనాటి రాత్రి అమృతవల్లి చదివిన శ్లోకాలను అంత అర్థవంతంగా చదివాడు వ్యాఖ్యానించాడు.

'గాఢాలింగన వామనీకృత...' అన్న శ్లోకాన్ని రెండుసార్లు వినిపించాడు.

అన్నీ అయినతరువాత చివరగా అతను అన్నాడు...

"రాజావారు, తాము కలలో కన్నది, జ్ఞాపకపు పొరల అడుగున దాగిన కోరికగా పరిగణించారు. ఈ తప్పు- ఈ పొరపాటు- ఈ ధర్మలోపం జరిగినందుకు అతను చాలా చింతించారు. దీనిని వారు రహస్యంగా ఉంచుకోలేదు. రాణీగారికి నివేదించారు. పాపానికి ప్రాయశ్చిత్తంగా ఆనాడు ఉపవాసమున్నారు. వేణుగోపాలస్వామికి సహస్రనామార్చన చేయించారు. రాజా వేంకటరంగారావుగారు సాక్షాత్తు శ్రీరామచంద్రులు కాక మరేమవుతారు?"

ఆమె ముఖంలో ఏం మార్పులు వచ్చాయో తెలియదు. కాని ఆమె వెక్కివెక్కి ఏడుస్తున్నారు.

చంద్రశేఖరం ఒక్క పదినిమిషాలు ఊరుకున్నాడు.

ఆమె కన్నీళ్ళు తుడుచుకుంటున్నారు కాబోలు.

అమృతవల్లిని బాధపెట్టడం న్యాయమేనా?

న్యాయమో అన్యాయమో, దశాబ్దాల

నుండి ఆమె లోకానికి కనిపించకుండా, ధర్మ ప్రభువులు కట్టిన తెరని తొలగించడానికి ఇన్ని శ్రమలు పడక తప్పలేదు.

"మరొక్క సంగతి మీకు మనవి చేస్తాను. ఈ జ్ఞాపకాలు మీ మనసును కలవర పెడితే నన్ను క్షమించండి''

"చెప్పండి. మీరు చెప్తున్న వాటిలో చాలా వరకు నాకు తెలియని విషయాలే!"

"రాణీగారు పరమపదించారు. రాజావారు ప్రియ భార్యా వియోగాన్ని భరించలేకపోయారు. వారు దేహ త్యాగంచేసే పరిస్థితులు ఏర్పడ్డాయి. అపుడు రాజావారిని ఒకదారికి తేవలసిన ఆవశ్యకత కలిగించి దారికి తేవడం కాదు వారి ప్రాణాలను నిలపడం, మీరు వినయ వివేక సంపన్నులు, బహుశాస్త్ర పురాణవేత్తలు. రాజావారు జీవించాలంటే వారి మనసును మరొకవేపు మళ్ళించవలసిన అత్యవసరం ఏర్పడింది. మీ ధ్యేయం ఒకటే, రాజావారు సుఖంగా శేషజీవితం గడపాలి.

ఆవిడ, ఆమెతోపాటు అందరూ వింటున్నారు.



"అందుకు మీరు ముందు వెనుకలాలోచించలేదు. ధర్మాధర్మాలను విచారించలేదు. లోకాపవాదానికి భయపడలేదు. మీ హృదయాన్ని, మీ శరీరాన్ని వారి పాదాల ముందుంచారు. ఆ మహానుభావులకు పురాణాలు వినిపించారు. నీతులు బోధించారు. లోక వృత్తం తెలియజేశారు. వారు ఒక దారికి వచ్చిన తరువాత సంగీత సాహిత్యాలలో వారిని ఓలలాడించారు. వారు బాగా కోలుకున్న తరువాత మీ నాట్య కౌశలం ప్రదర్శించారు. మీ మువ్వలచప్పుడు మాత్రమే రాజావారు ఎరుగుదురు. అదికూడా ప్రచ్ఛన్నంగా. మీకా సంగతి తెలియదు. రాజావారిని రంజింపచేయడానికి నాట్యాన్ని కూడా ప్రదర్శించారు. చాలాకాలం ఆగి ఆ పని చేశారు. రాజావారికి మార్గరీతులలో మీ నాట్యం చూపించారు. కాని, వారు ఎంతవరకు ఆమోదించారో! వారి దృష్టిలో చిట్టిరాజు తప్ప మరొకరు నాట్యం చేయలేరన్న అభిప్రాయం ఉండిందేమో! ఆ హేమాంగి మీ గురువులు, ఆవిడ తన్నుతాను పొగడుకోడమే చేసేది. మీరు అవికర్థనులని, ప్రశంసలను పసందుచేయరని ఆమెకేం తెలుసు? ఆమె చెప్పినది స్వల్పం, మీ సాధన అనల్పం"

అమృతవల్లి వింటున్నారు.

ఈ మాటలన్నీ చంద్రశేఖరం కోర్టులో ఆడినవేనా?

చాటునుండే బ్రతుకు సభకు రాజేశాడా?

అతను చెప్పినదంతా సత్యమే.

ఒక్కటి కూడా అతిశయోక్తి కాదు.

ఇంతలో వంట మనిషి అందరికీ పళ్ళరసాలు పంపించింది.

అపరాహ్నం దాటిపోయింది.

వచ్చిన పని వెనక్కు పెట్టి కుర్ర లాయరు ఉపన్యాసానికి ఉపక్రమించాడు.





కోర్టులో జడ్జిగారిని మెప్పించాడు.

అమృతవల్లిని మెప్పించగలడా?

ఆమె స్థితప్రజ్ఞ!

ద్వంద్వాతీతమయినది.

అతనికి ఉన్నపాటున నవ్వు వచ్చింది.

అన్నీ బాగానే వున్నాయి. మరి ఈ తెర వెనుక కార్యక్రమమేమిటి?

తన సౌందర్యాన్ని రాజావారే తప్ప మరొకరు చూడరాదనే నియమం పెట్టుకున్నారా?

మరేదైనా లక్ష్మణరేఖను దాటలేకపోతున్నారా?

అమృతవల్లి ఎలా ఉంటారో కొంచెం కూడా ఎవరూ ఊహించలేకపోతున్నారు.

చంద్రశేఖరం ఆలోచనలన్నీ క్రమబద్ధం చేసుకున్నాడు.

ఆమె కూడా పండ్లరసం తాగినట్లున్నారు.

"మిమ్మల్ని చాలా యిబ్బంది పెడుతున్నాను. 'ఇబ్బంది' అన్నది సరియైన పదం కాదు. మీ మనసును క్షోభపెడుతున్నాను''

ఆమె నవ్వినట్లున్నారు.

"చంద్రశేఖరంగారు! నాకు ఎటువంటి ఇబ్బందీ కలగడంలేదు. నా మనసు ఏదో చెప్పలేని ఆనందతరంగాలలో ఊగిసలాడుతున్నది. ఇంతవరకు నేను ఎవరి ఉపన్యాసాలూ వినలేదు. గురువులు శాస్త్రమే చెప్పారు. ఇటువంటి ప్రసంగం వారు చేయలేదు. మీరు అన్ని సందేహాలను విడిచిపెట్టి మాట్లాడండి''

"చిట్టి రాజు మెరుగులు, నాట్యంలో చూపించే ఒంటి విరుపులు, చూసి రాజావారు భ్రమించారు. మిమ్మల్ని ఆమెకు శిష్యురాలిగా చేసేముందు వారొక సంగతి చెప్పారు. శుద్ధ దేశీరీతిలో అంటే వారి అభిప్రాయంలో - జావళీలు పదాలు అన్నమాట - వాటిని అభినయించడం మీకు నేర్పమని చెప్పారు. బహుశా వారు హేమాంగి నాట్యానికి తృప్తి చెందినట్లు లేదు. మీ మువ్వల చప్పుడు విని వారు హేమాంగి నాట్యాన్ని ఊహించుకునే

వారు. గణికయైన చిట్టిరాజుకి అంగప్రత్యంగ ప్రదర్శన వెన్నతో పెట్టిన విద్య. మీవంటి సద్వంశ జాతులకు అది నిషిద్ధం. కాని రాజావారికి ఒక సంగతి తెలియదు. కామాన్ని పెంపొందించుతుందని అందరూ భావించే ఈ అభినయం, మధురభక్తి దృష్టిలో పదకర్తల హృదయం తెలుసుకొని చేస్తే పరమ రమణీయంగా ఉంటుందని వారికి తెలియదు. ఒక స్థితికి వచ్చిన తరువాత చిట్టిరాజు చేసే నాట్యం రాజావారి హృదయంపై ఎటువంటి దుష్ప్రభావం కలిగించిందో మీరు తెలుసుకున్నారు. ఒక రాత్రి రాజావారు కలలో కూడా ఊహించనివిధంగా మీరు 'మంచిదినము నేడే...' అన్న క్షేత్రయ్యగారి పదాన్ని అభినయించారు. తరువాత 'మధురానగరిలో...' అన్నదానిని అభినయించారు. ఎన్నోసార్లు రాజావారు కోరి కోరి మిమ్మల్ని అభినయించమన్నారు. వారికి అప్పుడు తెలిసివచ్చింది - వారి మనసులోని తెరలన్నీ తొలగిపోయాయి. మీరు విదుషీమణి కారు, దేవత అని వారు భావించారు. రాజా వేంకటరంగారావుగారు తమ శేష జీవితాన్ని మీ ఉద్బోధనవలన, సంగీత సాహిత్య నాట్యాలవలన పరిపూర్ణంగా తమ మనసులో కోరికలన్నీ తీరగా, జన్మ తరించిందని భావించారు''

ఆమె వింటున్నారు. ఆ హాలులో తాండవించిన నిశ్శబ్దం, అందరూ అంత శ్రద్ధతోను వింటున్నారని రుజువుచేసింది.

మళ్లీ చంద్రశేఖరం మాట్లాడటం మొదలు పెట్టాడు.

"మీరు రాజావారి మనసులోని తెరలు తొలగించారు. కాని..."

అమృతవల్లి పకాలున నవ్వారు.

తెర వెనుక మనుషులు కదలిన సవ్వడి.

కొద్దిసేపటిలో వీణ తీగలు సవరిస్తున్న ధ్వని.

తరువాత తంత్రులమీద రాగాలాపన...

కొద్దిసేపటిలో త్యాగరాజస్వామివారి కృతి

'తెర తీయగరాదా! నా మనసులోని తెర..'

ఆమె వీణ వాయిస్తున్నారు. వాయిస్తూ దానికి తన గొంతు కలిపారు.

తెరకివతల కూర్చున్న నలుగురు ప్రాన్పడిపోయారు.

ఎప్పుడు తెర తొలగిందో! ఎప్పుడు వీణా గానం ఆగిందో!

వారి ఎదుట పుష్పమాలాలంకృతుడై, రుక్మిణీ సత్యభామా సమేతుడైన వేణుగోపాల స్వామివారి విగ్రహం పూజామందిరంలో దివ్యకాంతులనీనుతూ దృష్టిపథంలో పడింది.



ఆమె అమృతవల్లి కాదు

సాక్షాత్కరించిన సరస్వతీదేవి

కాళిదాసు 'మేఘసందేశం'లో యక్షిణిని వర్ణించినప్పుడు 'సృష్టిరాద్యేవధాతుః' అంటాడు.

బ్రహ్మ సృష్టించిన అత్యుత్తమ సౌందర్యవతులలో యక్షిణి మొదటిదయితే,

తన అనుభవాన్ని, కౌశలాన్ని ఆ పితామహుడు వినియోగించి సృష్టించిన మహా సుందరి

అమృతవల్లి...

యక్షిణికి సంగీత సాహిత్యాలు వచ్చు.
అమృతవల్లికి అవి కొట్టినపిండి
ఆమె చూపులలో నైర్మల్యం
ఆమె ముఖంలో తేజస్సు
ఆమె నడకలో నమ్రత
ఇలా ఎన్నని చెప్పడం?

"ఒక సంవత్సరంనుండి నేనొక దేవత కోసం తపస్సు చేశాను. ఈనాడు ఆ దేవతా మూర్తి ప్రత్యక్షమయింది'' అన్నాడు చంద్రశేఖరం.

రామభద్రరాజుగారు కనుల కరువుదీరా పెద్దక్కగారిని చూశారు. ఆమె ముతక ఖద్దరు చీర కట్టుకున్నారు. ఆ బట్టతోనే కుట్టిన రవిక తొడుక్కున్నారు. ఆమె మెడలో ఒంటిపేట బంగారు గొలుసు వేలాడుతున్నది. చేతులకు రెండు జతల బంగారు గాజులున్నవి. చాలా నిరాడంబరంగా వున్నారు.

రామభద్రరాజుగారి కళ్లంట ధారలుగా నీళ్ళు - అవి ఆనందభాష్పాలు.

వారు అక్కగారికి సాష్టాంగప్రణామం చేశారు.

"మాకున్న పెద్ద దిక్కు మా అక్కగారే! ఈనాటికి వీరిని కళ్ళారా చూసే భాగ్యం కలిగింది'' అన్నారు ఆయన.

చంద్రశేఖరం వెంకట్రాయుడిగారిని చూపిస్తూ అన్నాడు

"ఇందాకా అందరినీ పరిచయం చేశాను. వీరి గురించి తరువాత చెప్తానన్నాను. వీరు వెంకట్రాయుడుగారు... మన రాష్ట్రంలో పెద్దవాటిలో ఒకటైన పంచదార మిల్లుకి మేనేజింగు డైరెక్టరుగారు. వీరి గురించి మీకు తెలుసనుకుంటాను..."

ఎదురుగుండా చాపమీద కూర్చున్న అమృతవల్లి లేచి నిలుచున్నారు.

వెంకట్రాయుడుగారికి నమస్కరించారు.

"నావలన మీకు చాలా బాధలు కలిగినందుకు విచారిస్తున్నాను. మీరొక యింటివారై, పిల్లాపాపలతో సుఖంగా ఉన్నారని నేను అనుకుంటున్నాను'' అన్నారు ఆమె.

"ఇప్పటికి కూడా వీరు వివాహం చేసుకోలేదు. ఒంటరిగా ఉంటున్నారు. ఒకసారి మిమ్మల్ని భార్యగా స్వీకరించాలని నిశ్చయించుకున్న తరువాత మరొకరిని పెళ్లాడడానికి వారు అంగీకరించలేదు'' అన్నాడు చంద్రశేఖరం.

"నేను చాలా విచారిస్తున్నాను'' అన్నారు ఆమె.

"మీరు విచారించకండి. నన్ను మీరు ధర్మపథంలో నడిపిస్తున్నారు. నేను ఊహించినట్లే మీ మూర్తి నేను తప్పు చేస్తే కనిపించకుండా పోతుంది. దారిలోపడితే సాక్షాత్కరిస్తుంది. మంచిపని చేస్తే సంతోషిస్తుంది'' అన్నారు వెంకట్రాయుడుగారు.

అమృతవల్లి నవ్వింది.

"రామభద్రరాజుగారు మీగురించి కోర్టుకు వెళ్తున్నారంటే వీరు కేసు వాపసు చేసుకోమన్నారు. మీ పోషణకు లక్షలు యిస్తామన్నారు'' అన్నాడు చంద్రశేఖరం.

అమృతవల్లి వెంకట్రాయుడుగారివైపు తిరిగి అన్నారు, "మీకు నేనెప్పుడూ కృతజ్ఞురాలిని. మనం భార్యాభర్తలుగా జీవించలేకపోయినా మంచి స్నేహితులుగా ఉండవచ్చు. దీనికి మీ అభ్యంతరమేమీ లేదుకదా?"

"ఇంతకన్నా నేనేం కోరగలను?"

అప్పటికి మధ్యాహ్నం రెండుగంటలయింది.

భోజనాల శాలలో వంటావిడ విస్తళ్లు వేస్తున్నది. అతిథులు కాళ్లు చేతులు కడుక్కొని, లోపలికి వెళ్లబోతూ పూజామందిరం దగ్గిర ఆగిపోయారు.

లోపల వేణుగోపాలస్వామి విగ్రహముంది. స్వామివారికి ఇరుపక్కల రుక్మిణి సత్యభామలున్నారు. ఆ మూడు విగ్రహాలు వెండితో చేసినవి. రెండడుగుల ఎత్తు స్వామి




వారి విగ్రహం - అతను పిల్లనగ్రోవి ఊదుతున్నాడు. ఇటుపక్క అటుపక్క వెండి ప్రమిదలలోని దీపాల కాంతిలో విగ్రహాలు మెరుస్తున్నాయి.

అమృతవల్లిగారు కొంచెం ముందుకొచ్చి వాళ్లతో అన్నారు-

"స్వామివారి గురించి ఒక విశేషం మీకు చెపుతాను. ఇంతవరకు ఎవరితోనూ ఆ సంగతి చెప్పలేదు. మీరు విగ్రహాలను చూసి ఆనందిస్తున్నారు. ఈ వెండి విగ్రహాలలో అంత మహాత్యముందని తెలిస్తే మీరు ఆశ్చర్యపోతారు''

లోపలినుంచి వంటావిడ అందరినీ రమ్మంటున్నది భోజనాలకు.

"భోజనాలయిన తరువాత సావకాశంగా చెప్పమన్నారా?"

"మాకు కూడా భోజనంకన్నా భగవంతుడే ముఖ్యమైనవాడు. మరికొద్దిసేపు భోజనాలు ఆలస్యమైనా పరవాలేదు'' అన్నాడు చంద్రశేఖరం.

"రాణీగారు నాకీ విగ్రహాలు ప్రత్యేకంగా చేయించి, ఒక కృష్ణాష్టమినాడు యిచ్చారు. ఈ వూరివాళ్లందరికీ వేణుగోపాలస్వామే కుల దైవం. నా అదృష్టానికి చాలా మురిసిపోయాను. స్వామివారికి నా కష్టసుఖాలు నిత్యం నివేదించుకుంటాను. రాణీగారు పరమపదించారు. రాజావారు స్వర్గస్థులయ్యారు. చివరకు దివాన్‌జీగారు కూడా పోయారు. ఈ యింట దాసీజనం తగ్గిపోయింది. వంటావిడ, మరొక్క పరిచారిక మాత్రం మిగిలారు. దినాలు గడవడం చాలా కష్టమయింది. ఒకరోజు పరిచారిక ఎక్కడికో వెళ్లి తిరిగి రాలేదు. వంటావిడ మందు తెచ్చుకోడానికి వైద్యుడి దగ్గిరకు పోయింది. ప్రకృతి విజృంభించింది. ధారాపాతంగా వర్షం. హోరున గాలి. ఉరుములు, మెరుపులు, పిడుగులు. ఎప్పుడూ నేను ఒంటరిగా ఇంత పెద్ద బంగళాలో ఉండలేదు. లోపల దీపాలు ఆరిపోయాయి. చివరకు పూజామందిరంలో వెలిగించిన నూనె దీపాలు కూడా నిలవలేదు..."

అందరూ ఎంతో ఆసక్తితో వింటున్నారు. రామభద్రరాజుగారికి చిన్నతనంలో కథలు చెప్పిన అక్క జ్ఞాపకం వచ్చింది.

"రాణీగారు, రాజుగారు నన్ను విడిచి వెళ్లిపోయారు. కళలన్నీ నేర్చుకున్నా నా జీవితం నిరర్థకం. బతికుండీ ప్రయోజనమే ముందనిపించింది. విరక్తి కలిగింది. ఈ బంధనాలనుండి, ఈ ఒంటరితనంనుండి పారిపోవాలనిపించింది. ఏ కాశీకో పోయి మిగిలిన రోజులు భగవంతుడి సన్నిధిలో గడపాలని అనిపించింది. ఈ ఆలోచన రావడమే తరువాయి నేను లేచి నిలుచున్నాను. పూజామందిరంనుండి విసురుగా బయటికి పోదలిచాను. అప్పుడో అద్భుతం జరిగింది..."

ఒక్కక్షణం ఆమె ఆగారు. తరువాత చెప్పారు.

"గదినుండి బయటికి నడవాలని అనుకున్న నేను ముందుకు కాలు వేయలేకపోయాను. నా చీర కొంగు పట్టుకొని ఎవరో వెనుకనుండి లాగుతున్నారు. చాలా పెద్ద మెరుపు బయట మెరిసింది. ఆ మహా కాంతిలో వెనుదిరిగి చూసిన నాకు కొంటెగా నవ్వుతూ నా కొంగు పట్టుకున్న వేణుగోపాలస్వామి వేణువు కనిపించింది!

అందరి ఆశ్చర్యానికి అంతులేదు.

భోజనశాలలో వడ్డన జరిగింది. అమృతవల్లి కూడా వారికెదురుగా భోజనం చేయడానికి కూర్చున్నారు.

"మీరందరూ నా అతిథులని అనను. మీరు నావాళ్లు. మీరు మీ కుటుంబాలతో వచ్చి ఈ యిల్లు కళకళలాడేటట్లు చేయండి''

చంద్రశేఖరానికి ఏదో జ్ఞాపకం వచ్చింది.

"మీ యింట మీ పినతండ్రిగారి అమ్మాయికి పెళ్లయింది. పెళ్లి భోజనాల గురించి మీకు పాలుకొలిచే రామాయమ్మ చాలా గొ

ప్పగా చెప్పింది. అంత పెద్ద విస్తరి, చుట్టూ వ్యంజనాలు - మళ్లా, ఈ వడ్డించిన విస్తర్లు చూస్తుంటే నాకు అదే భావన కలుగుతున్నది'' అన్నాడు చంద్రశేఖరం.

"నా జీవితంలో ఇది చాలా మహత్తరమైన దినం. తమస్సునుండి వెలుగుకి నన్ను మీరు తీసుకొచ్చారు. ఇటువంటి అవకాశాన్ని నేను వృధా పోనియ్యలేను. నా మనసు తెలుసుకున్న రామాయమ్మగారు అన్నీ తయారుచేశారు'' అన్నారు అమృతవల్లి.

"ఇన్ని సంవత్సరాలు మీ ఆరోగ్యం భద్రపరచిన ఈ భద్ర మహిళకు మా నమస్కారాలు'' అన్నాడు చంద్రశేఖరం.

"భోజనం ప్రారంభించేముందు నేను మరొక్కసారి చంద్రశేఖరంగారు నాకు చేసిన మహోపకారాన్ని తలచుకుంటున్నాను. ఆయన యువకులు. అయినా మంచి దూరదృష్టి గలవారు. అన్ని ఆచారాలనూ, మర్యాదలనూ, పట్టింపులను నానుండి దూరంచేశారు. వసుధ అంతా ఒక్క కుటుంబం అని నేను చదువుకున్నాను. కాని ఈ దినం ఆ సూక్తిని ఆచరణలో పెట్టించిన ఘనత మన లాయరుగారికే చెందుతుంది'' అన్నారు అమృతవల్లి.

భోజనాలు అయిన తరువాత అందరూ కొంచెంసేపు విశ్రమించారు.

సాయంకాలం నాలుగు గంటలకు అందరూ తివాచీమీద కూర్చున్నారు హాలులో పొద్దున్న లోపల పెట్టించిన సూట్‌కేసును అక్కడికి తెప్పించారు. చంద్రశేఖరం సూట్‌కెసు తెరుస్తూ అన్నాడు

"ప్రభుత్వంవారికి రాజావారి ఆస్తులనన్నిటినీ అమ్మడంవలన తొంభై లక్షలు వచ్చింది. ఆ సొమ్ములో పదవవంతు, తొమ్మిది లక్షల రూపాయలు మనకు యిచ్చారు. ట్రెజరీలో నేను, రామభద్రరాజుగారు లెక్కబెట్టి తెచ్చాం. మళ్లీ మరొకసారి లెక్కబెట్టి మీకు యిస్తున్నాము. స్వీకరించవలసింది''

ఆమె ఏమీ అనలేదు.

చంద్రశేఖరం నోట్లకట్టలు మాత్రం లెక్కపెట్టాడు. అన్నీ కొత్త నూరు రూపాయలనోట్లు. తొంభై కట్టలు లెక్కబెట్టి వెంకట్రాయుడు గారికిచ్చాడు. అతను లెక్కబెట్టి శంకరానికిచ్చారు. శంకరం రామభద్రరాజుగారికిచ్చాడు.

రామభద్రరాజుగారు ఆ సంపదను రెండు వెండి పళ్లాల్లో నింపారు.

ఆ ధనాన్ని అమృతవల్లి పూజామందిరంలో వేణుగోపాలస్వామి ముందుంచారు.

తరువాత అమృతవల్లి రామభద్రరాజుగారితో అన్నారు,

"తమ్ముడూ! లాయరుగారి ఫీజు ఎంత యివ్వాలో ఈ పళ్లెంలో ఉంచు''

"వారికి మనకు లభించినదానిలో పదవవంతు ఇవ్వాలి''

ఆమె ఎటువంటి ఆశ్చర్యాన్ని ప్రకటించలేదు.

వెండిపళ్లెంలో పెట్టిన లాయరుగారి ఫీజును ఆమె హాలులోకి తెచ్చారు.

"చంద్రశేఖరంగారు చాలా గొప్ప పని చేశారు. నాకు లభించిన ధనంలో సగమిచ్చి నా వారి రుణం తీర్చుకోలేను. మా తమ్ముడు కేవలం పదోవంతే చెప్పాడు... స్వీకరించండి''

చంద్రశేఖరం ఆ డబ్బు తీసుకున్నాడు.

రాతకోతలు అన్నీ అయిపోయాయి.

"అమృతవల్లిగారూ! మీరు మరోవిధంగా భావించకుండా వుంటే నా మనసులో కొట్లాడుతున్న సంగతిని చెప్పాలనివుంది'' అన్నాడు చంద్రశేఖరం.

"చెప్పండి..."

"మీరు కళల్లో నిష్ణాతులు. మీకు బోధించవలసిన విషయాలు తమ దగ్గర మిగలలేదని మీ గురువులు బహిరంగంగా చెప్పారు.




ఇంతకాలం మీరు ఈ బంగళాలో గృహని ర్బంధంలో ఉన్నారు. రాజదంపతుల యాత్ర లకు మిమ్మల్ని రమ్మన్నా మీరు వెళ్లలేదు. ఒకవిధంగా ఆలోచిస్తే రాజావారు స్వార్ధపరు లని నాకు తోస్తున్నది. వారు తమ ఆనందంకోసం, మీరు ఆత్మానందంకోసం కళలను వినియోగించుకున్నారు. ఇప్పుడు రాజావారు లేరు. మీరుమాత్రం ఉన్నారు. మీకు భగవంతుడు అనుగ్రహించిన జీవితం చాలా ఉంది. ఒకరికి చెప్పడంవలన విద్య రాణిస్తుంది. ఈ కళలన్నీ అటువంటివే. మీవంటి శిష్యులను మీరు తయారుచేసి, వారి చేతులలో..."

"పరాజయం పొందినా నాకు విచారంలే దు. కాని ఇది చాలా పెద్ద బరువని నాకని పిస్తున్నది. మీరనుకున్నంత విద్వాంసురా లిని కాను నేను''

"మీ సామర్ధ్యం గురించి మాకు బాగా తెలుసు. ఈ ప్రాంతాలలో మామూలు చదు వులకోసం స్కూళ్లు, కాలేజీలు ఉన్నాయి. నా అభ్యర్ధన ఒకటే. మీరు సంగీత నాట్యాలకు ఒక పాఠశాల అంటే గురుకులం అంటే రెసిడెన్షియల్ పద్ధతిలో ప్రారంభించమని కో రుతున్నాను''

"అది సాధ్యమైన పనేనా?"

"మీకు అసాధ్యమైనదేదీ లేదు. మీ తమ్ముడు రామభద్రరాజుగారు తోటలో ఆశ్రమం వేసుకొని ప్రకృతివైద్యం చేస్తున్నా రు. అవన్నీ వారు కట్టిపెట్టి సిరిపురం రాగల రు. రాజవీధిలోనున్న మీ యిల్లు చాలా పెద్దది. దానిలో ఛాత్రులు ఉండడానికి హాస్ట లుగా పనికివస్తుంది. దానిని బాగుచేయించ వచ్చు''

"ఈ సలహా బాగానేవుంది''

"మీకు రామభద్రరాజుగారు పెద్ద తమ్ము లు. నేను రెండోవాడిని. ఈ శుభసంద ర్భంలో నేనొక ప్రకటన చేస్తున్నాను. నాకు ఫీజుగా ముట్టిన ధనమంతా ఈ కళాక్షేత్రాని కి విరాళంగా యిస్తున్నాను''

అందరూ ఆశ్చర్యపోయారు.

"అంతేకాకుండా వెంకట్రాయుడుగారు భవన నిర్మాణానికి కావలసిన ధనమంతా యిస్తారు... మీకిది సమ్మతమేనా?"

"మా తమ్ముళ్లు, స్నేహితులు చెప్తే నేను కాదనగలనా?"

ఆ రాత్రి శంకరరావుగారింట భోజనాలు ఏర్పాటయ్యాయి. అమృతవల్లి కూడా వచ్చా రు.

మరునాడు ఉదయమే చంద్రశేఖరాన్ని రామభద్రరాజు కారులో తీసుకొని విశాఖప ట్నంలో దిగబెట్టాడు.

గడపదగ్గిర నిలబెట్టి చంద్రశేఖరం భార్య కామేశ్వరి అతనికి నీరాజనం పట్టింది.

చంద్రశేఖరం ఇంట్లో కాలు మోపుతుంటే రామభద్రరాజు తిరిగి వచ్చారు.

వారి చేతులలో తాటిరేకు బుట్టలున్నాయి. వాటిలో పుష్పమాలలు, పళ్లు, పూతరేకులు వున్నాయి.

రామభద్రరాజు కామేశ్వరితో అన్నాడు, "అమ్మాయ్! ఈ విజయోత్సవం సంగతే మరిచిపోయాను. మీ వదినగారు పూలదండ లు కట్టడంలో మంచి నేర్పున్నవారు. ఈ ఉదయం కోసిన పూలతో తయారుచేసిన దండలివి. ఏదీ వీటిని మార్చుకొండి. తమ్ము డూ! ఈ కోవా బిళ్ల మా మరదలి నోటిలో పెట్టి, ఆమె కూడా ఆవిధంగా చేసి..."

వాళ్లు ముగ్గురూ నవ్వుకున్నారు.

"అయ్యా అన్నగారూ! ఈ సందర్భంలో మీకొక రహస్యం చెప్తున్నాను. నా మొదటి కేసు గెలవగా వచ్చిన ఆర్జనతో మా ఆవిడకు కాసులపేరు చేయిస్తానన్నాను. ఎన్ని కాసుల పేరులైనా చేయించుకోవచ్చు. కాని మా అక్కగారు తన చేతులతో కట్టిన ఈ దండ అన్నిటికన్నా విలువైనది''

రామభద్రరాజుగారు యిద్దరినీ ఆశీర్వ దించి వెళ్లిపోయారు.



ఆంకితం

మాన్యమిత్రులు

శ్రీ కూరెళ్ళ సోమేశ్వరరావుగారికి




హాలీవుడ్ స్టంట్‌మన్‌లు సినిమాలకోసం చేసే సాహసాలు ఇన్నీ అన్నీ కావు. ఆమధ్య ఓ టీవీ సీరియల్‌కోసం బ్రహన్ జాక్‌సన్ ఓ భయంకర సాహస కృత్యాన్ని చేశాడు. శాన్‌డియాగోలోని 'జాన్ మర్ఫీ స్టేడియం'లో 180 అడుగుల ఎత్తుమీంచి కారు నడుపుతూ హఠాత్తుగా కిందకు దూకించాడు. సరిగ్గా ఆ సమయంలో కారులో ముందుగా పెట్టుకున్న మందుగుండు సామాను పేలి పెద్ద విస్ఫోటం ఏర్పడింది. రెస్క్యూ వర్కర్స్ వచ్చి మంటలనార్పుతుండగా అందులోంచి చిరునవ్వుతో బయటకు వచ్చాడు జాక్‌సన్. అందరూ తెల్లబోయి చూస్తే తేలిందేమంటే అతడు ఓ ఫ్లేమ్ రెసిస్టెంట్ సూటు ధరించి వున్నాడు. అయినా అది గొప్ప సాహసకృత్యమే అని చెప్పుకున్నారందరూ.

# 'సాంబయ్య చదువు'పై సమీక్షలు

నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన, నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కాలువ మల్లయ్య నవల 'సాంబయ్యా చదువు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## సందేశం ఏమిటి?

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

చిలుకయ్య తన కొడుకు సాంబయ్యపై చూపే ప్రేమ, అనురాగం, అతని చదువు కోసం పడే తపన, ఆరాటం, ఆర్థిక ఇబ్బందులు, పల్లె జీవితం, అక్కడి వాతావరణం, వారి ఛాందస భావాలు, మూఢనమ్మకాలు, జులుం చలాయించే భూస్వాముల కుతంత్రాలు, సాంబయ్య పల్లెనుండి పట్నవాసంవరకూ సాగే చదువూ, కాలేజీ రాజకీయాలు, అవి విద్యార్థులపై చూపే ప్రభావం... వరకూ రచయిత వాస్తవికత ఉట్టిపడేలా గాశారు.

ఉడుకురక్తంతో ఆవేశపు ఆదర్శాల ఆలోచనలు చేసినా, ఆ వేడి చల్లారిన తర్వాత ఆదర్శాలు అర్థంలేనివిగా కనిపించి, జీవితాన్ని అర్థవంతం చేసుకోవడమంటే సొసైటీలో తనకో స్టేటస్‌ను ఏర్పరచుకోవడమనే అభిప్రాయానికి వచ్చిన సాంబయ్యల్లాంటివారు నిత్యజీవితంలో మనకెంతోమంది కనిపిస్తుంటారు.

అటువంటివారికి రచయిత ఇచ్చే సందేశమేమిటి?

కష్టాలు, కన్నీళ్లు దిగమింగి, ఆప్యాయత అనురాగం బిడ్డలకి పంచి ఇచ్చి తినీ తినకా కడుపులు మాడ్చుకుని, రెక్కలు ముక్కలు చేసుకుంటూ వారిని పెంచి పెద్దచేసి చదివించి, వారేదో పెద్ద ఉద్యోగాలు వెలగబెట్టి వృధాప్యంలో తమని ఉద్ధరిస్తారని కళ్లల్లో శతకోటి ఆశల్ని నింపుకుని ఎదురుచూసి, చివరికి తమ ఆశలు నిష్ప్రయోజనాలని తెలుసుకుని నిస్సహాయులుగా నిలచిన చిలుకయ్య, రాజమ్మల్లాంటి తల్లిదండ్రులకి రచయిత చూపిన మార్గమేమిటి?

వయసు, డబ్బు తెచ్చిన పొగరుతో తనయులు కన్నవారిని హీనంగా చూస్తూ బాధ్యతారహితంగా ప్రవర్తిస్తుంటే - ఇలా ఎందుకు జరుగుతోంది? తమ పెంపకం లోపమా? లేక పెరుగుతున్న విజ్ఞానమే స్వార్థాన్ని నేర్పుతోందా? ఏదీ తేల్చుకోలేక ఆ వయసులో కావాల్సిన ఆలంబనను, ఆప్యాయతను నోచుకోక ఆదరణ చూపే మనిషి లేక అలమటించిపోయే ఎంతోమంది తల్లిదండ్రులు ఇలాంటి సాహిత్యంలో తమకేదైనా దారి దొరకుతుందేమో, తమకు తెలియని అర్థంకాని సమస్యలకి, ప్రశ్నలకి పరిష్కారాలు దొరుకుతాయేమో, తమ కొడుకుల్లాంటి అవకాశవాదులకు జ్ఞానోదయం కలిగించే విషయాలుంటాయేమో అని ఎదురుచూస్తారు. అటువంటి తల్లిదండ్రులకి ఈ నవల ముగింపు ఒక అశనిపాతం.

పొరుగువారిని ప్రేమించే ఔదార్యం, సాటివారు కష్టాలలో వుంటే చేయూతనిచ్చే ఔన్నత్యం ఇప్పటివారిలో ఎలాగూ లేవు.





కనీసం తమకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకి ఆలంబనగా వుండి, ఆదరణ చూపాల్సిన కనీస బాధ్యత బిడ్డలకి వుందనీ, మానవత్వపు విలువల్ని మంటకలపవద్దని రచయిత పరోక్షంగానైనా తెలియజేస్తే బాగుండేది.

సాంబయ్యని ఉన్నత భావాలుగల వ్యక్తిగానే వుంచినట్లయితే చాలా బాగుండేది. ఆదర్శప్రాయుడైన ఉపాధ్యాయుడిగా, మానవత్వం కలిగిన తనయుడిగా వున్నట్లయితే తల్లిదండ్రులకి సంతృప్తిని, యువతరానికి స్ఫూర్తిని కలిగించేది.

-చుల్. వెంకటసుబ్బమ్మ
ఎమ్మిగనూరు

## సజీవ చిత్రణ!

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

కొలువ మల్లయ్యగారి 'సాంబయ్య చదువు' చదువుతుంటే కొడవటిగంటి కుటుంబరావు గారి 'చదువు' గుర్తుకువస్తుంది. ఆ 'చదువు'లో 1915-35 దశకంలోని ఇరవైయ్యేళ్ల సంఘ చరిత్రను చిత్రిస్తే, ఈ నవలలో 1951-80ల మధ్య తెలంగాణా సామాజిక వికాసాన్ని తనదైన పంథాలో పరిశీలించారు రచయిత. ఆ 'చదువు'లో ప్రధానంగా సుందరం చదువు నేపథ్యంలో సంఘ పరిశీలన చిత్రీకరించబడితే, 'ఈ '...చదువు'లో సామాజిక వికాసం నేపథ్యంలో సాంబయ్య చదువే ప్రధానంగా కథ నడిచింది.

'సాంబయ్యచదువు'లో కథానాయకుడు కిందివర్గానికి ప్రతినిధి. కొడవటిగంటి కుటుంబరావుగారి నవలలోని సుందరం కోస్తా ప్రాంతంలోని మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంనుంచి రాగా, సాంబయ్య ఉత్తర తెలంగాణాలోని శూద్ర వ్యావసాయిక కుటుంబంనుంచి వచ్చాడు.

స్వాతంత్ర్యానంతర కాలంలో తెలంగాణా పల్లెల్లోని దిగువ తరగతి వ్యావసాయిక కుటుంబాలలో చదువుపట్ల కలిగిన ఆసక్తికి, వారి జీవన వికాసానికి ఈ నవల అద్దంపట్టింది. కరీంనగర్ మాండలికంలోని సంభాషణలు నవలకు జీవంపోశాయి. స్పష్టత కోసం నవలలో అక్కడక్కడా కాలానికి సంబంధించిన వివరణ సంవత్సరాల రూపంలో ఇస్తే బాగుండేది.

చదువుద్వారా సాగే అనివార్యమైన ఆంతరంగిక ఘర్షణకు గురయిన సాంబయ్య సామాజిక స్పృహ కల్గిన బుద్ధిజీవి అయినప్పటికీ చదువే పరమావధిగా భావించి విప్లవోద్యమాలపట్ల ముభావంగా ఉంటాడు. దానితో రచయితకు నక్సల్బరీ, రైతాంగ పోరాటాల మూలల్లోకి వెళ్లి పరిశీలించే అవకాశం రాలేదు.

తన ఆదర్శాలనూ, మూలాలనూ విస్మరించిన సాంబయ్య పట్టణ మధ్య తరగతి కుహనా సంస్కృతికి లోనై పరాయీకరణకు గురవ్వడంతో నవల ముగియడం సహజమైన ముగింపు. ఇది మధ్యతరగతి మందహాసాలను పరిహసించే ఓ చారిత్రక సత్యం. అందుకే ఈ ముగింపు నవలకు మకుటాయమానం.

-విజయచంద్ర
బాన్సువాడ

## 'చదువెందుకు...?'

*('తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

గ్రామీణ జీవన సరళిని హృద్యంగా చిత్రీకరించిన సజీవ నవల 'సాంబయ్య చదువు'

'ఎవ్వడువడితే వాడు చదువుకుంటే చదువు రావడానికదేమన్న మట్లబొర్లుడా, చేపలు వట్టుడా?'

'అందరు సదివిత్తే సదువుకేం విలువుంటది?'

- అంటున్న దొరల సూటిపోటి మాటలను ఖాతరుచేయకుండా నిలదొక్కుకుని కొడుకు

సాంబయ్యని విద్యావంతుణ్ణి చేయడంలో చిలుకయ్య పడ్డ పాట్లు, సాంబయ్య అంతర్మథనం నేపథ్యంలో గ్రామ రాజకీయ, సాంఘిక పరిస్థితులు సహజంగా వర్ణితమయ్యాయి.

నైజాం పాలననుండి అప్పుడే విముక్తి పొంది స్వేచ్ఛకు అలవాటుపడుతున్న జనం, పాత వాసనలు వదలని పట్వారీ, పటేల్లు, 'స్వతంత్రమచ్చిందని చిన్నంతరం పెద్దంతరం చూడకుంటెట్ల? అంటుముట్టు మరసిపోవుడేనా?' అంటూ తమ పెద్దరికాన్ని నిలుపుకోవాలని తాపత్రయపడే జమీందార్లు, ఊళ్లోకి కారొస్తే 'మేం దాన్ని ముట్టుకోనువోతే డ్రైవర్ కొట్టకొట్ట రాబట్టె. నేను కారుని రొండుసార్లు ముట్టుకున్న. ముడితే జారిపోతంతాదది' అంటూ కారుని తాకిన తమ అదృష్టానికి మురిసిపోయే పోరగాళ్లు, అభివృద్ధి ఫలాలు రైతుకందకుండా అడుగడుగునా అడ్డుతగిలే మధ్య దళారీల నయవంచనకు మోసపోతూ 'షావుకార్ల దగ్గర మిత్తెక్కువని సర్కారు బాకీలకు పోతే అందరికీ తినిపిచ్చేవరకు గంతే బలుత్తంది' అని వాపోయే చిన్నరైతులు, చిలుకయ్యలాంటి బక్కరైతులు, కాసింత లౌక్యం, కాస్త మంచితనం కలగలిసిన కొండల్‌రెడ్డిలాంటివాళ్లు ఆ ఊళ్లో దర్శనమిస్తారు.

గానుగలో చెరుకుముక్కలా నలిగిపోతూ, శక్తికి మించిన వ్యయ ప్రయాసలకోర్చి కొడుకుని విద్యావంతునిగా తీర్చిదిద్దిన మధ్యతరగతి జీవి చిలుకయ్య, నాన్న ఒంటి నాగలెవుసాయంతో సతమతమవడం, అవ్వ జీవితాన్నంతా భూమికే అంకితం చేయడం వెనుకున్న కోణాలు, తనకీ చదువులు చెప్పలేదని మధనపడే సాంబయ్య, జీవితం వేసే శేషప్రశ్నలకు జవాబులివ్వని చదువులను తాను, తనలాంటి లక్షలాదిమంది సుదీర్ఘ కాలాన్ని వెచ్చించి ఎందుకు చదువుతున్నామని ప్రశ్నించే సాంబయ్యల ఘర్షణలను చక్కగా చూపారీ నవలలో. తల్లిదండ్రులు కష్టించి తినీ తినకా తనను చదివిస్తున్నారని తన ఆసక్తినంతా చదువుపైనే కేంద్రీకరించి, సమాజంలోని మార్పులకు అనుగుణంగా తాను సంస్కరణలలో పాల్గొనాలని ఉవ్విళ్లూరుతాడు సాంబయ్య! అయితే ఆశలన్నీ తనపైనే పెట్టుకున్న తన కుటుంబ పరిస్థితులను తలుచుకుని 'ఎక్కడేం జరిగినా తనకేమాత్రం ఇబ్బంది కలగకూడదనే' మధ్యతరగతి మనస్తత్వాన్నే ప్రదర్శిస్తాడు ఆచరణలో.

పెళ్లి చేసుకుని ఉద్యోగంలో స్థిరపడిన తరువాత తనను పెంచి పెద్దచేసి, కష్టపడి తననింతవాడిగా తీర్చిదిద్దిన తల్లిదండ్రుల గురించి పట్టించుకోకపోవటం, తాను, తన పిల్లలు, భార్య, ఉద్యోగం... వీటివరకే తనను తాను పరిమితం చేసుకుని, మిగతావాటి గురించి ఆలోచించి ఇబ్బందులు కొని తెచ్చుకోగూడదనుకోవడం ఇందుకు తార్కాణం!

-రవితేజ

హైదరాబాద్

## ముళ్లబాటలో...

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

బడుగువర్గాలనుంచి ఓ కుర్రాడు బాగా చదువుకొని 'మణిపూస'లా ఎదగాలంటే కష్టతరమనీ, కుటుంబ ఆర్థిక పరిస్థితులు, సమాజంలోని కుల వివక్షత, ధనికవర్గాల అహంభావాలు... అతని చదువుపై మనోస్థితిపై కూడా ప్రభావం వుంటుందని 'సాంబయ్య చదువు'లో రచయిత చక్కగా వివరించారు.

ఓ వ్యక్తి జీవితం 'పూలబాట'లాగ సాగాలి అంటే అత్యున్నత విద్య అవసరం. ఆర్థిక పరిపుష్టి కలిగించడంకంటే మనిషిని పరిపూర్ణ వ్యక్తిత్వంవైపు నడిపించేదే నిజమైన విద్య అనే సత్యం ఈ నవలద్వారా బోధపడింది.

పాలుకారే వయసులో విద్యార్థులపై అధ్యాపకులు ఎంత బలవత్తరంగా ముద్రవేస్తారో, ఆ మాస్టార్లే కుర్రాళ్లపట్ల కుల వివక్ష చూపితే పసిమనసు ఎంత గాయపడుతుందో




హృద్యంగా చూపారు.

పేదరికంలో మగ్గుతున్న తల్లిదండ్రులు తమ కొడుకు చదువు నిమిత్తం ఎంత తపన పడతారో, ఆ విద్యార్థులే స్కూల్లో ఎన్ని ఇక్కట్లు పడతారో రచయిత రాశారు. చదవుకుంటూ 'కులవృత్తి' నేర్చుకుంటే భావిజీవితంలో ఆర్థిక సమస్యలు ఎదుర్కోవచ్చు అనే ఆత్మవిశ్వాసం ఈ నవలద్వారా కలుగుతుంది.

ఆరోజుల్లో వుండే బాల్య వివాహాలు, కుల వైషమ్యాలు, విద్యార్థుల చదువులమీద సమ్మెలు, బంద్‌ల గ్రహణాల గురించి చక్కగా విశదీకరించారు.

కాలేజీల్లో ఎటువంటి దురలవాట్లకి బానిస కాకుండా విద్యాభ్యాసం చేసిన 'సాంబయ్య' నేటి యువతకు ఆదర్శం.

నవల యావత్తూ తెలంగాణా మాండలీకంలో సాగటంవల్ల చాలాచోట్ల పరమాన్నంలో పలుకురాళ్లలా ఫీలయ్యాం! కొన్ని పదాలకు బ్రాకెట్టులో అర్థాలు ఇస్తే బావుండేది. నవలమాత్రం చదివించేదిలా వుంది.

-డాక్టర్ జి. సంధ్యారాణి
తణుకు

## పల్లెల జీవనశైలికి దర్పణం

**(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)**

యదార్థ జీవితాలను ప్రతిబింబించే నవలా కుసుమాలను అందించే 'చతుర' ప్రత్యేకతకు కాలువ మల్లయ్యగారి 'సాంబయ్య చదువు' మరో తార్కాణం! చదవాలనే కాంక్ష బలీయంగా ఉన్నప్పటికీ ఒక సన్నకారు రైతుబిడ్డ చదువుకోవడంలో ఎదుర్కొన్న కష్టనష్టాలను, ఒడిదుడుకులను, పొందిన తీపి, చేదు అనుభవాలను పాఠకుల కళ్లకు కట్టినట్లు చూపడంలో రచయిత పడిన తపన ఫలించిందీ నవలలో.

సాంబయ్య చదువే ప్రధానాంశమైనప్పటికిని పల్లెప్రజల ఆచార వ్యవహారాలను, జీవన శైలిని నవలలో ప్రతిబింబించడంద్వారా పాఠకులను పల్లెలకు చేరువ చేయగలిగింది. వ్యవసాయంలో తండ్రికి చేదోడు వాదోడుగా నిలుస్తూ కూడా చదువులో బాగా రాణిస్తున్న సాంబయ్య వ్యక్తిత్వం పల్లెప్రజలందరినీ ఆకట్టుకోవడమేగాక పాఠకులకు కూడా ప్రేరణ కలిగిస్తుంది. హేతువాద దృక్పథాన్ని పెంపొందించుకున్న సాంబయ్య తను చదివినవాటికీ, నిజజీవితంలో జరుగుతున్నవాటికీ పొంతన కుదరక పోవడంతో సతమతమైన తీరు విద్యావ్యవస్థను మరింత వాస్తవికంగా, ప్రయోజనకరంగా తీర్చిదిద్దవలసిన ఆవశ్యకతను గుర్తుచేస్తుంది. విస్తృత సాహితీ పఠనంవల్ల రూపుదిద్దుకున్న ఆశయాలకు, అస్తవ్యస్తమైన కుటుంబ పరిస్థితులవల్ల సాధ్యంకాకపోయిన ఆచరణకు మధ్య నలిగిపోయిన సగటు విద్యార్థి మానసిక సంచలనాన్ని ఈ నవల చక్కగా వ్యక్తంచేయగలిగింది. చదువుతోపాటు సాంబయ్య పొందిన అనుభూతులు, అనుభవాలు నేటి విద్యార్థులందరికీ వర్తించేవే.

ఈ నవలలో ప్రధానాంశం ఏమాత్రం దెబ్బతినకుండా సందర్భోచితంగా స్వాతంత్ర్య ఫలాలను, పీడిత ప్రజల కష్టనష్టాలను, పెరిగిన రాజకీయ చైతన్యాన్ని, అల్లకల్లోల తెలంగాణ ముఖచిత్రాన్ని పరిణామక్రమంలో ప్రస్తావిస్తూ పాఠకులను స్పందింపచేయడంలో రచయిత ప్రతిభ కనబరిచాడు. సామాన్యజనం నోళ్లల్లో నానే జానపద పాటలు, పద్యాలు, కథలు, సామెతలతోను, తెలంగాణా మాండలీకంలో సాగిన ఈ నవలను ఆద్యంతం ఆసక్తిగా చదివించేలా రాసిన రచయితకు, అందించిన 'చతుర'కు అభినందనలు.

-బి. రమేష్
కాళేశ్వరం

# చతుర ప్రపంచం

## వైద్యరంగంలో 'మాస్టర్ పీస్'

యునాని వైద్యం అనగానే మనకి గుర్తొచ్చేవి చెట్లబెరడు చూర్ణంతో చేసిన పొడులు లేదా మాత్రలు. అంతేగానీ ఈ వైద్యంలో శస్త్రచికిత్సావిధానం కూడా చాలా అభివృద్ధి చెందిందన్న విషయం చాలా తక్కువ మందికి తెలుసు. శస్త్రచికిత్సారంగంలో యు




నాని వైద్యం ఎన్నో అద్భుతాలను చేసింది.

క్రీ.శ. 926వ సంవత్సరానికి చెందిన హకీమ్‌రజి, 1037వ సంవత్సరానికి చెందిన ఇబ్రేసైనా, 1013కి చెందిన అబ్దుల్ ఖాసిం ఇబ్రాహిబి, 1286కి చెందిన ఇబ్రల్‌కఫ్ మొదలయిన చరిత్ర ప్రసిద్ధిచెందిన యునాని వైద్యులు ఈ రంగంలో ఎన్నో అద్భుతాలను చేశారు.

డాక్టర్ రజి 30 భాగాలుగల ఓ యునాని వైద్య గ్రంధాన్ని రాసి ప్రజల కందించాడు. దీన్ని యునాని వైద్యపు ఎన్‌సైక్లోపీడియా అని పిలుస్తారు. ఇందులో ఎన్నో ఛాప్టర్లు యునాని శస్త్రచికిత్సా పద్ధతులను వివరించాయి.

శరీరంపై కోసిన భాగాలను కుట్టడానికి ఆల్కహాలును, సిల్క్‌దారాన్ని ఉపయోగించిన మొదటి డాక్టర్ 'రజి' అంటారు. ఈ గ్రంథంలో ఇప్పటికీ అమలులో వున్న శస్త్రచికిత్సా పద్ధతులెన్నో వివరించబడ్డాయి. ఇది కాక 'ఆల్కనూన్ ఫిట్టిబి' అనే పేరుగల పుస్తకాన్ని డాక్టర్ ఇబ్రేసైనా రాశారు. ఇది 5 భాగాలుగా వెలువడింది. యునాని వైద్యరంగంలో ఇదొక మాస్టర్‌పీస్ అని చెప్పవచ్చు. నిజానికి ఇబ్రేసైనా ఫిజిషియన్ అయినా సర్జరీ గురించి అత్యద్భుతంగా రాశాడని పొగడ్తలొచ్చాయి.

క్యాన్సర్ మాత్రం కేవలం మందులతోనే నయం చెయ్యగలమని, అత్యవసర పరిస్థితుల్లో తప్ప శస్త్రచికిత్స జోలికిపోరాదని తెలిపారాయన. ఎందుకంటే సర్జరీవల్ల క్యాన్సర్ పేషెంట్‌కి మరిన్ని అదనపు సమస్యలు ఉత్పన్నమవుతాయంటారాయన.

డాక్టర్ అబ్దుల్ ఇబ్రాహీ కూడా యునాని వైద్యుడుగా మంచి పేరు పొందాడు. ఆయన్ని యునాని వైద్యపితామహుడు అని పిలిచినా ఆశ్చర్యం లేదంటారు చాలామంది.

సర్జరీపై ఆయన కూడా ఓ ఉద్గ్రంథం రాశారు. ఆధునిక శస్త్రచికిత్సా పద్ధతులు కొన్ని ఆయన పద్ధతులతో తుల్యమానంగా కనిపిస్తాయి. ఇంచుమించుగా ప్రతి ఆపరేషన్‌కి సంబంధించిన పద్ధతులను వివరించిందీ పుస్తకం. గర్భంలోనే మృతిచెందిన బిడ్డను తీసే విధానం, మూత్రపిండాల్లోని రాళ్ళను ముక్కలు చేసే విధానం, కంటి శుక్లాల ఆపరేషన్ పద్ధతి... వగైరా ఎన్నిటినో కూలంకషంగా చర్చించిందీ పుస్తకం. ఇందులో శస్త్రచికిత్సా పరికరాల చిత్రపటాలను కూడా పొందుపరిచారు. ఇంచుమించుగా 200 పరికరాల చిత్రాలున్నాయి ఈ గ్రంథంలో. అయితే ఆధునిక కాలంలో యునాని వైద్యం కేవలం మందులకి మాత్రమే పరిమితమవడంతో ఇందులో వున్న విస్తృత శస్త్రచికిత్సా విధానం చాలామందికి తెలియక తెరమరుగునే వుండిపోయింది.

ఇందులో రక్త మూత్ర, మలపరీక్షలకి సంబంధించిన పద్ధతులున్నాయి. అప్పుడప్పుడు ఇంగ్లీషు వైద్యపద్ధతుల ప్రకారం పరీక్షలు చేయించి, ఫలితాలనుబట్టి మందులు వాడతారు ఈ వైద్యులు.

## మండుటెండలో మలయమారుతం

గొప్ప వాళ్ళ జీవితాలకి సంబంధించిన కొన్ని ముఖ్య సంఘటనలు వినడానికెంతో కుతూహలంగా వుంటాయి. మహమ్మదాలీ జిన్నా గురించి విననివాళ్లెవరూ వుండరు. కానీ... ఆయన భార్య రతి గురించి తెలిసింది చాలా తక్కువ మందికే. 1900వ సంవత్సరం ఫిబ్రవరి 20వ తేదీన బొంబాయిలో ఓ పార్శీ కుటుంబంలో పుట్టింది రతి. సౌందర్యవతే కాకుండా మేధాశక్తి ఆత్మవిశ్వాసం వంటివి ఆమెకు పెట్టని ఆభరణాలై ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేశాయి. 1916లో శలవలు గడిపేందుకు తల్లితండ్రులతో డార్జిలింగ్ వెళ్ళిన రతికి అక్కడ తారసపడ్డాడు జిన్నా. ఆమె అతని మేధాశక్తికి ఆకర్షితురాలైతే అతడు ఆమె సౌందర్యానికి వశమయ్యాడు. అప్పటికి ఆమె వయసు 16, అతని వయసు 42. అయినా ఆ 26 సంవత్సరాల వయోభేదం వారికేమాత్రం కనిపించలేదు గానీ జిన్నాకి మంచి మిత్రుడైన రతి తండ్రి దిన్‌షాకి తన కూతురు అంత పెద్దవాడైన జిన్నాతో ప్రేమలో పడటం ఇష్టంలేదు. ఆమెను ఒప్పించి ఓ పార్శీ యువకునితో వివాహం జరిపించాలని ఎంతో ప్రయత్నించారు తల్లితండ్రులు. కానీ ఆమె ససేమీరా అంది. రతి అప్పటికింకా




మైనర్ కాబట్టి ఆమె మేజర్ అయ్యేదాకా వివాహాన్ని వాయిదా వేద్దామన్నాడు జిన్నా. ఆ ప్రకారం వారు మరో రెండేళ్ళు ఆగి

1918లో వివాహం చేసుకున్నారు. ముందు సివిల్ మ్యారేజ్ యాక్ట్‌ప్రకారం, అటుపైన ఇస్లామ్ మతాచారం ప్రకారం జరిగిందా వివాహం. జిన్నా సివిల్ మ్యారేజ్ యాక్ట్ ప్రకారం వివాహం చేసుకోవడం ముస్లిమ్స్‌లో కోపాన్ని కలిగించింది. అది అతడి రాజకీయ కార్యకలాపాలకి కొంచెం ఇబ్బంది కలిగించిందనే చెప్పచ్చు. ఏది ఏమయినా క్రమంగా జిన్నా రాజకీయ, వైవాహిక జీవితంలో రతి ప్రధాన పాత్రే వహించింది.

అనిబిసెంట్ నేతృత్వంలో జరిగే ఆధ్యాత్మిక సమావేశాలు, ప్రచారాల్లో కూడా రతి పాల్గొనడం ప్రారంభించింది. కానీ ఆ విషయంలో ఇద్దరికీ భేదాభిప్రాయాలు రానారంభించాయి.

1928లో ఓసారి వారిద్దరూ కలిసి కలకత్తా వెళ్ళి, వచ్చేటపుడు విడివిడిగా వచ్చారు. జిన్నా ఆమె పట్ల కఠినంగాను, దురుసుగాను వ్యవహరించసాగాడు.

1928 ఏప్రిల్‌లో జిన్నా, రతి ఇంగ్లాండు, అక్కడినుంచి పారిస్ వెళ్ళారు. పారిస్‌లో రతి తీవ్ర అస్వస్థతకు గురయింది. ఓ నెలపాటు రతికి తోడుగా హాస్పటల్లోనే గడిపాడు జిన్నా. కానీ పరిస్థితి ఏమాత్రం మెరుగుపడలేదు. అటుపైన అతడు ఇండియాకు ఒంటరిగా వస్తే, ఆ తర్వాత తల్లితోపాటు ఇండియాకు చేరుకుంది రతి. వచ్చాక కూడా ఆమె జీవన్మరణావస్థలో మంచంమీదే వుండిపోయింది. అప్పుడు మాత్రం జిన్నా దగ్గరే వుండి ఆమెకు సపర్యలు చేసేవాడు. వయసు ముదిరిన అతని జీవితంలో ఓ మలయమారుతంలా ప్రవేశించిన రతి... అతడా అనుభూతిని పూర్తిగా దక్కించుకోకుండానే నిష్క్రమించింది. అప్పటినుంచీ అతడి మనసు మరింత కరడుగట్టి జీవితంపట్ల అతడి దృక్పథమే మారిపోయింది. ఆ కఠిన స్వభావమే ప్రత్యేక పాకిస్థాన్‌కు దారితీసిందంటారు కొంతమంది.

## మాయమవుతున్న జాతులు

మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చే నాటికి దేశంమొత్తంమీద ఉన్న గిరిజనుల సంఖ్య 17,87,300. 1971లో సేకరించిన జనాభా లెక్కల ప్రకారం ఈ సంఖ్య 3,80,15,162 కాగా ఇటీవలి లెఖ్ఖల ప్రకారం అది 5 కోట్లకి చేరింది. దేశజనాభాలో దీన్ని 7 శాతంగా చెప్పచ్చు.

వీరిలో గోండ్లు, భిల్లులు 40 లక్షలు; సంథాల్‌లు సుమారు మూడు లక్షలు, మీనా, ముండా, ఓరాన్ జాతులవారు ఒక్కొక్కరూ 10 లక్షల మంది వున్నారు. దీన్నిబట్టి చూస్తే అతివేగంగా పెరుగుతున్న ఆధునికీకరణ వీరిని ప్రభావితం చేయలేకపోయిందనిపిస్తోంది.

అయితే ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల పరిశోధనలద్వారా చాలా ఆదిమజాతులు ఇప్పుడు కనుమరుగయ్యాయని తెలుస్తోంది. వెనుకబడిన జాతులలో సెక్స్‌పరమైన సుఖవ్యాధులకెక్కువగా గురవుతున్నారని తెలుస్తోంది. అండమాన్‌లోని ఓన్జ్, తమిళనాడుకు చెందిన కోటా, బీహార్‌కి చెందిన పహాడియా, వెస్ట్ బెంగాల్‌కి చెందిన తోటాజాతి వారిలో సుఖరోగాలతోపాటు రక్తహీనత కూడా ఎక్కువే. వీరిలో జననాల సంఖ్యకన్నా, మరణాల సంఖ్య ఎక్కువగా వుండటంతో కొన్నాళ్ళకు ఈ జాతులు కనుమరుగవుతాయని అంటున్నారు పరిశీలకులు.

కేరళకు చెందిన చోళనాయకన్ అనే ఓ ట్రైబల్ తెగ ఈమధ్యనే వెలుగులోకి వచ్చింది. ఈ తెగలో జననాల సంఖ్య మరణ సంఖ్య కంటే బహుతక్కువట. గత మూడేళ్ళలో పుట్టినవారి సంఖ్య 8 అయితే చనిపోయినవారి సంఖ్య 24. అంతు తెలి







యని ఓ విషజ్వరం ఇందుకు కారణమట. అండమాన్స్‌లో ఓ జాతివారు కొన్ని జన్యు సంబంధిత కారణాలవల్ల అసలు సంతానోత్పత్తే చేయలేకపోతున్నారని ఓ సర్వేలో తేలింది.

వారి సాంప్రదాయక వైద్య విధానాలకు అందని కొన్ని రోగాలు వారిని నాశనంచేస్తున్నాయంటున్నారు పరిశోధకులు. కొన్ని తెగలలో ఎర్ర రక్తకణాల లోపం ఎక్కువ. కుటియా గుండా అనే తెగవారు తరచూ మలేరియా జ్వరంతో బాధపడుతుంటారు! ఇవి కాక కుష్ఠు, క్షయలాంటి రోగాలు కూడా పీడిస్తున్నాయి వారిని. వ్యవసాయం, పారిశ్రామికీకరణ కారణంగా అండమాన్‌కి చెందిన ఓన్జ్ జాతిలో ఆర్థిక, సాంఘిక మానసికాభివృద్ధి కొంత కనిపిస్తోందంటున్నారు పరిశీలకులు.

ఇదికాక అడవులకు సంబంధించిన ప్రభుత్వ నియమాల కారణంగా కూడా వీరి స్వేచ్ఛా జీవితాల్లో కొన్ని ప్రతిబంధకాలు చోటుచేసుకున్నాయి. అడవిలో పుట్టి, అడవిలో పెరిగిన గిరిజనుణ్ణి అడవినుంచి వేరు చేసే కొన్ని ప్రభుత్వ నియమనిబంధనలు వారికి బాధాకరంగా పరిణమించాయి. అతి వేగంగా పెరుగుతున్న ఆధునికీకరణ, పారిశ్రామికీకరణ అడవి జాతుల జీవితాల్లో అనూహ్యమార్పులను తెచ్చి పెట్టాయి. వీరిలో కూడా కొందరు చట్ట విరుద్ధంగా అసాంఘిక పద్ధతుల్లో డబ్బు సంపాదించడానికి అలవాటుపడుతున్నారు. చాలామంది అడవుల్ని వదిలి కర్మాగారాల్లో పనిచేయనారంభించారు. రానున్న దశాబ్దకాలంలో కనీసం 10 తెగలు భారతదేశ చిత్రపటంనుంచి పూర్తిగా మాయమైనా ఆశ్చర్యం లేదంటున్నారు చరిత్రకారులు.

---

## మానవ సంక్షేమ పత్రిక

**అ**మెరికాకు చెందిన 'నేషనల్ జియోగ్రాఫికల్ సొసైటీ' వారు మానవ సంక్షేమంకోసం నీటిమీద, భూమిమీద కూడా పరిశోధనలు చేసి ఎన్నో విషయాలను ప్రజలకందించారు. 1888లో ఈ సొసైటీ 'ది నేషనల్ జియోగ్రాఫిక్ డివోట్' అనే పత్రికను ప్రారంభించి మానవ సంక్షేమానికి, విజ్ఞానాభివృద్ధికి సంబంధించిన ఎన్నో వ్యాసాలను ప్రచురించింది. మొదట్లో ఎలాంటి వ్యాపార ప్రకటనలనూ అంగీకరించని ఈ పత్రిక ఇప్పుడు ఒకటి రెండు ప్రకటనలను, అదీ ప్రజలకు అవసరమయ్యే వస్తువులకు సంబంధించిన ప్రకటనలను స్వీకరిస్తోంది.

ముప్పై ముగ్గురు పేరుపొందిన వ్యక్తులు ఈ పత్రికను 1888లో ప్రారంభించారు. మొ




దటి పదేళ్లూ దీని అమ్మకాలు వెయ్యిదాటలేదు. టెలిఫోన్ కనిపెట్టిన గ్రహంబెల్ మొదట్లో ఈ పత్రికకి చైర్మన్‌గా వుండే అతడు కిల్బర్ట్ గ్రూస్ అనే వ్యక్తిని సంపాదకుడిగా నియమించాడు. మొదట్లో గ్రూస్ ఓ ఉపాధ్యాయుడు. గ్రహంబెల్, గ్రూస్ కలిసి పత్రికలో చాలా మార్పులు తీసుకువచ్చారు. ముఖ్యంగా పత్రికను సచిత్ర పత్రికగా మార్చారు. ప్రపంచంలోని ముఖ్యమైన పర్యాటక ప్రాంత చిత్రాలు ఈ పత్రికలో చోటుచేసుకున్నాయి.

ఇప్పుడు ఈ పత్రిక చందాదారులు ఒక కోటీ నలభై లక్షలమంది. కొన్నివేలమంది ఈ పత్రికకి పనిచేస్తున్నారు. దీని సంవత్సరాదాయం సుమారు 425 కోట్లకు చేరుకుంది.

ఒకప్పుడు రెండు గదుల్లో ప్రారంభమయిన దీని ఆఫీసు ఇప్పుడు పెద్ద భవనంగా మారి ఎంతో దూరం విస్తరించుకుంది.

గ్రూస్ మనవడు కారట్ ఈ పత్రికకి ప్రస్తుత సంపాదకుడు. ఈ పత్రికకి పనిచేసే సంపాదకులు, ఫొటోగ్రాఫర్లు ఎన్నో మారుమూల ప్రాంతాలను కూడా సందర్శించి అక్కడి పద్ధతులు, ప్రజల జీవన విధానం, వాతావరణం, ఆచారవ్యవహారాలు మొదలైన ఎన్నో విషయాలను తమ వ్యాసాల ద్వారా ప్రజలకందిస్తారు. వ్యాసంతోపాటు ఆ ప్రాంతపు చిత్రపటాన్ని కూడా ప్రచురిస్తారు.

సరిహద్దు తగాదాలను కూడా అధిగమించి అనేక దేశాలకు పయనించి అక్కడి విశేషాలను ఎంతోమంది ఔత్సాహిక పాఠకుల కందిస్తున్నారు ఈ పత్రిక సిబ్బంది. ప్రపంచంలోని అనేక దేశాలనుంచి వివిధ విషయాలకు సంబంధించిన ఫొటోలు ఈ పత్రిక కార్యాలయానికి చేరుతూవుంటాయి. ఇంచుమించు ప్రతి సంవత్సరం 60 వేల కలర్ ట్రాన్స్‌పరెన్సీ రోల్స్‌ను కొంటూ వుంటుంది ఈ పత్రిక.

1958 డిసెంబర్‌లో ఈ పత్రిక ఒక 'అణువు' (Atom) చిత్రాన్నిచ్చి అది 75 వేల రెట్లు పెరగడాన్ని చిత్రీకరించారు. 1977లో ఓ జంబోజెట్ తోకకి కెమేరాని కట్టి అంతరిక్షానికి సంబంధించిన ఎన్నో ఫొటోలను తీసి ప్రచురించింది.

సంపాదకుడి కాబిన్‌లో 7 మీటర్ల పెద్ద బోర్డ్ వుంటుంది. ఈ బోర్డ్‌పై రాబోయే 200 ఆర్టికల్స్ మేటర్ రాసి వుంటుంది. ఈ వ్యాసాలన్నిటిపైనా సంపాదకులు, ఉపసంపాదకులు, మానేజ్‌మెంట్ ప్రతి నిధులు ఘాటుఘాటుగా చర్చలు జరిపి ఓ నిర్ణయానికి వచ్చాక వ్యాసాలను ప్రచురిస్తారు. అప్పుడప్పుడు ఈ వ్యాసాలను ఓటింగ్ పద్ధతిలో ఎంపికచేస్తారు. ఏది ఏమైనా అంతిమ నిర్ణయం మాత్రం నేషనల్ జియోగ్రాఫిక్ మాగజైన్ ఎడిటర్‌దే.

# ఏరిన ముత్యాలు

★ తాను చేసిన తప్పుకు ప్రతివాడూ పెట్టుకునే ఓ అందమైన పేరు 'అనుభవం'

-ఆస్కార్ వైల్డ్

★ అన్ని విషయాల్లోనూ నిగ్రహం అలవర్చుకున్నవారు ఎప్పుడూ బాధలకు లోనుకారు.

-ధర్మపథం

★ నీ మాటలు ఎంతగొప్పవైనా నీ చేతలనుబట్టి నిన్ను అంచనావేస్తారు

-బ్రహ్మకుమారి

★ కంట్లో పడిన నలుసును తీయడానికి ముల్లును ఉపయోగిస్తే కన్నుకే ముప్పు వస్తుంది. అలాగే హింసామార్గంతో దేన్నినైనా సాధిద్దామనుకుంటే అది ఎదురు తిరుగుతుంది.

-థామ్సన్

★ అన్ని రుతువుల్లోనూ కోయిల కూయదు. అలాగే వైవాహిక జీవితంలోనూ అన్ని సమయాల్లోనూ ఆనందం దొరకదు.

-థామస్ ఫుల్లర్

★ ప్రణాళిక లేని కార్యక్రమము ప్రయోజనశూన్యమయినది. కార్యనిర్వహణలేని ప్రణాళిక ఉత్పత్తి శూన్యమైనది.

-స్వామి చిన్మయానంద

★ విశ్రాంతి అనే తియ్యదనం శ్రమ అనే చేదునుంచి లభిస్తుంది.

-అల్జీరియన్ సూక్తి

★ సమర్థతకు పాఠశాల లేదు.

-టర్కీ సామెత

★ మంచి అబద్ధాలకొరకు మంచి జ్ఞాపకశక్తి వుండాలి.

-అరబిక్ సామెత

★ అభిప్రాయాలను ప్రశ్నించే వ్యక్తి తెలివికలవాడు. వాస్తవాలతో పోట్లాడే వ్యక్తి మూర్ఖుడు.

-ఫ్రాంక్ ఏ. గార్మంట్

★ చెడు చింతనతో కూడిన మాటలను తవ్వి తీసెడివాడు తన మానసిక శాంతిని కోల్పోతాడు.

-సెనెకా

---

సేకరణ: **ఆముదాల అజయ్‌బాబు**

# చతుర కథలు

## అద్దం నవ్వింది

సాయంత్రం ఐదవుతుంటే స్నానంచేసి నీట్‌గా డ్రెస్ చేసుకుని వంటగదివైపు వచ్చి "రాధా! మా ఫ్రెండ్ రామ్మూర్తి దగ్గరికి వెళ్లి ఓ గంటలో వస్తాను'' అని చెప్పి వసారాలోకి వచ్చాను.

గోడవారగా చాప పరుచుకుని మా ఐదేళ్ల పాప శిరీష అద్దం చేతుల్లో పట్టుకుని బ్రహ్మాండంగా ముస్తాబయిపోతూంది.

పువ్వుపుట్టగానే... అన్నట్టు దానికి చిన్నప్పట్నుంచి మేకప్ పిచ్చి. పౌడర్లు, లిప్‌స్టికులు, రకరకాల బిళ్లలు, రిబ్బన్సు, అద్దం, దువ్వెన ఇవన్నీ ముందు పెట్టుకుని ఆకలిదప్పులు కూడా మరిచిపోతుంది.

నేను చెప్పులు తొడుక్కోవటం చూసి "ఎక్కడికి నాన్నా'' అంటూ గబగబ వచ్చి ఎత్తుకోమన్నట్లు చేతులు చాచింది.

పాపని ప్రేమగా ఎత్తుకుని ముద్దు పెట్టుకుని "ఇప్పుడే వస్తా తల్లీ ఫ్రెండ్‌తో పనుంది'' అన్నాను.

"నేనూ వస్తా నాన్నా''

"వద్దమ్మా. ఇంకోసారి తీసుకెడతాగా''

"మరి నాకు రిబ్బను రంగురంగులది తెస్తావా?"

"ఓ...."

"మా నాన్న మంచి'' అంటూ రెండు చేతుల్తో నా మెడచుట్టేసి నా చెంపలమీద ముద్దులు పెట్టుకుంది.

పాపని దింపి ఆడుకోమని చెప్పి గ్రిల్ తలుపు గడియపెట్టి రోడ్డుమీదకి వచ్చాను.

నాలుగడుగులు వెళ్లానో లేదో గోడమీదుగా ఒంగి జాజిపూలు కోస్తున్న ఎదురింటి కృష్ణమూర్తి భార్య లలిత నన్ను చూసి ఓరగా నవ్వింది. నేను ఉలిక్కిపడ్డాను.

ఎంతో డిగ్నిఫైడ్‌గా వుండే లలిత అలా నా ముఖంమీదే నవ్విందేమిటి? నన్ను చూసి కాదేమో.

మళ్ళీ చూశాను.

లలిత తలతిప్పుకుని ఇంకా అలాగే నవ్వుతోంది.

ఎన్నడూలేంది లలిత ఈ రోజేమిటి ఇలా? ఆమె 'అలాంటిది' కాదే? ఆలోచిస్తూ సందు మలుపు తిరిగాను.

ఎదురుగా పంజాబి డ్రెస్‌లో చేతిలోపుస్తకాలు పట్టుకుని వస్తున్న మా పక్కఇంటి కాలేజి అమ్మాయి నాకేసి చూస్తూనే నవ్వబోయి గభాల్న చేతిరుమాలు నోటికి అడ్డం పెట్టుకుంది.

"వెళ్లిపోతున్న ఆ పిల్లని తలతిప్పి చూశాను.

సరిగ్గా అదే సమయంలో ఆమె కూడా వెనక్కి తిరిగి నన్ను చూసి నవ్వుకుంది. నా మనసు భగ్గుమన్నట్లు అయ్యింది.

"ఛ... ఛ.... సభ్యత తెలియని మనుషులు'' తిట్టుకొంటూ వేగంగా ముందుకి నాలుగడుగులు వేశాను.

నా ఎదురుగా సైకిల్‌మీద వస్తున్న కుర్రాడు స్పీడుగా వస్తూ సైకిల్ నాకు డాష్ కొట్టబోయి 'సారీ' అంటూ నా ముఖంలోకి చూస్తూ లిప్తపాటు ఆశ్చర్యంతో నోరెళ్లబెట్టి మరుక్షణం భడాల్న నవ్వుతూ,

"వారెవ్వా'' అంటూ కన్ను కొట్టినట్లు





కుడికన్ను మూసి తెరిచాడు. నాకు ఏమీ అర్థం కాలేదు.

అప్రయత్నంగా నా అరచేత్తో నా ముఖం క్రాపు తడుముకొంటూ ఆ కుర్రాణ్ణి కోపంగా ఏదో అనబోయాను.

అప్పటికే సైకిల్ ఆమడదూరం సాగిపోయింది.

"ఏమైంది వీళ్లకి రోగం. వీళ్ల కంటికి నేను ఎలా కనిపిస్తున్నాను?"

యధాలాపంగా తల ఎత్తాను.

పక్కనుంచి ముందుకి సాగిపొయ్యారు.

మళ్లీ నా మనసు అగ్నికి ఆజ్యం పోసినట్లు అయ్యింది.

"ఏమిటి? ఏమైంది? వీళ్ళాంతా ఎందుకు నన్ను చూసి నవ్వుతున్నారు?" అనుకుంటూ నన్ను నేను పరిశీలనగా చూసుకున్నాను. పాంటు షర్టు నీట్‌గానే ఉంది. గుండీలు ఎగుడు దిగుడు లేకుండా సరిగానే పెట్టుకున్నాను. కాళ్లచెప్పులు సరిగానే వేసుకున్నాను. నన్ను నేను నఖశిఖ పర్యంతం పరీక్షించు



కాస్త వయసుమళ్లిన జంట నాకు ఎదురు వస్తున్నారు.

ఆవిడ సిగచుట్టూ పూలు పెట్టుకొని పెద్ద బొట్టు పెట్టుకుంది. కళ్లకి కాటుక. నేతచీర భుజాలనిండా కప్పుకుని చేతిలో కూరగాయల సంచి పట్టుకున్న ఆ నడివయసు ఇల్లాలు ఎదురుగా వస్తున్న నాకేసి చూస్తూనే ముసిముసిగా నవ్వుతూ చప్పున పమిట చెంగు మూతికి అడ్డం పెట్టుకుంది.

ఎటో చూస్తున్న భర్త భుజంమీద చిన్నగా కొట్టి ఏదో చెప్పింది. ఆయన తలతిప్పి నాకేసి చూసి కళ్లు తేలేసినట్టు ఆశ్చర్యపడి భళ్లున నవ్వబోయి సభ్యతకాదని కాబోలు మూతి బిగించి నవ్వు ఆపుకుంటూ నా

కుని తల ఎత్తాను.

మళ్ళీ అదే పరిస్థితి.

ఎవరో ఇద్దరు ఆడవాళ్లు నా ఎదురుగా వస్తూ నాకేసి చూసి నవ్వుతూ ఏదో చెప్పుకుంటూ సాగిపోతున్నారు.

నా ప్రాణం చచ్చినట్టు అయింది.

ముందుకి అడుగు పడలేదు.

వెనక్కితిరిగి గబగబా నాలుగు అంగల్లో ఇంటికి వచ్చాను. వసారాలో చెప్పులు విడిచి పరిగెత్తినట్లు నా గదిలోకి వచ్చి అద్దంముందు నిలుచున్నాను.

అద్దంలోని నా ప్రతిబింబాన్ని చూస్తూనే నా పెదవులమీద చిరునవ్వు కదిలింది.

ఎంత ఆగ్రహంగా వుందో నా మనసు అంత ఆహ్లాదంగా మారిపోయింది. ఎంత ఆవేశంగా వచ్చానోఅంతగా చల్లబడిపోయింది.

ఇందాకా బయటికి వెడుతూ మా పాపని ఎత్తుకున్నాను.

అప్పుడు అది మేకప్ అయివుంది. బుక్కా కొట్టుకున్నట్లు ముఖంనిండా పౌడరు అంగుళం మందాన మెత్తినట్టు దాని పెదాలకి ఎర్ర లిప్‌స్టిక్...

రిబ్బన్సు తెచ్చి పెడతాననగానే ప్రేమగా నా చెంపలమీద, నుదుటిమీద ముద్దు పెట్టుకుంది.

మందం అడుగు పూసిన మా పాప ఎర్రని లిప్‌స్టిక్ పెదవులముద్రలు నా చెంపలమీద... నుదుటిమీద...

అద్దంలో నన్ను చూసి నేనే నవ్వటం మొదలుపెట్టాను.

-కాకాని కమల

---

## లాభం!

నమ్మాలేకానీ ఎంతటి అబద్ధాన్నయినా కళ్లతో చూసినట్టు చెప్తాడు భీమారావు. ఆఫీసులో అతని విషయం అందరికీ తెలిసిందే. ఇంటి దగ్గరమాత్రం అతనికి పట్టపగ్గాలుండవు. కారణం భీమారావు ఎంత డాంబికమయినవాడో అతని భార్య అంత అమాయకురాలు. పల్లెటూళ్లో పుట్టి పెరిగిన అక్షర జ్ఞానం లేని మనిషి. ఒకసారి అర్జంటుపని మీద విజయనగరం వరకూ విమానంలో వచ్చి అక్కణ్ణుంచి కారులో వచ్చానంటాడు. ఇంకోసారి శ్రీకాకుళంలో బీచ్‌లో ఏదో వస్తువు చవగ్గా కొన్నానని చూపెడతాడు. అలా భార్యని నమ్మిస్తాడు.

• ఓసారి ఎక్కడికో కేంపెళ్లి ఓ చీర పట్టుకొచ్చాడు. "అబ్బ! ఎంత బాగుందండీ'' అని అతన్ని వాటేసుకొని, చీరని ముద్దుపెట్టేసుకుని, "ఎంతయిందండీ?" అనడిగింది భార్య.

"అయిదొందలు'' అన్నాడు భీమారావు.

"అబ్బ, ఇలాటిదే పక్కింటి సరస్వతిగారు ఎనిమిదొందలేభయికి కొన్నారీమధ్యన" అంది కళ్లింతలు చేస్తూ.

"పిచ్చిమొహమా! వాడు అయిదు వందలిమ్మన్నాడు నేను రెండొందలే ఇచ్చాను. వాడు నాక్కాబట్టి ఇచ్చాడు. మనమంటే ఏమనుకున్నావు?" అన్నాడు.

ఆ తరువాత ఆడంగులందరూ కలిసినపుడు చీరను చూపెట్టింది భీమారావు భార్య. అడిగితే ధర చెప్పింది. వాళ్లు ముక్కుమీద వేలేసుకున్నారు. మాకూ తెప్పించు డబ్బులిస్తామన్నారు. ఆ రాత్రి భీమారావుకి ఆ విషయం చెప్పింది సరే చూద్దాంలే అన్నాడు భీమారావు.

భీమారావు ఏ వస్తువు కొన్నా దాని ధర సగం తగ్గించి భార్యకి చెప్పటం అలవాటు. తెచ్చి ఊరుకోక 'ఎంతవుతుందో చెప్పుకో' అని భార్యని అడగటం ఆమె చెప్పలేకపోవటం 'జడ్డిమొహమా!' అని ఆ వస్తువు ధర చెప్పటం కూడా అతనికి అలవాటు. అప్పుడప్పుడు ఆమె చిన్నబుచ్చుకుంటుంది కూడా.

ఒకసారి ఆమె పుట్టినరోజుకి పొళ్లగాజులు చేయించాడు. అయిదు తులాల ఎత్తువి. ఆమె పొంగిపోయి "ఎంతయిందండీ?" అని అడిగింది.

"ఊహించు''

"కనీసం ముప్పయి వేలన్నా''

"జడ్డిమొహమా? వీటి ధర నలభైవేలు. కానీ మనకి పదివేలుకే వచ్చాయి''

"అదెలా?" కళ్లప్పగించింది.

"మనకి తెలిసివాడు షిప్పులో పనిచేస్తు






న్నాడు. మనతో అతనికి పని ఉంది. అందు వల్ల బిస్కట్ బంగారం మనకి చవగ్గా వచ్చింది'' అన్నాడు.

"ఆc..." ఆశ్చర్యపోయింది అతని భార్య.

ఆ మర్నాడు... "ఏమండీ... నన్నెప్పుడూ జడ్డిమొహమని, నాకేం తెలీదని అంటారా? ఇవాళ నా తెలివి తేటలుకి మీరు డంగయిపోతారు తెలుసా?" అంది గోముగా.

"ఏంటే? అంత తెలివయిన దానివైపోయావ్!"

"ఆc... కాకపోతే ఆరు మాసాలు సావాసం చేస్తే వారు వీరౌతారంటారే..."

"ఇంతకీ ఏంటే నువ్వు చేసిన ఘనకార్యం?"

"వినండి. మనకి ఆ గాజులు పదివేలుకే వచ్చాయన్నారుకదా? నేనవి ఇరవై వేలుకమ్మేశాను పక్కింటి పిన్నిగారికి. పదివేలు లాభం. ఇప్పుడేమంటారు?" అని ఇరవైవేలూ తీసి భీమారావు చేతిలో పెట్టింది.

భీమారావుకి వొళ్లంతా చలవలుకమ్మేసింది.

-పి.వి.బి.శ్రీరామమూర్తి

## లక్కీ ఛాన్స్

శశిరేఖకు పెళ్లిచూపులు జరుగుతున్నాయి. ఇప్పుడొచ్చిన సంబంధం పన్నెండోది. ఆమెకీ సంబంధం ఇష్టంలేదు. నిజం చెప్పాలంటే ఇష్టంలేనిదీ సంబంధం కాదు... అసలు పెళ్లే ఇష్టంలేదు. కాని పెద్దవాళ్ల పంతాలు... పట్టింపులు... బెదిరింపుల మూలంగా బలవంతంగా తతంగానికి తలొంచాల్సివస్తోంది. ఇప్పుడామెను చూడ్డానికొచ్చిన అబ్బాయి అందంగా... హుందాగా... చిలిపిగా... చెప్పాలంటే హీరోలా ఉన్నాడు.

అతను శశిరేఖను చూసి కళ్లల్లో ప్రేమపుష్పాలను పూయిస్తే అది గమనించిన శశిరేఖ అతన్ని కాల్చుకుతినేలా చూసింది.

"కల్సిజీవించాల్సినోళ్లని కాసేపు ఒంటరిగా వదిలేస్తే బావుంటుందేమో..." అంది ఆ తతంగంలోని ఒక పెద్దతలకాయ.

సరేలెమ్మంటూ పెద్దలంతా అమ్మాయిని, అబ్బాయిని ఒంటరిగా వదిలేసి... పక్కగ

దిలో కట్నబేరసారాల్లో మునిగిపోయారు.

ఎన్ని అబద్ధాలా డైనా సరే ఈ పెళ్ళినుండి తప్పించుకోవాలని నిశ్చయించుకుని ఒంటరి వాతావరణంలో తుంటరివేషాలకు తావులేకుండా సంభాషణని సాఫీగా ప్రారంభించింది శశిరేఖ.

"నేను మీకు నచ్చానా?"

"చాలా... చేసుకుంటే మిమ్మల్నే పెళ్లి చేసుకోవాలి. లేకుంటే జీవితాంతం బ్రహ్మచారిగా మిమ్మలే ప్రేమిస్తూ ఉండిపోవాలనిపిస్తోంది'' చిలిపిగా నవ్వుతూ చెప్పాడతను.

"మీరు నాకు నచ్చలేదు'' ఖచ్చితంగా చెప్పేసింది శశిరేఖ.

"ఇప్పుడు సంసారాలు సాగిస్తున్న నూటికి తొంభైమంది దంపతుల్లో పెళ్ళికిముందు భార్యా భర్తల్లో ఎవరో ఒకరికి నచ్చలేదని ఒక సర్వేలో తేలిందట. అలాగే... మన పెళ్లి అయినతర్వాత అంతా సర్దుకుపోతుంది లెండి'' అదేం పెద్ద విషయం కానట్లు తేల్చిచెప్పాడు.

ఆ సమాధానంతో ఒళ్లుమండి "నేనింతకు ముందే ఒకర్ని ప్రేమించాను'' అందామె.

"మీదెంత చిన్న మనసండీ... మీరు ప్రేమించింది ఒక్కర్నేనా? ఈ విశాల ప్రపంచంలో మీరెంత ఎక్కువమందిని ప్రేమిస్తే అంత ఎక్కువగా సంతోషించేవాడిని'' అని ఫరవాలేదన్నట్టు చూశాడు.

అతను తను కల్పించి చెప్పిన ప్రేమ విషయాన్ని నెగిటివ్‌గా గుర్తించలేదని గ్రహించి "నేను ప్రేమించింది ఓ యువకుడిని. అతని మూలంగా అబార్షన్ కూడా చేయించుకోవలసివచ్చింది'' చాలా కరకుగా చెప్పింది.

"అయ్యో... ఎంత కఠినంగా వ్యవహరించారండి. పొరపాట్లు ఎవరైనా చేస్తారు. వాటిని దిద్దుకోవడంలోనే సరిగ్గా వ్యవహరించాలి. మీరు పండంటి బిడ్డకు జన్మనిచ్చి ఉంటే ముచ్చటగా పెంచుకునేవాళ్లంకదా... పైగా పెళ్ళయింతర్వాత మీకు బిడ్డనుకనే శ్రమ కూడా తప్పేది'' అంటూ నొచ్చుకున్నాడతను.

అతని ధోరణి చూసి శశిరేఖకు అరికాలి మంట నెత్తికెక్కిపోయింది. 'ఇక పచ్చిగా హెచ్చరిస్తేగాని వీడు నన్నొదలి పారిపోయేట్టు లేడ'ని కసిగా మనసులోనే తిట్టుకొని "చూడండి... నేను పెళ్లయిన తర్వాత నాకు నచ్చినవారితోనే క్లోజ్‌గా ఉంటూ అతన్ని ఎంజాయ్ చేస్తూ, అతని అడుగుజాడల్లోనే నడుచుకుంటాను. బాగా ఆలోచించుకొని మీ



నిర్ణయం చెప్పండి'' తీవ్రస్వరంతో చాలా సీరియస్‌గా చెప్పింది.

అతను ఒక నిముషం మౌనంగా తల పంకిస్తూ కూర్చుండిపోయాడు.

అతని మౌనాన్ని చూసిన శశిరేఖ లోలో పల ఆనందిస్తూ "మీకీ సంబంధం ఇష్టంలే దుకదూ'' అంటూ ఉత్సాహంగా అడిగింది.

"లేదు నాకీ సంబంధం ఇష్టమే. అయితే చిన్న మార్పు. మీరు భర్తగా ఎవర్ని పొంది నా సంతోషమే. కాని మీకు నచ్చినవాడిగా ఉండే ఆ లక్కీఛాన్స్‌ను మాత్రం నాకిస్తే మీ ఎంజాయ్‌మెంట్‌కి పూర్తిగా సహకరించగల ను'' అని హామీ ఇస్తూ యధావిధిగా చిరున వ్వులు చిందించాడతను.

ఆ మరుణక్షం శశిరేఖ అక్కడ లేదు.

పెళ్ళి వద్దంటున్న ఆమె మంకుపట్టును పెద్దల ద్వారా ముందుగానే తెలుసుకున్న అతను మాత్రం నవ్వుకుంటూనే ఉన్నా డింకా.

ఎస్.ఎం.కె.

---

## చైతన్యం

"ఏం వళ్ళెలా ఉందేం? ఈమధ్య బాగా పొగరెక్కిపోయింది నీకు! ఇదసలు భోజన మేనా?" కంచాన్ని విసురుగా తోసి కళ్ళెర్రచే స్తూ అరిచాడు రమణారావు.

భర్త ధోరణికి భారతి కన్నీళ్ళు కంట్లోనే ఇంకిపోయాయి. భర్త అభిరుచుల్ని దృష్టిలో ఉంచుకుని అందుకనుగుణంగా ప్రవర్తించా లని ఎంతకాలంగా ఎంత కష్టపడుతోన్నా ఇంతే! అడపాదడపా ఏదోవంక పెట్టి తనను తూలనాడ్డమో చేయి చేసుకోబోవడమో చేస్తే నేగానీ ఆయనకు తృప్తి ఉండదు.

కంచంలోంచి చెల్లాచెదురుగా పడిన పదార్థాల్ని ఏరివేసేందుకు ముందుకు వంగింది భారతి నిర్వికారంగా.



"వెధవ కొంప.. వెధవకొంపాని, ఒక నవ్వులేదు, పలకరింపులేదు. నా బతుక్కి సుఖపడే యోగంలేదు. ఛీఛీ..." అను కుంటూ అక్కడినుంచి కదిలి డ్రాయింగ్ రూమ్‌లోకి చేరుకుని రైటింగ్ పాడ్‌ముందు వేసుకుని, రాత పనిలో బిజీ అయిపోయాడు

రమణారావు.

పదేళ్ళక్రితం రచనలు చేయడం ప్రారంభించిన రమణారావు కొద్దిపాటి స్టార్టింగ్ ట్రబుల్‌తో రెండేళ్ళలో తన రచనలను అడపాదడపా అచ్చులో చూసుకునే స్థితికి చేరుకున్నాడు.

ఆ తర్వాతే అసలు సమస్య ఎదురైందతడికి.

గతంలో ఎన్నో పోటీల్లో పాల్గొన్నాడుగానీ ఏ రచనకూ బహుమతి వచ్చిన పాపానపోలేదు. అసలు సాహిత్యంమీదేమాత్రమూ అవగాహనలేని బడుద్ధాయి ఎడిటర్ల చేతుల్లో తన రచనలు పడడంవల్లనే ఏ బహుమతీ రాలేదనే ఊహ కూడా లేకపోలేదు. ఒక రచనలో వాస్తవిక దృక్పథం ఎంత తక్కువగా ఉంటే, ఆ రచనకు బహుమతి వచ్చే అవకాశం అంత ఎక్కువగా ఉంటుందని చాలామంది ఘోషిస్తూండడం కూడా తన చెవిన పడకపోలేదు.

మూడేళ్ళక్రితం ఓ రోజు ఇంటికొచ్చి చికాకుపడిన మనసుతో భార్యమీద తొలిసారిగా నోరు చేసుకున్నాడు. ఇష్టం వచ్చినట్లు తిట్టేశాడు. తన ఆవేశానికి ఆ తర్వాత తనకే బాధ కలిగినమాట వాస్తవం. కానీ సదరు ఆవేశంతో ఓ కథ రాసి దాన్ని పోటీకి పంపిస్తే మొదటిసారిగా తనకథకు బహుమతొచ్చింది.

అంతే! అప్పట్నుంచి విజృంభించాడు తనలోని రచయిత. ఏ పోటీకి రాయాలన్నా, ఇంటికొచ్చి పెళ్లాన్ని బండబూతులు తిడితే తన మనసు అద్భుతంగా పనిచేస్తోంది! ఆడాళ్ల బాధల్ని గురించి అద్భుతంగా రాస్తున్నానంటున్నారు అందరూ.

పాపం పిచ్చిది! తనకు నిజంగా కోపంవచ్చే తిడుతున్నాననుకొంటోంది.

అయినా తనకు పేరొస్తే దానికొచ్చినట్టు కాదూ? తను మాత్రం... రచనలద్వారా సంపాదించిన డబ్బు కుటుంబానికే ఖర్చుపెట్టడం లేదూ?"

మనసు సరిపెట్టుకుని సీరియస్‌గా సీరియల్ నవల రాయడంలో బిజీ అయిపోయాడు రమణారావు.

★ ★ ★

ఆఫీస్ చిరునామాకు వచ్చిన టెలిగ్రామ్ చదువుకున్న రమణారావు ఆనందం అంతా ఇంతా కాదు. అంతవరకూ అతడు కథలకే బహుమతులందుకున్నాడు. కానీ తొలిసారిగా అతడి నవల బహుమతికెంపికైంది.

హుషారుగా టెలిగ్రామ్ జేబులో పెట్టుకుని, మధ్యాహ్నం పర్మిషన్ తీసుకుని స్వీట్స్ పాకెట్‌తో ఇంట్లోకి అడుగు పెట్టిన రమణారావుకు బార్లా తెరచిన తలుపులు చూసి ఉక్రోషం తన్నుకొచ్చింది.

'తలుపులు బార్లా తెరిచి ఎక్కడ పెత్తనాలు చేస్తోందిది?' అనుకుంటూ అన్ని గదులూ చూసి, చివరికి పెరట్లోకి ప్రవేశించిన అతడికళ్లు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

అక్కడ... ఓ చేత్తో పెన్నూ, కాగితాలూ, మరో చేత్తో రూళ్లకర్రా పట్టుకుని నిలబడి ఉంది భారతి.

రమణారావును చూస్తూనే నవ్వుమొహంతో "రండ్రండి... ఈ రోజు నుంచీ నేను కూడా కథలు రాయాలనుకుంటున్నాను. మామూలు కథలు కాదు, వాస్తవిక దృక్పథం కలిగిన కథలు. నాకు పేరొస్తే మీకు పేరొచ్చినట్టుకాదూ? రండి, రండి. ఆవేశం వస్తేగానీ కథకు మూడ్ బలంగా ఉండేలా లేదు అంటూ రూళ్లకర్ర పైకెత్తి ముందుకు ఉరికిందామె, కొంగు తిప్పి బొడ్లో దోపుకుంటూ.

స్త్రీ, పురుషుడిమీద తిరగబడడాన్ని అద్భుతంగా చిత్రించే రచనలు చేసి పేరు తెచ్చుకున్న రమణారావు, తనింటి పెరట్లో ఉవ్వెత్తున లేచిన చైతన్య కెరటం తాకిడికి తట్టుకోలేక ఉన్నచోటే చదికిలబడిపోయాడు.

-సీతాసత్య





# వాంతి

బస్‌స్టాండ్ అంతా కోలాహలంగా ఉంది. పనీపాటాలేని షోకిల్లాలు మొదలు... ప్రతి చిన్న విషయానికీ దేశం తల్లకిందులైనంతగా హడావుడి చేసే పల్లెటూరి వారివరకూ ఎవరి కివారు సందడి సృష్టించేస్తున్నారు. కొందరు జోకులు పేలుస్తుంటే... మరికొందరు విసుగుచెందిన ప్రయాణికులు ఆర్టీసిమీద కోపంతో తిట్లు కురిపిస్తున్నారు.

ఈ సందడితో తనకేం సంబంధం లేనట్టుగా ఒక మూలగా ఉన్న బెంచీమీద కూర్చుని తన తర్వాతి నవలకి కావలసిన ప్లాటుకోసం ఆలోచిస్తున్నాడు ఉమానాథ్. తానొక సామాజిక స్పృహగల గొప్ప అభ్యుదయ రచయితనంటాడు. ఈమధ్య... మహిళలకు జరిగే అన్యాయాలను ఎలా చీల్చిచెండాడాలి? స్త్రీ సంక్షేమం కోసం ఏవిధంగా పాటుపడాలి? అన్న సబ్జెక్ట్‌మీద "ఆడాళ్లూ... తొడకొట్టండి'', "మహిళలూ... తెడ్డు విసరండి'' వంటి నవలలు రాసిపారేశాడు. అయితే పాపం ఏ ఎడిటరూ, పబ్లిషరూ కూడా ఆ పుస్తకాలకు వెలుగునివ్వలేదు. వారంతా సంకుచిత భావాలతో, తన పుస్తకాలను అచ్చువెయ్యలేదని విమర్శిస్తూ కనపడ్డవాడిముందల్లా చెరిగేశాడు.

అయినా పట్టువదలని విక్రమార్కుడిలా స్వంతంగానే ఆ రచనలను ప్రింట్ చేయించి జనంమీదకి విసిరేశాడు. ప్రస్తుతం అటువంటి మరో పుస్తకాన్ని సమాజంమీదకి గిరవాటెయ్యాలన్న తపనతోనే అతను ప్లాటు కోసం ఈ పాట్లు పడుతున్నాడు.

ఇంతలో ఒక ఎక్స్‌ప్రెస్ స్పీడుగా వచ్చి కీచుమంటూ ఆగింది. ఆ బస్ మధ్యగా వున్న విండోసైడ్‌లో ఒక మెరుపు మెరిసింది.



మెరుపంటే మెరుపు కాదు... ఒక అందమైన తళుకు! అక్కడున్న కుర్రకారులో ఉత్సాహం! కాని ఆమె పరిసరాలను పట్టించుకోకుండా తన సీట్‌లోనే తలవంచుకుని విసుగ్గా, సీరియస్‌గా ఉంది.

ఆ అందని అందానికి కళ్లతోనే బంధాలేస్తూ మైమరచిపోతున్నారు కుర్రాళ్లు. మేము మాత్రం తక్కువా అన్నట్టు వయసుపైపడ్డ కొందరు పక్కనున్న భార్యలకు వినిపించకుండా లొట్టలు వెయ్యడం మొదలెట్టారు.

లంచ్‌టైమ్ కావడంతో డ్రైవరూ, కండక్టర్‌లు పక్కనున్న హోటల్‌లోనికి దూరిపోయారు. ఆ బస్‌నుండి దిగేవాళ్లు దిగితే ఎక్కేవాళ్లు ఎక్కుతున్నారు. సరిగ్గా అప్పుడే...

పాపం... కుర్రకారు దృష్టంతా ఆ మెరుపు మీదపడి దిష్టి తగిలిందో ఏమో... ఆమె సడెన్‌గా విండోలోంచి తల బైటికి పెట్టి వాంతి చేసుకుంది. జనంలో ఒక్కసారిగా సంచలనం రేగింది.

"అబ్బా... అప్పుడే అమ్మాయి అమ్మయిపోతోందిరోయ్'' అని ఓ కాలేజి స్టూడెంట్ కామెంట్. వెంటనే 'తందాన' అన్నట్టు మిగతావాళ్ల నవ్వులు.

"శ్రీమంతానికి వెళ్తోందేమో!" ఓ పోకిరిగాడి ధర్మసందేహం. మళ్ళీ నవ్వులు.

అప్పటివరకూ పరిచయాల్లేక ఎడమొగం పెడమొగంగా ఉన్న అమ్మలక్కలంతా క్షణంలో ఆత్మీయంగా కల్సిపోయి బుగ్గలు నొక్కుకుంటూ పుల్లవిరుపు విసుర్లు గుప్పించేస్తున్నారు.

"ఛీ! నోర్మూయ్యండి. అమ్మాయికి ప్రయాణం పడక వాంతులయ్యుంటాయి. ఆ మాత్రానికే ఇంత రాద్ధాంతమా?" అన్నీ వింటూ ఒళ్లుమండిన ఒక ముసలాయన మందలింపు.

ఇదంతా గమనిస్తున్న ఉమానాథ్ చెవుల్లో బాధ! గుండెల్లో వ్యథ!!

అతనిలో ఉన్న అభ్యుదయం హృదయాన్ని చీల్చుకొని బయటికి వచ్చేసింది. వెంటనే ఆ అమ్మాయి వున్న విండో వద్దకు దూసుకుపోయాడు.

"చూడండి... మీరు వాంతి చేసుకోవడంమీద ఇక్కడంతా ఎవరి నోటికొచ్చినట్లు వాళ్లు వాగుతున్నారు. ఒక స్త్రీమీద అకారణంగా వాళ్లు వేసే... నిందల్ని నేను సహించలేకపోతున్నాను. రండి వచ్చి మీ వాంతి వెనుక ఉన్న అసలు కారణాన్ని చెప్పి వాళ్ల నోళ్లు మూయించండి. స్త్రీల పవిత్రతను కాపాడండి!" అంటూ ఆమెను ఆవేదనగా అర్థించాడు.

ఆమె ఉలిక్కిపడి అతనివంక అయోమయంగా చూస్తూ కొంచెం తేరుకొంది. "నా గురించి ఎవరేమనుకున్నా పట్టించుకోను. వాళ్ళ కర్మ వాళ్లే అనుభవిస్తారు. మీకు నా మీదున్న అభిమానానికి థాంక్స్! ఇంతగా అడుగుతున్నారు కనుక చెప్తున్నాను. నా వాంతికి కారణం వాళ్ళనుకున్నదేదీ కాదు. ఇదిగో ఈ దిక్కుమాలిన నవల! ఒక్కో పేజీ చదువుతున్నకొద్దీ కడుపులో దేవినట్టయి వాంతులు పోతున్నాయి'' అంటూ ఆ నవలను బయటకు పెట్టింది.

"మీరు కొంచెం శ్రమ అనుకోకపోతే... దీన్ని ముక్కలు ముక్కలుగా చించి ఆ చెత్తకుండీలో పడెయ్యగలరా? ఈ చెత్త రచన మరొకరిని బాధించకూడదనే నా అభ్యర్థన. దయచేసి ఈ పని కానివ్వండి'' అని అతని చేతిలో పడేసింది.

డ్రైవర్ ఎప్పుడెక్కాడో కాని మరుక్షణం బస్సు అక్కడనుండి కదలిపోయింది.

ఆ పుస్తకాన్ని అందుకున్న ఉమానాథ్ ఆశ్చర్యంతో ఒక్కసారి దానివైపు చూసి అవాక్కై నోరుతెరిచాడు.

అది అతను రాసిన పుస్తకమే!!

-శ్రీకాంత్ చౌదరి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: VIPULA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

TURA Telugu Monthly Hyderabad - 500 482 Regd. No. H/HD/402

# మీరు చదివారా?

అమ్మకాలలో సరికొత్త రికార్డులు సృష్టించిన...



## అమెరికా అదృష్టం!

-సుమన్

ఆద్యంతం 'నవ్వు'రసభరితం




హాస్యానికి నిత్య నీరాజనం!

## 'సభ్య'సమాజం

-సుమన్

కాపీలకి –
మీ దగ్గరలోని ఈనాడు ఏజెంటుని గాని,
ఆఫీసుని గాని సంప్రదించండి.